i

वन्दे मातरम्

# దయాదర్శము





రచయిత:

పాటిబండ్ల వేంకటసుబ్బయ్యచౌదరి

వైరా (నైజాం)

వెల రూపాయిపావలా మాత్రమే

(పోష్టేజీ వేరు)

పి. వి. యస్. చౌదరి.

జీవదయా ప్రచారకుడు

వైరా పోష్టు.

(వయా) ఖమ్మం, (నైజాం)

# తొలిపలుకు

ఏతద్గ్రంథరచయిత ఆబాల్యము అహింసా నియమ బద్ధుడు. సాహంకార వివాదాంధకారయుక్తమైన వర్తమాన సంఘమునందు మానవప్రీతికై వాదాచారములు, "ప్రక్కవానిని ప్రేమించు" మను బాపూజీ సత్యసూక్తికి వికటమైన విషబుద్ధులు సమసిపోవుటకు, అహింసాప్రబోధక జ్ఞానదీపికలెన్నేని ఈనాడు అత్యావశ్యకములు. అట్టివానిలో ఈ పొత్తమొకటనుట నిస్సందేహము. వసుధైక ప్రభుత్వమునందుకు దానికి మూలాధారము విశ్వమానవ సౌభ్రాతృత్వము. ఇందుకు పునాది ప్రేమ, ప్రేమకు ప్రాణము అహింస. కాన అహింసా ప్రచారమునకు ఎన్నిప్రచురణలైనను వెగటు గలిగింపజాలవు. పరిణామాంతము విప్లవము. ఆదిమ మానవ సమాజమునుండి అనంతవిప్లవ ఫలితమే నేటి మనసంస్కృతి. చరిత్రకు ముందడుగే కాని వెనుకచూపు మృగ్యము. మానవాభ్యుదయమునకు విశాలదృష్టి, ఆత్మవిమర్శన, సంఘవ్యాపితమైన అజ్ఞాననిర్మూలనములు కావలసిన పరికరములు. ఎదుటివాని దుష్కర్మను జూచి తాను సత్కర్మరతుడగుట, ఎదుటివాని యజ్ఞానమును గాంచి తాను జ్ఞానియగుట, సమస్తవిశ్వమునకు సౌఖ్యమే గమ్యస్థానమగుటకు ఎదుటివారి బాధల దొలగించుటకు పరహింసమానుట మొదలగునవి అలవాటు పడుటకు ఓర్పు, నిర్లుబ్ధత, అనసూయాదులు ఆవశ్యకములు. ఇందుకు సంపూర్ణమగు అహింసాయుతమైన చిత్తవృత్తివినా మరొకసాధనము లేదు.

వడ్లమూడి
గుంటూరుజిల్లా
1-2-1950

వాసిరెడ్డి వేంకటాచలపతి
వరప్రసాద్.

# మనవి

సోదరీ సోదరులారా !

నేను అహింసా ప్రచార మారంభించినది మొదలు కరపత్రములును, చిన్ని చిన్ని పొత్తములును గచియించి ప్రకటించి యుంటిని. ఈ గ్రంథము 1939 లో వ్రాయబడినది.

ఆర్థిక లోపముచే వెనుకాడిన నాకు అచిరకాలములోనే ప్రకటించుటకు సాయమొనరించిన దాతలకును, ప్రత్యేకముగా సత్కరించిన శ్రీయుత నంబూరు శ్రీహరిరావుగారికిని, తొలిపలుకు వ్రాసిన వారును, బహుభాషా కోవిదులునగు శ్రీయుత వాసిరెడ్డి వేంకటాచలపతి వరప్రసాద్ గారికిని, సుహృద్భావముతో దమ తమ యభిప్రాయములఁ బంపిన పండితవర్యులకును, ఈ అహింసా ప్రచారమునకు ప్రోత్సాహ మొసఁగిన దక్షిణ హైదరాబాదు, శ్రీ జీవరక్షాజ్ఞాన ప్రచారక మండలి వారికిని కృతజ్ఞతా పూర్వక వందనములు.

గీ॥ ధర్మములయందహింస యుత్తమముగాన
తత్సుధర్మంబు నెరవేర్చు ధన్యతములు
పూజ్యు లుత్కృష్టులని మున్ను బుధులువలికి
రట్టి ధర్మంబుఁ బాలింపుఁ డయ్యలార !

– రచయిత

D-32

**पाटिबंड्ल वेंकटसुब्बय्या चौधरी**

जीवदया प्रचारक, वैरा निवासी, जिला वरंगल (निजाम)



పాటిబండ్ల వేంకటసుబ్బయ్య చౌదరి

**జీవదయాప్రచారకుడు, వైరా, జిల్లా వరంగల్ (నైజాం)**

# పండితాభిప్రాయములు

**సుప్రసిద్ధ శుద్ధాంధ్ర నిర్వచన సత్యా వివాహాది**
**ప్రబంధకర్తలును అష్టావధానులు నగు**
**శ్రీ జంగా హనుమయ్యా చౌదరిగారు.**

ఈ దయాదర్శము: అను నీ యుత్తమ గ్రంథమును మొదటినుండి చివరవరకును జదివితిని. ఇందలి భావములు ప్రజలందరికిని యాదర్శములుగా నున్నవి. ఈ గ్రంథమునఁ బ్రత్యక్షరమం దుల్లేఖింపఁబడిన భూతదయ బుద్ధభగవానుని జ్ఞప్తికి దెచ్చుచున్నది. ఏతద్గ్రంథకర్త అహింసాధర్మమును స్వయముగా నిర్వహించుచు కష్టనష్టములఁ బాటింపక ఏతద్ధర్మ నిర్వహణమునకై బహుప్రాంతములను వేలకొలఁది గ్రామములను సంచార మొనర్చి తనజీవితమును సార్థక మొనరించు కొనుచున్నాడు. ఇతఁడు బాల్యమున నాకు శిష్యుఁడైనను చిరకాలమునుండి యుత్కృష్ట ధర్మనిర్వహణ ప్రచారముచే పూజ్యుఁడై యిప్పుడు నామనంబున పూజ్యస్థాన మలంకరించి యున్నాడు

లక్ష్మీపురం (వైరా)
21-11-1939

జంగా హనుమయ్యా చౌదరి
అష్టావధాని

మద్రాసు ప్రభుత్వ తెలుగు ఆస్థానకవులును,
సుప్రసిద్ధ శతావధానులు నుభయభాషా కోవిదులు నగు
బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ళ వేంకటశాస్త్రిగారు

శ్రీ మత్సరదేవతాయైనమః

దయాదర్శము, అను నీ అహింసా బోధక గద్యమును. కృ॥డి॥నందిగామ తాలూకా వీరులపాటి వాస్తవ్యులు కమ్మవారు (రాజబంధువులు)మ.రా. శ్రీ పాటిబండ్ల వేంకటసుబ్బయ్యచౌదరి గారు రచియించిరి. నాకు వినిపించిరి. వింటిని. ఈయన ఈ పుస్తకము లో వ్రాసిన అక్షరములన్నియును ఆచరణలో పెట్టుచున్న నిషధయోగ్యుడు. ఇట్టివాడు మాంసభక్షకుడు కాడని వ్రాయుటలో విశేషము లేదు. ఈయన సర్వప్రవృత్తిని, సర్వస్వమును, అహింసా ప్రచారమునకు వినియోగించుచున్నాడు. ఈ సందర్భములో మాంసభక్షులగానుండు బంధువులేమి, ఇతరులేమి యీయనను ద్వేషించుటలో ఆశ్చర్యము లేదు. ఆ కారణము వలన కొన్నిజాతరలకు వెళ్లి అహింసను ప్రచారము చేయునపుడీయన యెన్నియో కష్టముల నెదుర్కొనవలసివచ్చుననుట నిర్వివాదము. అవియన్నియు ఈయన బుద్ధునివలెనే సహించుచున్నాడు. భగవంతుడు తనకు శోభించిన యుక్తులనన్నింటిని ఈయన యీపొత్తమందుదాహరించెను. అందు కొన్ని ప్రతిపక్షులు ఖండించినను అంతమాత్రమున ఈయనఉద్యమము ఖండించినట్లుగా తలపరాదు.

'హింస యుక్తమా? అనేదే ప్రధానాంశము. యుక్తమని సాధించువారు పాపులు, కాదని సాధించువారు పుణ్యులు. యజ్ఞయాగాదులలో కూడ హింసకు చోటీయ కూడదనియే

యీయన వ్రాసినారు. అహింసాపరులట్లే వ్రాయవలయును. శుకునంతవాడు

"క॥ కర్మము లను నెపమున దు
ష్కర్మంబగు హింస సలుపఁగా జేయుచు నం
తర్మదము పెంచు నాగమ
మర్మంబుల నామనంబు మసలదు తండ్రీ! (దేవీభా. 1 స్కం)

అన లేదా! నైమిశారణ్యవాసులు మునులు, "జన్నములు పెక్కు పశుహింస సలుపకుండ" అన్నారు. పిష్టపశువుతో నెఱవేర్చుకొనుటయే యుక్తమని పలువురు బ్రాహ్మణులట్లే చేయుచున్నారు. పురాణములలో అట్టివిధానమునకే ఆధారములు కలవు. బ్రాహ్మణులుకూడ (పంచద్రావిడులన్నమాట) మాంసభక్షకులుగానున్న రోజులలో యజ్ఞ పశుహింస అంత హేయముగా నుండకపోవుగాక. ఆ కర్మలవృత్తియే పూర్వపుణ్యముననో (అంత ఆకీగాదు) అంతరించిన యీకాలములోకూడ నెందులకీ నిర్బంధ పశుమారణమనియే యీయన యభిప్రాయము. ఇది నూతనము గాదు. చాల ప్రాచీనమే. ఇందులో విజయము మాత్రము కష్టసాధ్యము. అగుఁగాక. ఈ మున దీక్షవలన తరించి తీరునని దృఢముగా చెప్పవచ్చును. ఇట్టివారు పలువు రీకాలము లో ప్రయత్నించువారు కలరనుట ముదావహము. యజ్ఞకర్తలు కసాయి వారి నాపఁ గల్గిరా? మనుష్య నాపుటేల? మేము లోకువ యనియా? అని యుక్తిచెప్పుట మిగుల శోచ్యము. కటిక వాండ్రు సుకృతముకలుగునని హింసాకృత్యము చేయుట లేదు. యజ్ఞకర్తలో పుణ్యము కలుగునని చేయుచున్నారు. గోదేవి, అనుపాత్రములో దీనింగూర్చి విస్తరించితిని. ఈగ్రంథకర్త ధన్యుఁడు. ఈయన

ఉద్యమము ధన్యము. భగవంతుఁడీయన కాయురారోగ్యభాగ్యాది శ్రేయస్సులు ప్రసాదించుఁగాక. ఏయే క్షేత్రములలో నేయే రీతి జంతుహింస జరుగుచున్నదో ఈయన యీ పుస్తకములో వ్యాకరించిరి. చదువరులుచూచి తోడ్పడుదురుగాక.

క్షీరసాగరం బిల్డింగు — వేం॥ శా॥ శతావధాని.

గవర్నరుపేట — 6-3-1943.

విజయవాడ

---

ఆంధ్రహిందీ సుబోధి న్యాది బహు గ్రంథకర్తలును,
సుప్రసిద్ధ హిందీప్రచారకులు నగు
శ్రీయుత చదలవాడ కోటినరసింహముగారు
శ్రీయుత పాటిబండ్ల వేంకటసుబ్బయ్య చౌద్ధరిగారు
రచియించిన "దయాదర్శము"నుదర్శించు సౌభాగ్యము సంభవించినది. సంతోషించితిని.

"హింస చేయని వాఁడు లేఁడిజ్జగమున" అని పామరులును, యజ్ఞ మను పేరఁ బండితులును హింసావాదు లగుచున్నారు. ఇట్టి కుక్షింభరుల కువాద మహావృక్షమును కూకటి (వేళ్ళతోఁ బెకలించు) వీరి రచనా విధాన ప్రశయ మారుతము ప్రశంసనీయము-ఆచరణీయము

వీరి నిరాడంబర జీవనమును, అమాయకత్వమును జూచినచో వేమన కవి సార్వభౌముఁడు స్ఫురించును. స్ఫురించుటయే గాదు "జీవ హింసకులకుఁ జిక్కునా మోక్షంబు" అని ఏనాఁడో

ఘోషించిన తన శపథమును నెరవేర్చుకొనుటకై మజిల వేంకట సుబ్బయాఖ్యుడుగా జన్మించెనేమో యను భ్రమ జనించును. అప్పటి వేమన్నను సమకాలికులు పిచ్చివానిగా భావించిరి. ఇప్పటి వేమన్నను (వేంకట సుబ్బయ్య చౌదరిగారిని) ప్రజ యెట్లు భావించునో!"

పరసత్యాశ్రమ్యాశ్రమ }
ది 6-1-50. }

చదలవాడ కోటినరసింహము.

---

ఆది ఆంధ్ర భీష్మ, శ్రీయుత రాయుడు గంగయ్యగారు

మీ యీ పుస్తకములో నా అభిప్రాయము; చాలసంతోషం. తమకృషి ఫలించాలనే నాకోరిక.

ప్రాచీనకాలంనుండి జీవకారుణ్యపరులగు మహాపురుషులు ఆయాకాలములయం దవతరించి ఉత్తమోత్తమమైన అహింసాధర్మమును కార్యరూపమున మానవలోకమునకు అందజేయుచునే యుండిరి. అహింసా ధర్మములో ఏమి మాధుర్యము గలదో గాని మహాభోగముల పట్టును విడిపించుకొని త్యాగము మధ్య కుడికి ప్రేమసాగరమున నీదులాడిన శిబిదాత, బుద్ధభగవాన్, అశోక, యేసుక్రీస్తులాంటి యెందరో మందియో తప్ప ఆచరించువారయిదు. ప్రతిజీవియందును దేవత్వము నంతర్గతమై యున్నది. ఈ దేవత్వమును వ్యక్తము జేయుటయే జీవిత పరమావధి.

అహింసనే ఊతగా గైకొని మహాత్మాగాంధి స్వాతంత్ర్య మహాభాగ్యమును మనకు ప్రసాదించిరి. ఈ నవయుగములో

ఇచ్ఛాభక్షణ, స్వార్థపరత్వము పై మానవజీవిత యాత్ర సాగుచున్నది. ప్రేమ తత్వానికి, ఆధ్యాత్మికచింతనకు ప్రజలు దూరముగ నిలిచినన్నాళ్లు లోకములో శాంతికి స్థానమేది? అహింస వర్ధిల్లుగాక! ప్రేమమానవలోకమును పాలించుగాక!

14-1-50 }
ఏలూరు }

రాయుడు గంగయ్య

---

విద్వాన్, శతావధాని. బ్రహ్మశ్రీ భమిడిపాటి అయ్యప్పశాస్త్రి గారు.

శ్రీదుర్గా మల్లేశ్వరాభ్యామ్ నమః

దయాదర్శము అంతయును నేను చూచినాను. అత్యాచారములకును అనాచారములకును తావుగాక సదాచారములకు మూలస్థానమై యహింసానుకూల్యమగు ప్రబోధమున నలరారుచున్నయది. హింసయును హత్యయును ఎంతమాత్రమును పనికిరావనియే కదా! యుద్గ్రంథములు వెల్లడి చేయుచున్న యవి. బ్రాహ్మణజాతిలోనే కొందఱు మాంసభక్షణము మున్నగుదురాచారముల కలవాటుపడుచుండు నీకాలమునందు "శ్రీ చౌదరిగారు అహింసా ప్రచారము చేయుచున్నా" రనుట అత్యానందకరమగుచున్నది. అందఱు నీమార్గము నవలంబించి యౌన్నత్య మొందుదురు గాక.

విద్వాన్, శతావధాని,
భమిడిపాటి అయ్యప్పశాస్త్రి
25-1-50

దుర్గాపురము }
విజయవాడ }

XIII

౧౧

## రావుసాహెబు, ప్రమేహగజకేసరి డాక్టరు
## శ్రీయుత గారపాటి ఆంజనేయచౌదరి (డయాబెటిస్)గారు

"బ్రహ్మచర్య మహింస నా బరగు పరము
ధర్మములు రెండునవ్వి యుత్తమతపంబు
దానిగలవాడు నిర్మలజ్ఞాన యోగ
వంతుడై చూడ నేర్చు సర్వంబు ననఘ!

భార - శాంతి.

నేను శ్రీ పాటిబండ్ల వేంకటసుబ్బయ్య చౌదరిగారిని చాలాకాలమునుండియును నెరుగుదును. అనేక సందర్భాలలో వీరి భూతదయ, మానవసేవ, నిష్కాపట్య జీవనములను గూడ దెలిసికొను అవకాశములు కలిగినవి. పామరజనాన్ని తన అహింసా ప్రచారముద్వారా ఆకర్షించుటలో ఈయనకుగల నేర్పు పెద్ద పండితులకు గూడ నసాధ్యమేమోయని తలంచే వాడిని. నిరంతర ప్రచారమువలన తన ఆరోగ్యాన్ని పూర్తిగా పోగొట్టుకొని తుదకు మృత్యువు వాతబడుటకు సిద్ధముగానున్న సమయములో గూడ అహింసా ప్రచారాన్ని మరచువాడుకాడు.

నిష్కాపట్యులకందరికి ఇచ్చే బిరుదాన్ని లోకం ఈయనకూ ఇచ్చింది. ఏమని? పిచ్చివాడని.

ఇప్పుడీయన విశేష పరిశ్రమజేసి దయాదర్శ మను పుస్తకాన్నొకదాన్ని రచియించారు. ఇంతవరకు తనజీవితాన్ని ఏప్రచారానికై అంకితముచేశారో ఆ అహింసా ప్రచారానికి ప్రతిబింబమే యీ రచన.

౧౨

ఏ సంకల్పముతో ఈయన యీ గ్రంథాన్ని సమకూర్చారో ఆసంకల్పాన్ని భగవానుఁడాశీర్వదించుగాత!

2—2—50
దయాబెటీస్ ఆసుపత్రి
విజయవాడ.

ఇట్లు,
గా. అం. చౌదరి

---

పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసు సంఘాధ్యక్షులగు,
శ్రీయుత, పేట బాపయ్యగారు.

ఈ దయాదర్శ గ్రంథము రచియించిన శ్రీపాటిబండ్ల వేంకట సుబ్బయ్యచౌదరిగారు నిష్కళంక దేశభక్తుడు. మహాత్మ గాంధి ఆదేశానుసారం అహింసయే పరమావధిగ నమ్మి భారత స్వతంత్ర పోరాటములలో కారాగార క్లేశముల ననుభవించిన ధీరోదాత్తుడు. జీవకారుణ్యా సంఘముద్వారా జంతుబలి వగైరా మూఢాచారములనుంచి గ్రామీణుల నుద్ధరించుటకు గ్రామ గ్రామాల ప్రచారముచేసి ఏతత్ కార్యములో నెన్ని యిక్కట్లు వచ్చినను వెనుకంజ వేయక తనకార్యము కొనసాగించుకుంటున్న ఉత్తములు. తమ అనుభవముల క్రోడీకరించుచు వీరు వ్రాసిన "దయాదర్శ" మనుగ్రంథము నష్టదాయకమగు మూఢాచారములనుండి విముక్తులు కాజాలని సామాన్యమానవుల కెంతగనో ఉపయోగపడగలదని చెప్పుటకు సందేహము లేదు. వేంకటసుబ్బయ్య చౌదరిగారికి నాఅభినందనములు.

పేట బాపయ్య.
4-2-1950.

౧౩

రాజమహేంద్రవరమునందు శ్రీ గౌతమీ గోరక్షణ శరణాలయమును స్థాపించినవారును, పశుబలి నిషేధ ప్రచారమునందు నెన్నియో కష్టములుపడినవారును, కర్నూలుజిల్లా (కోవెలకుంట్ల) మద్య మాంస నిషేధ సమితి గౌరవ పరిచారకులును సుప్రసిద్ధ "డాక్టరు శ్రీయుతసయ్యద్, అక్బర్ అలీసాహెబుగారు:-

ఉ॥ భగవంతుం డొకఁడీడు లేఁ డతనికిన్
బ్రాంతుల్ త్రిమూర్త్యాత్మకం
బగురూపంబునఁ గొల్తు రాతెఱవు మో
క్షార్హంబుగాదంచు నీ
జగతిన్ భూతదయా పరత్వమగు దీ
క్షన్ బుద్ధ మార్గాన నో
మగ శుద్ధాన్వయబోధఁ జేసిన దయా
న్వర్థున్ విభుఁ గొల్చెదన్.

శా॥ శ్రీ విశ్వేశ్వరుఁడై త్రికాలవిదుఁడై
సేవించు దేవుండు స
ద్భావున్ ధీమణిఁ బాటిబండ్ల కులజున్
బ్రావీణ్యు ధర్మాత్మునిన్
గ్రేవన్ వేంకట సుబ్బచౌదరిని సం
ప్రీతిన్ విలాసాద్భృతిన్
గైవల్యప్రముఁ జేయుఁ గావుత మహా
కారుణ్యమేపారగన్.

శ్రీ పాటిబండ్ల వేంకట సుబ్బయ్య చౌదరిగారు నాకు చాలకాలమునుండి తెలిసిన మిత్రులు. జీవకారుణ్యమును గూర్చి చాలా ప్రచారముఁ జేసిన వీరుఁడు. వీరు రచియించి

౧౪

"దయాదర్శ" మనేగ్రంథము లోకకళ్యాణమునకుతోడ్పడగలదని నానమ్మకము. వీరికృషికి నే నెంతయు నభినందించుచున్నాడను:

"ఎన్నిచదివిన శాస్త్రము లెన్ని విన్న
జీవకారుణ్య మొక్కటి చెందకున్న
దేవు కృపనొందుటయె సున్న తీరటంచు
అక్బరాలిసాహెబుయొక్క యభిమతంబు".

సీ॥ పాలు పెరుగును నేయి ప్రతిదినంబు నొసంగుఁ
బశువులఁ జంపుట పాడియగునె?
సాలు సాలుకు నొక్క సంతానము నొసంగు
సాధుల వధియింప సాహసంబె?
కాయకష్టముచేత కడుఖేదమొందెడి
పేదలబాధింప పెద్దతనమె?
కమ్మని జున్నును కడుపారగా నిచ్చు
దీనుల నొంచుట దీక్షయగునె?

తే॥ గీ॥ కటికబుద్ధిని బోనాడి కరుణమీరు
చూపరాగయ్య వేగమె బ్రోవరయ్య!
జాలిగల మీకిదే నమస్కారమయ్య!
పశుల దుర్దశబాపుడో భవ్యులార!

గీ॥ రహిని నంజుడు దినువాడు రక్కసుండు
పరగ కల్లు త్రాగెడువాడు పంచముండు
నిశ్చయంబుగ నాతఁడే నిశిచరుండు
భూతదయలేనివాడె పెనుభూతమిలను.

ఇట్లు,

మలకపేట
హైదాబాదు (దక్కన్)

భగవద్భక్తుల పాదరేణువు
డాక్టర్. సయ్యద్, అక్బర్అలీసాహెబు.

# కృతజ్ఞత

క॥ సాయంబులు సత్కృతులా
న్యాయంబుగఁజేసినావు హర్షంబు సదా
దాయం బాచరణంబగు
శ్రేయంబానీకు నెపుడు శ్రీహరిరాయా!

అత్యుదార బుద్ధితో నీ గ్రంథ ముద్రణకు నూట పదార్లు నొసంగి సహాయ పడిన శ్రీయుత నంబూరు శ్రీహరిరావుగారు చిరాయువులై సర్వదా యిట్టి సత్కార్యమాన సోపేతులై యుండుటకు సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాను.

ఈయన కృష్ణాజిల్లా, కోణిజర్ల గ్రామవాస్తవ్యుఁడు. శ్రీ నంబూరు నారాయణగారి తృతీయ పుత్త్రుఁడు. యువకుఁడు, విద్యాపిపాసి, పండితగోష్ఠీ పరాయణుఁడు, నిరాడంబరుఁడు, నిష్కపటుఁడు, సంఘసేవా తత్పరుఁడు.

రచయిత

# దాతల నామావళి

శ్రీయుత చందనం మల్లయ్యగారు. ఖమ్మం

,, అనుమోలు కిష్టయ్యగారు. శింగరాయపాలెం (ఖమ్మం- తా.)

,, ,, గంగయ్యగారి కుమారుడు వెంకటనరసయ్యగారు. ,,

,, ,, లక్ష్మయ్యగారి కుమారుడు నాగయ్యగారు. ,,

,, లగడపాటి చిననాగయ్యగారి కుమారుడు లక్ష్మీనరసయ్యగారు ,,

,, తాతా సత్యనారాయణ సీతారామయ్యగార్లు. సీతారామపురం (ఖమ్మం)

,, అనుమోలు వెంకటనర్సయ్యగారు. వైరా (మధిర- తా.)

,, మిట్టపల్లి జగ్గయ్యగారు. ,,

,, ,, బసవయ్య కోదుమూరు నారాయణగార్లు. ,,

,, పోలా రాజయ్యగారు. ,,

,, బొగ్గుల లక్ష్మారెడ్డిగారిభార్య చన్నమ్మగారు. ,,

,, దేశగాని వెంకటస్వామిగారు. ,,

,, రాయల విశ్వనాథంగారు. ,,

,, ,, లక్ష్మీనారాయణ నాగభూషణంగార్లు. ,,

,, ,, బ్రహ్మయ్య నారాయణగార్లు. ,,

,, మల్లెంపాటి నారాయణగారు. గండుగలపాడు (వైరా. పట్టి)

,, మల్లంపాటి పిచ్చయ్యగారు. ,,

,, చింతనిప్పు నారాయణగారు. ముసలమడుగు ,,

,, మట్టూరు నరసయ్యగారు. శిరిపురం ,,

,, శీలం నరిసిరెడ్డిగారి కుమారుడు వెంకటరెడ్డిగారు. గరికపాడు ,,

,, వనమా కోటయ్యగారి కుమారుడు జగన్నాథంగారు. నెమలి (కృష్ణా)

,, ,, కనకయ్యగారి కుమారులు వెంకటేశ్వర్లు, సీతారామయ్యగార్లు. ,,

,, సుగ్గల సూరయ్యగారు. ,,

,, నంబూరు వరదయ్యగారు. కోణిజర్ల (కృష్ణా) ,,

,, కానయ్యగారు. ,,

1

# దయాదర్శము

## జీవోత్పత్తి

ప్రాణుల పుట్టుక భూమియందు బొడము మొక్కలరీతిగా స్వతస్సిద్ధమా? లేక యెట్లు? జీవసమూహ ముత్పన్నమగుటకు క్షేత్ర మేది? క్షేత్రాధికారి ఎవరు?

పుట్టుటయు, వృద్ధియగుటయు పైరులవలె నగును. క్షేత్ర మీ యనంత విశ్వమే. క్షేత్రస్వామి పరమాత్మయే. జీవులు జల, భూ ఖేచరములని త్రివిధములు. చేప, పీత మొదలగునవి జలచరములు. మానవ, పశ్వాదులు భూచరములు. కాకి, గ్రద్ద మున్నగునవి ఖేచరములు.

పైరులకు నితరప్రాణులకును తారతమ్య మేది? పైరులు స్థావరములై ఉన్నచోటనే యాహారము సేకరించుచు, వృద్ధి బొంది నియమితకాల ఫలవంతములై జంగమప్రాణ్యనుభవమునకు వచ్చుచున్నవి. జంగమప్రాణులు అండజ, పిండజ, స్వేదజ, వాయుజములను చతుర్విధములుగా నుత్పన్నమై తమ యాహారమును తిరిగి సంపాదించుకొనుచున్నవి.

జంగమములందు మనుష్యులు విజ్ఞానులు. ద్వితీయమున మానవేతరజంగమములు. తృతీయమున పైరులు. పైరులు జీవరేణుసమృద్ధిచే పైవాని కాహారభూతము లగుచుండును. ప్రథమ ద్వితీయములు పరస్పరోపకారకములు. పరస్పరహాని-

కుత్సమించుటచే విశ్వకళ్యాణమునకు భంగము గలుగును. అన్యోన్యసహకార మత్యంతసుఖప్రద మగునని తెలియనగును.

ఇతరజంగమములు ఇంచుక విజ్ఞానలోపముచే గూడు కొనినను, జన్మసామ్యమున మనుష్యులు వానిని సోదరతుల్యులుగా భావింపవలయు. పశు పక్ష్యాదులు మానవులకు సహకారులగుచున్నవి. ఆవు, గేదె, మేక, ఎద్దు, గున్న మొదలగునవి నిత్యసహకారముచే వాత్సల్యపాత్రములు. కోడి, కోకిల, నెమలి, చేప, మండూకాదులుగూడ నట్లే. సోదరత్వము జంగమములకేగాని పైరులకు లేదు. ప్రాణుల కుత్పత్తి, స్థితి, లయము లను మూడవస్థలు గలవు. స్థితి అన్నపానయుతము. ప్రాణికోటి లయమునకు నియమితకాలమును వచించుట వలనుపడదు. పైరుపచ్చలలో నధికభాగము ఫలాంతమున లయ మొందును. జంగమప్రాణుల కాహారము పైరులద్వారా సంక్రమించుచున్నది. అట్టి ప్రాణుల సృష్టికి పరిమితి నూహింపజాలము. కాని వాని ఆహార సృష్టికి పరిమితినిదెలుప సాధ్యమగును. ఆహారము నవియే సంపాదించుకొనుటవలన స్వేచ్ఛా స్వాతంత్ర్యములు వానికి జన్మతః సిద్ధించుచున్నవి. ఆహారము గాంక్షించువాని కాహారమిడుట శ్రేయస్కరము. కాని హింసించుట అధర్మము, అవినీతియు. జంగమప్రాణిహింస యనవసరము. అహింసాహారార్జనమే ప్రకృతి కవసరము. మనవలెనే ఆవు, గేదె, ఎద్దు మొదలగునవి సౌఖ్యానందములఁ గోరుచున్నవని గ్రహింపనగును. అట్టికోరికలంత మొందించుట ధర్మవిరుద్ధము. స్నేహమే ప్రేమ. ప్రేమ స్వరూపుడు పరమాత్మ. పరస్పర ప్రాణిమైత్రి విశ్వకళ్యాణ

మగును. దుఃఖ మేరికిని నాశనకారి. హింస యను దానిని పూర్ణముగాఁ దొలగింపవలయును

జగము ప్రాణుల ఆనందమును నిరోధించుచుండ మనము ఉండలేము గదా? వేదకర్త దుష్కర్మమొనర్చుట ఎల్లరకును విసర్జనీయము. భగవత్కార్యనిర్వాహకుఁడు మానవుఁడు. కాన విధి భంగ మొనరింపక నమ్మినసేవకునివలె మెలఁగవలయు. అమోఘ దీక్షతోఁ గావలయు. దీక్షాభంగ మీశ్వరకార్యభంగము. ఈశ్వరసృష్టియే యీ జగత్తు. కాన జగత్పరిశీలన మవసరము. మాంద్యతే సర్వనాశనము. జాగరూకతతో ధర్మయుక్త కార్యాచరణ మొనర్పవలెను. జ్ఞానమే వెలుఁగు. అజ్ఞానమే చీఁకటి. జ్ఞానముచే కార్యఫలము సత్వరముగా సిద్ధించును. ధర్మాధర్మములయం దీశ్వరుఁడు సాక్షి. పరమేశ్వరసాక్ష్య మంతరింద్రియగోచరము. మనస్సాక్షికి వ్యతిరేకుఁడగుట విజ్ఞానికధర్మము. క్షణికానందమునకేగదా ధర్మేతరాచరణ! ఇట్టి ఆనందము వలన ఫలమేమి? ఉత్తరక్షణమున దుఃఖముగాక మఱేది లభించు? కాన అంతస్సాక్షిగా మానవుఁడు శాశ్వతానందకరమునగు పుణ్యక్రియ లాచరింపవలయు. అంతస్సాక్ష్య మెద్ది? సర్వహింసానిరుద్ధపరిబోధము. అది "త్వమేవ తత్" అను ధ్వని. సత్యము స్వప్రకాశమగునది. స్థితిలయములు సర్వసమానములు. అహంకృతులు సర్వులకు విసర్జనీయములు. ధర్మమున కేవఁడు ద్వేషి కాఁగూడదు? ధర్మము స్వపోషణమునకును, పరశ్రేయమున కుపకరించునది. జీవకోటియందు మానవునిది ఉచ్చస్థానము. నీచస్థితికి రాఁ జనదు.

# 4

# మానవేతర ప్రాణిలాభములు

జగత్తు నిరర్థక పదార్థశూన్యము. జంగమ ప్రాణులవలని లాభములు అనంతములు. ప్రాణి సంఘములకు మేలొనర్చువాఁడు మానవుఁడు. మానవేతర జంగమములు నాతనిచే మాననీయములు. అవి హానికి దూరముగా నుంచఁబడవలయు. వాని ప్రయోజనముఁ గాంచి ప్రత్యభివృద్ధి యోచింపవలయు వాని అభివృద్ధివలన మన కధికలాభముఁ గలుఁగును. ప్రథమమున వాని శ్రేయము, పిదప తనది. సస్యాభివృద్ధికి పశుసంతతి అవసరము. సాధుత్వము పశు (ఆవు, గేదె, మేక, మొ) స్వభావము. మానవుఁడు పశుకృతోపకారభోగి. జంగమప్రాణుల సహాయము విముఖత కారిస్యము. పరస్పర సహాయమే స్థితి కాధారము. మనుష్యస్థితికి ఇతరజంగమ ప్రాణిసహాయ మవశ్యము.

ప్రాణుల స్థితి కాహారము, గాలి, వెలుతురు, పానీయము మొదలగున వన్నియు నవసరమే యైనను ఈశ్వర సృష్టియందు గాలి, వెలుతురు, నీరు సమృద్ధముగా నుంపఁబడి యాహారము మాత్రము సోమరితనము లేకుండుటకు మానవుని యత్నమునకు కొంతవరకు వదలివేయఁబడినది. ఆహారసంపాదనకు కృషి యవలంబనీయము. నిత్యము మనముఁ జేయు కృషిలో ఎద్దు, దున్న, మొదలగునవి ప్రథమోపకరణములు. వాని క్షేమమే వ్యవసాయ క్షేమము. వ్యవసాయము లేనిచో ఆహారద్రవ్యము లెక్కడివి? ఆహారద్రవ్యములు వినా స్థితి నిలువదు. స్థితిని ఆశించు ప్రతియొకనికి దాని మూలకారణమైన పశుసంపదను పోషించుట తప్పనిసరి ఎట్టివాఁడును, ఎట్టికష్టములకుఁ

బొల్పడియు తనబాగే యాశించు. ఎట్టి యత్యావసర విషయము లందైనను పశుహానిచేయుట తనకును సమాజమునకును హాని గలిగించుటయే.



పాడి ఆవు.

ఎంత ధనమున్నను పశుధనము శ్రేయస్కరము. పశు ధన మన్నింటికంటె గొప్పది. దానినుండి యితరధనము లుత్పన్న మగును. ఇది యనాదిసిద్ధాంతము. అనాదిగావచ్చు దానిని ప్రస్తుతము మార్పొనరింపఁజాలము. ఆర్యాయుగమందు పశు వులఁ బోషించి, తద్ద్వారా పరస్పరలాభముఁ బడయుచుండిరి. ఎంతధనమున్నను, దానికంటె దాని మూలకారణమైన పశు ధనమును మిక్కిలి జాగరూకతతోను, ప్రేమతోను గాపాడి యిప్పటికిని భవిష్యత్తునకు నాదర్శులైరి. పశుపోషణ సులభము. పశువుల యాహారమునకై యెట్టి ప్రయత్నము మానవునకుండదు. అనాయాసముగ నధికలాభము పొందఁగలుగును. పశువులు వన ములలో పూరిమేసి, వాగులలో నీరుఁ దాగి యింటికివచ్చి క్షీరము లిచ్చును. మనకు క్షీరము ప్రాణాధారము. క్షీరమునం దెన్ని

సుగుణములు గలవో యెల్లరకును తెలియును. మానవునకును, క్షీరమొసంగు పశువునకును మధ్య క్షీరమను ప్రాణప్రవాహము ప్రవహించుచున్నది. అట్టి పవిత్రప్రవాహ మెట్టిమూఢుడైన ఘాతుకులార అరికట్టఁగలఁడా? అడ్డుపఱచిన లాభమేమి? పశువులను పూర్తిగా మేపి, మనమువలె యేలోటులేకుండ గాపాడినచో వాని సంతానమును పోషింపఁగలవు. మనలనుకూడ పోషించుటకు వానికి సమర్థతగలదు. పశుహింస, అనగా ఆత్మహింసయే.

ఆహా! ఏమి? ఎంత అమూల్యమైన క్షీరవాహిని పశుమాతనుండి ప్రవహించి మానవులకు ప్రాణాధారమగుచున్నది! ఏమి? పరమేశ్వరుని సృష్టివైచిత్ర్యము! విజ్ఞాన సంపన్నునిగా మానవుని సృష్టించి, పరోపకారార్థమై పశుజాతులను సృజించెనా! జన్మనొసఁగిన తల్లి కొలఁదికాలము వఱకే, క్షీరమొసఁగును. కాని, గోమాతయో యావజ్జీవ ప్రేమతో, సత్యంతసమానముగ, అపరిమితోత్కృష్ట పుత్రవాత్సల్యముగ, అనంతకీర్తి సంప్రాప్తయై మానవులను, తదితరజంగమ ప్రాణులను క్షీరామృతమొసఁగి పోషించుచున్నది. ఏమి? గోమాత యెట్టియో యుచ్ఛస్థాన మలంకరించుచున్నది! ఆమెది యెంత పూజనీయస్థానము!

మన మమృతపు జాడ నెఱుఁగము. గోక్షీరపుజాడ నెఱిఁగితిమి. దాని ప్రయోజనముఁ గాంచితిమి. క్షీరామృతమునకంటె అన్యామృత మెచటఁ గాంచఁగలము! "మృతిర్నభవ త్యానే నేత్యమృతం" అనగా దీనిచే చావు గలుగదు. గనుక అమృతమనుచున్నది. అమృత మొల్లని వాఁడుండునా? అమృతభాండముఁ జెరుపఁగలఁడా! అమృతభాండమే క్షీరమొసఁగు పశుజాతి ఎన్ని

యాహారములు భుజించినను క్షీరమం దుండు మాధుర్యము వాని యందుండదు. మాధుర్యమున నేల? సుగుణయుతమును.

క్షీరము దేహబలకారి. బుద్ధికౌశల్యకరము. ఆయుర్వృద్ధికి సాధనము. పాలనుండి పెరుగు, మజ్జిగ, వెన్న, నెయ్యి లభ్యమగును. వీనియందును పెక్కు మేళ్ళుగలవు. తినుబండారముల రుచికి వెన్న, నెయ్యి కావలయును. పశువుల మలమూత్రాదులు భూమికి యెరువులు. మానవులకును, సస్యములకును పశువులచే లాభముఁ గలుఁగుచున్నది. మానవుఁడు చేయవలసినది వీనికి ప్రత్యుపకారమేగాని యపకారముఁగాదు.



నాగలి.

పశువులు స్వజాతిపోషణ నిర్వహించుచు మనుష్యులకుఁ బాల నిచ్చుచున్నవి. మగపశువులు క్షేత్రము దున్నుట కుపకరించుచున్నవి. దున్నని క్షేత్రముఁ బండదు. పండనిచో ఆహారోత్పత్తి కాదు. ఆహారోత్పత్తికి పశువులు ముఖ్యసాధనములు. పండిన పైరును ఇండ్లకు పశువులు మోయుచున్నవి. అవి లేనిచో మానవుఁడు వానిని పొలములందే విడువవలసివచ్చును. పశువులు తమ జీవితాంతమువరకును మానవసేవయందుఁ బ్రాఁమాలవు. తోటలు ఫలించుటకు మోటలు గుంజుచున్నవి. దేహాంతము

నందును వానిచర్మంబు పాదరక్షలకై యుపయోగపడు
చున్నది. మగ, ఆడ అను భేదమేల? ఒకదానికంటె మఱి
యొకటి యెక్కువ మేలొనర్చు చున్నది. వాని నీతి, యోర్పుం
బొగడఁదగినవి. "పరోపకారార్థ మిదం శరీరమ్, అనునార్యోక్తి
నవికల్పముగాఁ జాటుచున్నవి. వానిని మూఁగపశువు లనఁ
గలమా? లేక కారుణ్యప్రాణు లనఁగలమా!



చిక్కిన ఎద్దు.

[illegible] స్వార్థముకై వీని నుపయోగించుకొని వీనియాదు శక్తి
తగ్గినపుడు అపకారమొనర్చుట కడు శోచనీయము. కొన్ని సమ
యములందుఁ గొట్టుట తగినయాహార మియ్యకుండుట నెంత
యో శోచనీయము. అమూల్య పశుధనమును శక్తికొరవడఁగా
నే స్వల్పమూల్యమునకో విక్రయించుటగొప్పతప్పు. విక్రయించు
వారైనను వానిని పోషించు నుదారబుద్ధిగలవారి కొసఁగిన,
సుకార్యమేయగును అటులఁగాక వీనిని హింసించు దయారహిత
మూర్ఖుల కొసఁగుచున్నారు. ఇదెంత నింద్యము! వృద్ధులైన
తల్లిదండ్రులను కోసికొని తినుటకంటె నిది తక్కువకార్యమా?

ఒకనికి జాడ్యము సంభవింప నౌషధసేవఁ జేసిన పున
రారోగ్యముఁ బడయును. ఆరోగ్యమొసంగుటయందు తనకెట్టుల
నిండుకోరికఁగలదో అట్టులే తన కుపకరించు జంగమ ప్రాణికోటి
కిని, ఆరోగ్యమును, క్షేమమును నెలకొల్పఁ బూన్కోత్సాహముఁ
గలిగియుండవలెను. పశుధనము ననాదరూపముగా వ్యర్థపఱచిన
మందుఁడు తనలో బాగుగా విచారించినఁ దాఁజేయు కార్య
మెంత హేయమో, దూష్యమో తెలియఁగలడు. స్నేహితు
నితో స్నేహము చిరస్థాయిగా నున్నంతవరకు నదియే సుస్నేహ
మనఁబడును. అట్టి సుస్నేహితుఁడు కాలవశాత్తు ఆరోగ్య
హీనుఁడైన స్నేహపాశముఁ ద్రెంపుకొనఁగలమా! త్రెంపుకొనఁ
జాలము. ఏలయన? అది అవిచ్ఛిన్నస్నేహము. ప్రేమయు నట్టిదే.
ఉపకారివిషయమందటులే చరింపవలయు. ఉపకారిచేయు నుప
కారముఁబడసి తుదకు కృతఘ్నులము గాఁగలమా? కృతఘ్నత
ఎట్టి అవినీతికరము!

పరుల మేలు గోరువారికే స్వార్థసిద్ధి గలుఁగును.
పరార్థఘాతుకులకు స్వార్థహాని తప్పదు. కని పెంచిన పిత
రులను వారి వృద్ధాప్యమునందు సేవాది సత్కర్మ లొన
ర్పకయే విడనాడుటకు[?] మనస్సొప్పునా! తల్లిఁ దండ్రులుఁ
దనయునిపై నెట్టి ప్రేమగలదో అట్టిదియే పై నుడువఁబడు
పశుజాతమునకును, తోడిమానవవర్గమునందును గలదు. వృద్ధ
మాతాపితరుల నెట్లు మానవుఁడు సేవింపనెరుఁగునో అటులే
వృద్ధపశుగణమును పోషింప సేవింప నెరుఁగవలయును. పాలొ
సఁగినతల్లిని ప్రేమచే సేవించునటుల,జన్మపర్యంతము క్షీరధారచే

పోషించు గో, మహిషాద్యుల దాక్షిణ్యాభావమునఁ బరికింప వలయు. అవి యుపకారకములు. వజేయు మహోపకారక ములు. ప్రాణదాతలు. ప్రాణములం దెంత తీపియుండునో, ప్రాణప్రదములైనవానిగూర్చియు సమానప్రేమ నెఱపవలెను.

పైనుదహరింపబడినవానిలో పాలనొసఁగు గోవు, గేదె, మేక, గొఱ్ఱె మొదలగునవి చేరియున్నవి. వ్యవసాయమున కుప యోగపడుచు ఎద్దు, దున్న, గుఱ్ఱము, ఒంటె మొదలగునవి మానవునికిఁ బూజనీయము లగుచున్నవి.

గోగణముకు కొల్లొప్పుట వలననే దేశము మహోపద్రవ బాధల పాలైనది. గోమాతయే నిక్కముగు దేవత. ఆపెను పూజించినచో ఆయురారోగ్యములఁ బ్రసాదింపఁగలదు. వైదిక కాలమునుండి మనపూర్వులు గోపూజసేయుట, గోవుల మల మూత్రాదులనుకూడ పూజనీయములుగా భావించి పవిత్ర కార్యములయందు వాని ప్రశస్తి నిరూపించుట వైదికాచార ములయందు గన్పట్టును.



ఏనుఁగు.

ఆకారమున పెద్దదయ్యు, అహంకారమున కొద్దిదైన ఏనుగు యొక్క సుశీలము విచారితము. ఉన్నత కాయముఁ గలిగి

యున్నను శాంతమైనను గర్వముఁజూపదు. గర్వము దానికెంతయో దూరము, గొప్పప్రాణియయ్యు తనకంటె కొద్దిఆకారము గల మానవునకు లొంగి సేవఁజేయుచున్నది. శరీరౌన్నత్యము, శరీరసౌష్ఠవము సామాన్యముగా గర్వోత్పాదకములు. దానికి గర్వాభావము, సహజముగా ఔన్నత్యము, బలిష్ఠముతో పాటు జన్మతః సిద్ధించినది. ఏనుఁగునుండి మానవులు సుమతము నేర్చుకొందగిన సుగుణములు కొన్ని గలవు. బలిష్ఠకాయమున్నను వినయముఁ జూపించుట, అహంకారమడంచుకొనుట చూపట్టును. అంత ఉత్కృష్టప్రాణి సయితము మానవుఁడు వేటాడుచున్నాడు. చ ఫుటకు బంధించుచున్నాడు. దానిని వశపరచుకొని సహకారమొందఁదగును. తగినంతయాహారమిచ్చి తగుసహాయము పొందవచ్చు. దానిని పనులయందు వినియోగించుట దూష్యముగాదు. హింసించుట, స్వార్థమునకై ఇతరవిధములుగా బాధించుట దూష్యమగును. దానికి సహజగుణము సత్వము. సత్వగుణముగలవాని సహకారమందుఁ బెక్కులాభము లుండుట వాస్తవము.

మతాధిపతులు సత్వగుణ సంపన్నులు. సత్వగుణ సమృద్ధములగు గజములను బంధనచే పీడించుట దురాచారము. ఒక్క గజమును విశేషకముగా బంధించుటకన్న సహేతుకమైన కార్యమందు వినియోగించి అర్థలాభముచే కొన్ని ప్రాణులఁ బోషింపవచ్చు. లేనిచో అర్థనష్టము హింసాకార్యమగును. కేవల జ్ఞానప్రచారము మాత్రము గావింపవలసిన మతాధిపతులకు ఏనుగులు, గుఱ్ఱములేనో తెలియకున్నది. ఇట్టి యాడం

బరములెవ్వియు లేకుండ బౌద్ధభిక్షువులు తమ విజ్ఞానమును ఖండ ఖండాంతరములకు వ్యాపింపఁజేయ లేదా !



ఒంటె.

ఒంటెయు గొప్ప ప్రాణులలో జేరినది. దీనిది దీర్ఘకాయము. ఇది మిక్కిలి బరువులు మోయుట కుపకరించుచున్నది. ఇసుకచే నిండిన యెడారి ప్రదేశమున నొకచోటినుండి మఱియొకచోటికి పోవుట దుర్ఘటము. అట్టి సమయమున నుపయోగపడును. దీనియందొక మహత్తుగలదు. కొన్ని దినముల వరకు కావలసిన యాహార పానీయములు లోకే పర్యాయము లోనికిఁ దీసికొని క్రమేణ జీర్ణించుకొనఁగలదు. సృష్టి చాతుర్యములలో ఇట్టి విషయములు బరికింపఁదగినవి. మానవుఁడు నీరు, ఆహారము లభించని యెడారి ప్రదేశములలో వచ్చి యుపరాని కష్టముల పాలగునని ఇట్టి వింత ప్రాణిని పరమేశ్వరుఁడు సృష్టించెను. ఈ మహోపకారి యగు ప్రాణిని నీరు దొరకని యెడారి ప్రదేశమందుఁ జంపి, దాని గర్భమునుండి నీటిని స్వప్రయోజనము నకై మానవులు వాడుకొనుచున్నారు. ఇదెంతటి కృతఘ్నత ! నీరు దొరకనిచో నీరు మోయుటకును, వాహకులను మోయు

టను కూడ దీనికి శక్తి గలదు. ఇట్టి మహోత్కృష్ట జంతువును నీటికై తుద ముట్టించుట అయుక్తము.



## గుఱ్ఱము.

పిదప గుఱ్ఱము యోచింపఁదగినది. దీనివలన మానవునకు ననేకమేళ్ళు గలుఁగుచున్నవి నడువ శక్తిలేనివారును, విలాస పురుషులును దీనినెక్కి వెళ్ళుచుందురు. బండ్లను లాగింతురు. వ్యవసాయమునకు నయితే ముపయోగింతురు. బీదవారును దీనిమీద బండిసిగట్టియో, బరువునువేసియో జీవనోపాధిని గాపించుకొనుచున్నారు. యుద్ధ క్షేత్రములందు రాజులు అశ్వికదళము నుపయోగింతురు. గుఱ్ఱములు నగారా, తుపాకి, ఫిరంగి మొదలగు శబ్దములను వినియు భీతిఁజెందవు. ఎంతటి ధైర్యము! జలప్రవాహములను, అగ్నిగుండములను, మహారణ్యములను లెక్కింపక యజమానుని దరిఁజేర్పఁగలుఁగుటయో, లేక తా మాహుతి యగుటయో జరిగించుచున్నవి. దయాహీనులు దీని సహాకారమును గమనింపక దేహమందలిశక్తి నశించినపుడుకూడ స్వార్థముకై శ్రమ నొసఁగుచున్నారు. నైజముగానున్న తోకఁ గత్తిరించి, అలంకార

హీన మొఱగ్బుటయే గాక దేహముపై నీఁచు ఈగ, దోమ లను తోలుకొనుట కవకాశము లేకుండ జేయు చున్నారు. మానవుని చేతులు కట్టివైచిన వాని యవసర కార్య మెటుల నెరవేరును ? అటులే దానికి చెయ్యివలె నుపయోగించు అవయవచ్ఛేదనముఁజేసిన పని యెటుల నెరవేర్చు కొనును ? కొందఱు దుర్మతులు వీలైనంతవఱకు దానిపై స్వారి జేసియు, బండి లాగించు కొనియు, అలసినపుడు తాము విశ్రాంతి పొందునటుల, దాని విశ్రాంతికి నీడ, నీరు యోచింపరు. ఎండలో మాడును. వానలో తడియును. చలికి వణుకును. ఇట్టి యుపకారిని బరామర్శింప కిట్లుపేక్షించుట కేవల కృతఘ్నతగాక మరేమి ?



మేక.

మేక, గొఱ్ఱె మిక్కిలి సాధువులు. అత్యంత ప్రయోజన కరములు. వానిపాలు బలకరములు. రుచికరములు. వానిఉన్ని కంబళులు, తివాచీలు, శాలువలుగా తయారుచేయఁబడుచున్నది. మలమూత్రములు పైరులకు బలముఁగలిగించునవి. ఇతరప్రాణి సముదాయమునకు హానిచేయవు. అన్యోన్యవిశ్వాసము, సంఘీభావము మెండుగా గలదు. మానవునివలె సంఘమునుండి

తొలఁగునవికావు. సుఖము, కష్టము సంఘములనందుండియే కోరును. ఐకమత్యత, అణకువలు గమనింపఁదగినవి.



పంది.

పందుల వలన నెంతయో పారిశుద్ధ్యముఁ గలుఁగుచున్నది. జీతబత్తెములు లేకయే పాకీవాని పనిని నెరవేర్చుచున్నది. మానవుని కంతకంటె ప్రయోజనకారిగలదా? ఇట్టి జాతువును వధించుట అపారిశుద్ధ్యమును పెంపొందించుటయే. దీని ఎరువు సస్యములకు మిక్కిలి బలముఁ గలిగించును. ఇద్దాని పోషణ కష్టముగాదు సులభము. ఈ జాతి వృద్ధిచే ఆర్థికలాభము మెండు.



కుక్క.

శునకము మిక్కిలి విశ్వాసముఁగలది. దీనివిశ్వాసముఁ దెలుప కథలపారముగానున్నవి. మన మనుదినము వానిని వినుచున్నా

రము. జాగ్రతయందును, మెలకువయందును దీనికున్న నైజశక్తి వేరొక ప్రాణికి లేదు. ధనాగారములందేమి! ధాన్యాగారములందేమి! పశుకూటములందేమి! పైరుప్రదేశములందేమి కావలికాయునది ఇదియేగదా. ఆహా! ఎంత విశ్వాసప్రాణి! ప్రతిఫలము నాసింపకయే రక్షణభారము సేవకునివలె మోయుచున్నది. దానికేమి యొసంగినను మానవునికి ఋణముం దీరదు.



గాడిద.

కష్టభార మోర్చుకొని సాయపడునది గార్దభము. అది మిక్కిలి సాధుత్వముం గలది. చూపులకు శక్తిలోపముగా గన్పించినను, బరువులు మోయునపుడు శక్తికంటె మించిన భారమును మోయుచున్నదా! అనునటు లాశ్చర్యముం గొలుపును. మించిన బరువును "గాడిద బరువు" అనుట వాడుకం గలదు. ఈజాతి పోషణ మతిసులభము. ఇటులే చతుష్పాద ప్రాణికోటిలో విశ్వాసము, ఓరిమి, అణకువ మొదలగు సుగుణములు గలవి పెక్కుగలవు. గ్రంథబాహుళ్యమునకు వెఱచి సంగ్రహ మొనర్చితి.

పక్షములుగలవి పక్షులు. పక్షము లనగా ఱెక్కలు. మానవునికి ఱెక్కలు చేతులు. మనుష్యుని ఱెక్కలయందుగల యుప

యోగముకంటె విస్తృతమగు నొకయుపయోగము పక్షుల రెక్కలందు గలదు. మనుష్యుఁడు తన రెక్కల సాయమున నాకాశమందు సంచరింపఁజాలఁడు. పక్షు లటులఁ జేయ గలవు. ఈ పక్షులు మూఁడువిధములు. మొదటిది కేవలము వాయుమండలమందు సంచరించుచు, చెట్లపై, పర్వతాగ్రములపై వసించునది. రెండవరకము కేవలము భూమియందే సంచరించుచు అవసరమగుచో కొంచెము పైకెగురశక్తిగలది. ఇవి భూమియందును, వాయువునందును చరింపఁగలవు. మూఁడవరకము వాని యాహారమున కధికభాగము నీటియందు సమకూర్చుకొని, అవసరమగుచో భూమియందును, వాయువునందును సంచరింపఁగలవు.

సృష్టియందు పరమాత్మ పక్షిజాతికి త్రిమండలములందు అనగా వాయువు, భూమి, జలములందు సంచరించు నద్భుత శక్తినొసంగి, తన సృష్టియందిమిడియున్న చాతుర్యము ప్రదర్శించెనుగా! ఏమి? విజ్ఞాన సంపన్నుఁడైన మానవుఁడు భూమియందుదక్క, వాయువునందును, జలమునందును సంచరింపఁగలడా! అటుల సంచరించు తోడి జంగమ ప్రాణికోటిలో జేరిన పతంగములఁగాంచి ఆనందింపక తప్పునా! వాయుమండలమునందు పక్షిసంచార మెంత నేత్రానందకరము! జలభాగములందు పక్షిసంచార మెంత మనోల్లాసకరము! ఇట్టి తోడి ప్రాణికోటిని పీడింపక పోషించుచో ఆనందోల్లాసములు స్థిరస్థాయిగా నుండవా?

ఈ పక్షులకును నివసింప గృహములు, భుజింప వలెననెడి ఆశ, ప్రమాదములఁదప్పించుకొను ఊహాలు గలవు. సంతతిపై

వీనికిని ప్రీతిగలదు. ఎల్లప్పుడు నిరపాయ స్థానములకై వెదకు చుండును. ఇక నివసించు గృహము లన్ననో, కేవలము మానవుని కెట్టి ఆటంకములు గలిగింపని వృక్షములు. తరువాత దేవాలయములు. వీని నివాసస్థాన నిర్మాణ భారము, ఆహార భారము మానవునిపై నిడక జీవించుచున్నను, అట్టి వానిని సహితము సహింపజాలక నిష్కారణముగా భగ్నపరచు చున్నారు. మానవుఁ డిట్టి పక్షులను పోషింపఁ గలిగినచో కొన్ని మేళ్ళను, లాభములును జేకూర్చఁగలవు. లాభకారి వస్తువుల నెవఁడు నశింపఁజేయును? లాభ మనగా నేమియో, అట్టి లాభము దేనినుండి గలుగుచున్నదియో? బాగుగా గ్రహింపఁ గలిగిన, అట్టి పనికిరాని పనికి పూనుకొనరు.

పై నుడువఁబడిన త్రివిధభేదములలో భూమిని చరించు పక్షిజాతముతో మానవునికి గొప్పలాభము గలదు. చతుష్పాదజంతువుల కైవడి, ఈ పక్షిజాతము సాధుస్వభావము, బుద్ధిసూక్ష్మత మున్నగు మెరుగైన గుణములచే సృజింపఁబడినది. భూమియందుఁ దిరుగు పక్షులలో కోడి, బాతు మొదలగునవి ముఖ్యములు. ఆకాశమందు సంచరించు వానిలో పావురము, కోకిల, చిలుక మొదలగునవి ప్రధానములు. జలమందు చరించువానిలో పైఁ జెప్పఁబడిన బాతు, నీటికాకి మొదలుగా గలవి. వీనిలాభములు వేరువేరు విధములుగా గానుపించు చున్నవి. ఇవి చేయగలిగినంత సహకారము మానవుఁడు ప్రేమతో పాలనఁజేసిన చేయుగలవు.



కోడిపెట్ట

కోడిజాతి గృహముచుట్టు నున్న దుర్గంధవస్తువులం దున ముట్టించును. అందువలన మనుష్యుని కెంతయో లాభమగు చున్నది. ఇంటి చుట్టునున్న మాలిన్యముఁ దిని, మనకెట్టి వ్యథహానులు సంభవింపఁజేయక యుపకారిగాజీవించుచున్నది. చూడను కందముగా నుండును. పరస్పరము వైరముఁ గలిగిన, మిక్కిలి ధీరతతో ముష్టియుద్ధముఁ జేయును ఇది ఏమరక నిత్యము రాత్రి మూఁడవజాము చివర చక్కనికూఁతచే మానవులను మేలు కొలుపుచున్నది. దీనికూఁత వినిన వెంటనే సాధారణముగా మనుష్యులకు రాత్రులందు సంభవించెడు భయము మాయుచున్నది. ఏలయనగా? చోరులుగాని, తదితర హానికారులుగాని కోడికూఁత తో తమ దురుద్యమములను మానుకొందురు.

ముఖ్యముగా కోడికూత రైతు ప్రభువులకు వైతాళికుల మేలుఁకొలుపులుగదా! పగలంతయు నెంతయో శ్రమపడి రాత్రి యే జామున్నర నిద్రయో అనుభవించిన రైతను జీవరక్షకుఁడు ప్రాలుమాలక, కోడికూఁత చెవిని బడఁగా మేల్కాని, సర్వప్రాణిస్థితి మూలమైన కృషిక్షేత్రములందు, తన కప్పటప్పటికే యే కార్యములు గలవో వానివానిని నెరవేర్ప నాయత్తుఁడై శయ్యనుండి నిద్రను త్యజించి మనఃకాయములను దమనముఁ గావించి బయలుదేరుచున్నాడు.



కోడిపుంజు

ఓ రైతురాజా! నన్నును, తదితర ప్రాణులను రక్షింప స్థితిని నిలుప నీవే కారకుఁడవు. నీవు ప్రాలుమాలిన జగమందున్న జీవులెటుల జీవించును? నిర్యమున లెనే ఈ దినమును ప్రాలుమాలక లెమ్ము. సర్వ జీవకోటికి ధాన్యోత్పత్తి, దానినుండి ధనోత్పత్తి నొనరింప శాంతి శమ దమాది సద్గుణములతో పరమాత్ముఁడు నిన్ను సృష్టించెను. నీవే పరమేశ్వరుని ప్రతినిధివి. నీకు వైతాళికునిగా నన్ను పరమేశ్వరుఁడు సృజించినాడు. నీవు ప్రాలుమాలిన నేను ప్రాలుమాఁగలనా? ఉభయులము ప్రాలుమాలిన జగమెటుల స్థితి రూపముఁ దాల్చఁగలదు? అయ్యో! మమ్ముల వధించు దుష్టులకు, మా మాంసముచే మత్తెక్కిన ఘాతుకులకు, మా కూతలు వినఁబడునా! లెమ్ము. లెమ్ము. రైతురాజా! పగలెల్లయు నీ కష్టముఁ జూచితిని. రాత్రియంతయు నీకు నిద్ర తరుగమ్యైనని

తెలిసికొంటిని. ఐన నేమిచేయఁగలను? ప్రాణిపోషకద్రవ్యమూలోత్పత్తి కాలవాలంబవు. ఇటుల నేను నిన్ను మేలుకొలుపుట నీయాజ్ఞచేతనేగదా, అను అంతరార్థముచే నొకసారి, రెండుసార్లు, మూడుసార్లుగా రైతును మేలుకొలుపుచున్నది.

ఇంతయు కోడికూఁత, నిత్యపరోపకారముకై పాటుఁబడు కార్మికకర్షకులే గమనింతురు గనుక, వ్రాయవలసి వచ్చెను. కార్మిక కర్షకబృందమే జగత్స్థితి కాధారభూతులు. అట్టివారికి సహాయకారి యగు కుక్కుటము జగత్తునకు సహకారి కాదా? ప్రేమదృష్టిచే దానినెట్లు వీక్షింపవలయునో సర్వజనులకు విదితమగుచుండలేదా?



## బాతు.

బాతులు కోడిజాతిలోఁ జేరినవి. ఇవి ఎక్కువగా నీటి యందు దిరుగుచుండును. నీరన్న వీని కధికప్రియము. ఆహారము పలుతము నీటియందే గ్రహించుచుండును. నీటిలోని పాచి ఇతరములగు పదార్థములఁ దిని జీవించుచుండును. ఇందువలన నీరు నిర్మలమగుచున్నది. చూచుట కివి మిక్కిలి అందముగా, ఆకర్షణీయముగా నుండును. నీటిలో నీదులాడునపుడు నేత్రప్రియమైన దృశ్యముఁ గానుపించును.



పావురము.

పావురముకూత మిక్కిలి శ్రోత్రప్రియముగా నుండును. అవి అధికముగా పొలములలో రాలిన గింజలు, చిన్ని చిన్ని రాళ్ళను గైకొని జీవించును. వానిని ప్రేమతో పోషించిన మిక్కిలి ఉపయోగముగూడ గలదు. వ్యయము; చాలతక్కువ. పూర్వ మీ జాతిప్రాణులచే విజ్ఞాను లొక ప్రదేశమునుండి, మఱియొకచోటికి వార్తా పత్రికల నంపుచుండిరి. ఇవి ఎంత నేర్పరితనముగలవియో, సూక్ష్మజ్ఞానముగలవియో యోచింపుడు.



కోకిల.

కోకిల నిరపకారి, చిగుళ్ళు తిని జీవించును. దీని కూతయందు పంచమస్వరము గలదు. అవ్యక్తముగా గానముఁ జేయును. ఆ గానము చెవు కింపై మనసు నానందాబ్ధి నోల-

లాడించును. పంటఫలములు నాసింపకయే సర్వవేళల నధికముగా ప్రాతస్సంధ్యావేళల నమూల్యగానముచే మానవులను తన్మయులనుగా నొనరింపుచున్నది. కోకిలకూతకుఁ జెవినొగ్గనివాఁడు కలఁడా!



హంస

హంస పక్షిజాతిలో నగ్రస్థానము వహించు చున్నది. దీని గమనము భరతశాస్త్ర ప్రావీణ్యులకును ఈ నాటి వేశ్యలకబ్బునా! అధిక ధనవ్యయముచే నలవరించుకొనినను భగతి పాండిత్యమునందును, శాళిన్యాసమునందును మానవునకు లయ తప్పునుగాని, దీనికి తప్పదుగదా!

# నెమిలి

నెమిలియు నీజాతిలోనిదే. మేఘవర్ణనమైన దీనినృత్యము నేత్రానందమై వర్ణనాతీతముగా నుండును. ఆహా! ఏమి? సృష్టిని పక్షిజాతిలోను గాయకులు, నటులు గలరుగదా! ఇట్టి పక్షిజాతి మానవజాతికి సమానముగాదా! అవిద్యాశాస్త్రమును నభ్యసింపకయే అవాఙ్మానస గోచరమైన గానము, నద్వితీయమైన నృత్యమొనర్చి సృష్టికలంకార మొనర్చుట లేదా!

జలముమానవునకుఁ బ్రాణాధారము. జలమునందు ప్రాణశక్తి, పవిత్రత గలదు. జలమం దెటుల ప్రాణము, పవిత్రత, పరపోషనాది గుణములుండెనో అటులే జలము నాధారముఁజేసికొని జలసంతానములైన జీవులయందును, పవిత్రత, సహకారతలు గలవని ఊహింపవలెను. జలము సేవించి జలసంతానమును నాశనమొనరింపఁగలమా! అది ఎంత కృతఘ్నత! పంచ మహాభూతములలో రెండవదైన జలము సర్వప్రాణుల కాధారము. జీవోత్పత్తికి మూలకారణములం దొక్కటైనపుడు ఇద్దాని సంతానము మానవుని కెంత ప్రేమాస్పదము! జలచరములలో కొన్నింటి ప్రయోజనముల నిట నూహింతము.



చేప.

చేప ముఖ్యముగా తన కాధారమైన జలమును వీడిన నిముసమైన జీవింపజాలదు. చూచుటకుఁ గన్నులపండువుగా నుండును. నేత్రములయందు తీక్ష్ణత, తళుకు బెళుకులు గలవు. చేప జాతికి భూమియందుగల ప్రాణులతో నెట్టి విరోధముగాని, అసూయగాని లేదు. జలమును మకిలినుండి వేరుజేసి శుభ్రపఱచుచున్నది. జలమునం దాయుర్వృద్ధికారములగు ప్రాణవాయువును సర్వదా నిలుపుచున్నది. ఏమి! దాని యనుపమాన సహకారము!

సామ్రాట్టులు సయితము తాము రవి యస్తమింపని భూభాగమునకు నామమాత్రముగా ప్రభువు లనిపించుకొని, భూసారమును గుంజుచు, పాలితుల బీడించుచు నేడు రాజ్య పాలనయందు ఆరోగ్య నిర్మాణ విధి మానవకృత్యములకంటె నెన్నిరెట్లో తక్కువ జేయుచున్నారు. ఇటులే తాబేలు, కప్ప మున్నగు జలచరములు ప్రాణులకొరకును మేలు చేయుచు చున్న వనుటలో సందియ మిసుమంతయును లేదు.

---

# ఆహార మీమాంస

జగదుత్పత్తి స్థితుల కాహారము ప్రధానము. ఆహారము లేనిచో స్థితి లేదు స్థితి లేనిచో నుత్పత్తియును లేదు. ఉత్పన్న మైన ప్రాణిజీవికి క్షుధాగ్ని విజృంభించును. ప్రాణి మరణాంత కాలము క్షుధాగ్ని చల్లారదు. క్షుధాగ్ని పునీతమైనది. యజ్ఞ యాగాదులం దగ్నిభాగము నాహ్వానించి ఘృత పాయసా దుల నర్పించుచుండిరి. ఇందలియర్థము ఆరాధింపబడు ఆ బాహ్యాగ్నివలెనే క్షుధాగ్ని పవిత్రమైనదనియు, సర్వకాలము తీక్ష్ణముగా ప్రజ్వరిల్లవలెననియు నారాధించుచున్నారు. లేనిచో నగ్ని నారాధించు నవసరమేల కలుగును? దీనివలన యజ్ఞ యాగాదులను సర్వవేళల ప్రాణికోటియందిమిడియున్న క్షుధాగ్ని నిర్మలినమై యుండుటకే నేర్పరచిరని ఏల యూహింపరాదు? అగ్నియందెంత శుచిగలదో అగ్నికాహుతినిచ్చు పదార్థమునం దంతయే శుచి యుండవలెను "శుచిరప్పిత్తం మౌర్వస్తు బాడబో బడబానలః" అను అమరుని వాక్యముచే అగ్నికి శుచినామ

మివ్వఁబడెను. శుచిరూపియైన అగ్నికి శుచి కితరమైన పదార్థ మొసఁగుట గర్హ్యము.

బాహ్యాగ్నివలెనే క్షుధాగ్నియు సర్వమును హరించు శక్తిగలది. భూమియందు వాయువు, జలము మఱియు నితర పదార్థములును ప్రాణికోటి కాహారమగుచున్నవి. ప్రాణులు భుజించు ఆహారమునం దెట్టి గుణము గలదో, భుజించు వాని యందు నట్టిగుణము లుత్పన్నమగుచున్నవి. నిర్మలవాయువును సేవించి మాలిన్యమైన దాని నెటుల వదలుచుంటిమో, మలిన రహితమైన జలమును స్వీకరించి తద్విరుద్ధము నెటుల విడనాడు చుంటిమో, అటులే మలిన పదార్థములను వదలి మలినేతరము లైనవానిని స్వీకరింపవలెను. మలిన మలినేతర పదార్థములను ముందు తర్కింతాము.

జగత్తు త్రిగుణములతోఁ గూడుకొని యున్నది. అవి సత్వరజస్తమములు. సత్వమందు సౌఖ్యము కలదు. రజోగుణము నందు సంపూర్ణ సౌఖ్యముండదు. తమస్సునందు సుఖశాంతు లెన్నఁడును కలుఁగవు. ఇట్టి సత్వరజస్తమో గుణములు స్వభావ సిద్ధములై సృష్టినంతయు నావరించినవి. అటులుండియు, తిను నాహారముచేతను, చేయుకర్మముచేతను పూర్ణతా రూపముఁ బొంది, వాని వానికిగల సౌఖ్యకరములైన, నాశకరములైన ఫలితముల నొసంగుచున్నవి. ప్రతిప్రాణియం దెటులీ త్రిగుణములు గలవో, అటులే ఆహార పదార్థములం దిమిడియున్నవి. ఆహారముచేత ఇంద్రియములు పుష్టిఁజెందుచున్నవి. ఇంద్రియ ప్రభావముచేతనే లోకమునందు సుఖదుఃఖములు గలుఁగు

చున్నవి విజ్ఞానియైన మానవుఁడు ఇంద్రియజేత గావలయును కాని, ఇంద్రియలోలుఁడు గాకూడదు. ఇంద్రియములను జయించిన వానికి జగత్తునందు రహస్య మనునది యుండదు. ఇంద్రియవశుఁడైనవానికి అదియే యంధకారముగా దోచును. ప్రాణికి శక్తి యనునది ఉత్తమాయుధము. అట్టి ఆయుధ మే ప్రాణికైనను తనకుపయోగించునదిగా నుండవలయును కాని, తనను నశింపఁ జేయునదిగా నుండకూడదు. ఇందుమూలమున ప్రాణియం దున్నశక్తి ఆహారమూలముననే యుద్భవించు చున్నట్లుఁ దెలియుచున్నది. కనుక అట్టి ఆహార మనుకూలించునదిగా నుండ వలెను. కాని కేవల విరోధ ప్రాయముగా నుండరాదు.

వైద్యుఁ డౌషధమును తయారు జేయుటకు అగ్ని, జలము, భాండము, దినుసులును గ్రహించి కార్యసిద్ధుఁడగు చున్నాడు. అతఁడు రోగ నిదానము గ్రహించి రోగనిర్మూలన మగుటకు దీర్ఘ పరిశీలనచే దినుసులను గైకొనుచున్నాడు. అగ్నిపై భాండముంచి, భాండములో గావలసిన మూలికలు నెచి వంట కముఁ దయారు జేయుచున్నాడు; అటులే ప్రాణికి దేహ మను భాండమందు, యుక్తాహార మనుదినుసులు జఠరాగ్నియను అగ్నిచే పచనమగుచున్నవి. దినుసుల ప్రభావముచే నౌషధ పాకము సిద్ధిఁబొంది రోగముల నెటుల నిర్మూలనముఁ జేగునో అటులే యాహారప్రభావమున మానవశక్తియు వృద్ధిఁబొందు చున్నది.

త్రిగుణములవలెనే ప్రాణికోటి నాశ్రయించి వాత, పిత్త, శ్లేష్మము లను త్రిదోషములు గలవు. ఈ దోష ప్రభావ

ముల నెరింగి, తద్వినాశనములైన క్రియల నాచరింపవలెను. త్రిదోషములు సమస్థితియం దుండునంతవర కారోగ్యము నన్య వి పంజాలదు. దేనియందు దేహ ప్రభావము మెండుగా గలదో దాని ననుసరించిన రోగ ముత్పన్నమగును. కనుక ప్రాణికోటి త్రిదోష సమన్వయములైన పదార్థములనే భుజింపవలయును. త్రిదోషములు సర్వపదార్థములం దిమిడియున్నవి. ఏవస్తువు నం దే దోషముఁ గలదో పాఠకులు వైద్య గ్రంథములయందు వానిని చూడందగును. త్రిదోషములే యే వస్తువు లందెట్టు లగ్నమై యుండెనో ముచ్చటింప నిచ్చట తావుండదు. త్రిదోషములు సమముగా నుండిన సత్వగుణ మభివృద్ధిఁగాంచి మనసున కుల్లాసముఁ గలుఁగును. త్రిదోషముల వికృతిచే తమోగుణము వృద్ధిఁజెంది మనోదేహములకు పీడ, కష్టములు కలుఁగును. ప్రాణాయామాది సదభ్యాసములచే త్రిదోషముల వికృతి నశించి చిత్తస్థైర్యముచే సత్వసంపత్తు గలుఁగుచున్నది. సత్వగుణ సంపద సిద్ధించినపుడే ప్రాణికి శాంతి సౌఖ్యములు, నిరతిరానంద ప్రాప్తి యగును. సత్వగుణమునందు క్రియాగుణ ఫల పరిశీలన గలుగును. రజోగుణమునందు తత్పరిశీలన కొంతలోటు. తమోగుణమునందు తత్పరిశీలనాచరణము లు తొలఁగి అంధకారమునఁ బడును. సృష్టియందు సత్వగుణమే సర్వజీవుల కాధారభూతమైనటుల గానుపించుచున్నది. సత్వగుణోద్ధారణకై యోగశాస్త్రములు సృష్టింపబడినవి. ఇట్టి యోగాభ్యాసౌషధయోగములు జగత్తునందు సత్వగుణము శాశ్వతముగా నుంచగలందులకై వ్రాయఁబడియున్నవి. కొంద రాధునిక విమ

ర్షులు యోగాభ్యాసములచే దృఢీకరింపఁగలరు కాని, ఔషధ యోగము లెట్లు వికనాడ గలవు?

సత్, అనగా ఉండునది. వాస్తవముగా ప్రతివానికుండ దగినది. అసత్ అనగా నుండదగనిది. ఇచ్చట, అసత్, అనగా త్రిదోషముల వికృతి. అదియే మనో దేహముల నావరించు కొను రోగజాలము. రోగి వైద్యుని చెంతకేగి ఆరోగ్యము లేదని తెలుపుచున్నాడు. అనగా దేహమునందుండదగినది లేదనుట. అంతట దానికౌషధమును సేవించుచున్నాడు. వెంటనే సత్వము (బలము) గలుగుచున్నది. సత్వసిద్ధియే జగత్తునకు క్షేమంకరము.

దేహమునందు రుగ్మతగల ఏమానవునికైనను బాధ, అశాంతి, నిర్హేతుక క్రోధము, ఇతరులపై ఈర్ష్య, తనుదాను నిందించుకొనుట మొదలగున వెన్నియో గలుగుచున్నవి. ముఖ్యముగా మానవునకు తాను రోగినని తెలియును. ఇట్టి గుణములన్నియు రోగమువలననే నుద్భవించినవని తెలియును. రోగమెట్లు సంభవించినదియు కొలఁదివరకైనను గ్రహించగలడు. ఇట్టి రోగమే పదార్థసేవచే పుట్టినదనికూడ చింతించును. వైద్యునిచెంతను తానట్టి ప్రశ్నకే ప్రత్యుత్తరమీయఁదగి యుండును. అతని రోగవిముక్తికై ప్రథమ చికిత్స ఆహారము మారుట. ఆహారముమారినగాని, తత్పూర్వాహార దోషనివృత్తి కాజాలదు. ఆహారదోషమునకు ప్రాయశ్చిత్త మాహారము మార్చుటయే. ఆహారసేవనయందు దప్రమత్తుఁడగుటవలననేఁదా తానొనర్చిన తప్పిదమునకుఁ దా లొంగవలసివచ్చెను. ఆహారము

గురు, లఘువు లని రెండువిధములు. గుర్వాహారము త్వరలో పచనముగాక సర్వదోష ప్రదమై యుండును. లఘ్వాహారము సత్వర పచనార్హమై దోషరాహిత్యమైనది. గుర్వాహారముచే నుత్పన్నమైన దోషములు లఘ్వాహారముచే నశించుచున్నవి. పైఁజెప్పిన రోగికి వైద్యుఁడు ప్రథమ చికిత్సలో ఆహార నిషేధ మవలంబింపఁ జేయుచున్నను, లఘ్వాహారమిప్పించును. లఘ్వాహారమునందు సత్వగుణముదర్క, రజస్తమోగుణము లదృశ్యములు.

లఘ్వాహారము పైనిరూఢిచే సాత్వికాహారమగుచున్నది. రోగముఁగలుఁగనీయనిదియు, ఉద్భవించిన రోగము నశింపఁ జేయునదియు సాత్వికాహారమే. రోగవిముక్తి గోరువారు సాత్వికాహారమునే తప్పక భుజింపవలెను. సాత్వికాహారమునఁ దెంతసౌఖ్యముఁగలదో పై విషయమునందే తేటతెల్లమైనది.

అగ్నియందు గురుపదార్థములు బడవైచిన అగ్ని శమించుటయేగాక, ధూమ మను జాడ్యము సంభవించును. లఘు పదార్థములు వైచిన బాగుగా అభివృద్ధిఁజెంది నిర్మలరూపముతో వగ్ని తేజరిల్లును. అటులే ప్రాణి క్షుధాగ్నికి గురుపదార్థము నాశకారిణియనియు, రోగోత్పన్నమనియు, లఘుపదార్థము జఠరాగ్నికి అభివృద్ధికరమనియు, మనోదేహములకుఁ దేజఃకరమనియుఁ దెలియుచున్నది. గురు లఘుపదార్థముల విభేద మనుభవముచేతను, వైద్య గ్రంథాముల సహాయముచేతను గమించుకొనఁదగును. లఘ్వాహారము గైకొనువారి కనారోగ్యము సంభవింపదు. అటుల సంభవించుట లేదా? అను ప్రశ్నకు మితామితాహారమునుగూర్చినచర్చలో సమాధానముస్పష్టమగును.

సత్వగుణ సిద్ధికై యోగపురుషులు లఘ్వాహారమునే సేవింతురు. లఘ్వితరాహారముచే యుక్తజ్ఞానసిద్ధి గలుగదని వారి యూహ. నేటి శాంతిసమర నాయకులు శాంతిస్థాపనకై కార్యసిద్ధిమార్గములుగాంచ, ననేక దినము లుపవాస చికిత్సయు, బహుకాలము లఘ్వాహారభుక్తియు నాచరించుటఁ గన్నులారఁ గాంచుచుంటిమి. కేవల రజస్తమో గుణ యుక్తులై స్వార్థపరాయణత్వముచే ఖండ ఖండాంతరముల యందును, పవిత్ర భారత ఖండమునందును ప్రజాపీడన మొనరించువారి దుష్కృత్యము లంత మొందించుటకు సత్వాహార మెంతయో ప్రయోజనకారి యైనదికదా!

## ఆహార స్వభావము.

ఆహారము సామాన్యముగా పక్వాఽపక్వములని రెండు విధములు. పక్వాహారములోకంటె నపక్వాహారమునందు నెక్కుడు ప్రాణరేణువులుగలవు. సాధారణముగా మానవులు పక్వాహారమును, మానవేతర ప్రాణులు అపక్వాహారమును తిందురు. శాక, ఫల, కంద మూలాదులును, గోధూమాది ధాన్యములును అపక్వాహారములై యున్నవి. ఇవన్నియు సత్వగుణ ప్రధానములు. పక్వముఁజేసిన నివి వికృతిఁజెందుచున్నవి. పచనముఁజేయక భుజించిన వీని నైజగుణము నశింపక, సేవించు నే ప్రాణికైనను సత్తువనిచ్చును. షడ్రసములు పదార్థములకు నైజము. షడ్రసములలోను వేరు వేరుగా త్రిగుణోత్పాదక శక్తి గలదు. అందుచే సత్వసిద్ధికరములైన రసములను దెలపెదను.

ప్రతివస్తువందు జలము, మాంసోత్పత్తి, పుష్టి తత్వము, తీపి, ఉప్పు, జిడ్డు మొదలగునవి మిళితమై యున్నవి. జలము లేనిచో

త్వరలో బచనముగాజాలదు. మాంస, పుష్టికత్వములు లేనిచో దేహబలముండదు. తీపి, ఉప్పు లేనిచో దేహమునకు సౌమ్యత గలుగదు. జిడ్డులను పదార్థము లేనిచో ధాతువు బిగియదు. ఈపైవి ధాన్యములు కూరగాయలు, పాలు, ఫలములందు గలవు. పాలు, పండ్లు శాకాదులవలెనే సేవింపదగు నాహారము లలో జేరనవి ధాన్యాదులలో పుష్టికత్వము మెండు. కూరగా యలలో నంతకంటె కొంచెము తక్కువ. దీనికంటె నధికము పాలయందును, మీగడయందును గలదు. కొంచెము తక్కు వగా కాయలందును గలదు. కూరగాయలు, పాలు, పండ్లయం దును దేహమునందలి అంశలను తొలగించు గుణముగలదు. లోనున్న మలినమును బైటికి పోగొట్టగలవు. పాలు, పండ్ల రసము సర్వరోగులకు పథ్యములు.

ఈ విధముగా ధాన్యములు, కూరగాయలు, పాలు, ఫలములు మున్నగు పదార్థములు దేహమునకు ధాతుపుష్టి, మాంసపుష్టి నొసంగి సత్వర పచనార్హములై యుపహారములుగ నున్నవి. వీనివలన దేహమునందు వికృతి గలుగదు. ఒక్క ధాన్యమును సేవించిన సర్వగుణములు గలుగక పోవచ్చు. అందుచే నట్టి ధాన్యాహారమునకుందోడు పప్పుదినుసులు, కూర గాయలు, పండ్లు, పాలు మీగడ మొదలగునవి భుజించిన, దేహమునందు తగినంత ధాతుపుష్టి గలుగుచున్నది. షడ్రి సోపేతమైన యాహారభుక్తి దేహమున కెంతయు బలవర్ధకము. ఇవి సులభ్యములు. సుకజీర్ణ ప్రదములు. ఒకదానియం దేదైన లోపము గన్పట్టుచో దీనిని మిళితముగా భుజించుటచే నాలోపము సవరింపబడుచున్నది.

వీనిని వదలి సృష్టిలో మరొండాహారము అనారోగ్య మనియు, లభింపదనియు, లభించినను ఇట్టి సకల సుగుణోపేతమై లఘువుగా నుండదనియు నుడువు చున్నాడ.

ప్రపంచము ధాన్యసమృద్ధిచే నలరారుచున్నది. ధాన్యముత్పన్న మొందనిచోట మనుష్యజాతి వసింపదు. జనసంఖ్యకుం జాలునంత విరివిగా ధాన్యాదులు పండుచున్నవి. ఏ ఖండమందైనను ధాన్యోత్పత్తి లోపము సంభవించిన, ఖండాంతరముల నుండి అట్టి లోపము తుడువంబడుచున్నది. ఉదార బుద్ధితో పశుపోషణ గావించిన, పాలు, మీగడ, వెన్న మొదలగు వానికి లోపముండదు. ఈ యాహారముకంటె నారోగ్యమునుగునది మరొండు లేదు. పండ్లకు ప్రపంచమునం దెట్టి కొరతయు లేదు. ఇంత సులభ్యమైన ఆహారపదార్థము నెవండు విడువగలడు? నిక్కమముగా సృష్టియందు ప్రాణికోటి కివియే నిరపాయముచే లభించు నాహార పదార్థములు.

మానవులవలె నితర ప్రాణు లాహారమును పక్వముంజేసుకొని ఉపయోగింపవు. దొరకిన యాహారమును దొరకిన రీతినే భుజించును. ఈ కారణమున వానికాహారమునందు యుక్తాయుక్తత లేదు. కొన్నిప్రాణులు జ్ఞానశూన్యము చేత మ యెదుట నున్న ఇతరప్రాణుల నాహారముగా నుపయోగించుచున్నవి. దానినే మాంసాహారమందురు. ఇట్టిది జంతువుల వలననే సంభవించుచున్నది. చరిత్ర పరిశీలనచే ఆదిలో మానవులు నాగరిక దూరులై జంతువులవలెనే అటవులయందు సంచరించి ఇతరప్రాణుల నాహారముగా నుపయోగించిరని తెలియుచున్నది.

ప్రత్యక్షముగా మన యెదుట నాహారముదిను ఎట్టి జంగమ ప్రాణినిగాని యాహారముగా నుపయోగించుట, నింద్యము. మనవలె నివి భోక్తలుగాని, భోజ్యములుగావు. తిను ఆహారముఁ దొలుత గన్నుల కాకర్షణీయముగా నుండవలెను, అట్టి ఆకర్షణీయ పదార్థములలో పైనుదుసఁబడిన ధాన్యశాకాదులు శ్రేష్ఠములు.

## మలిన మలినేతరాహారము

పుష్ప ఫలములనుండి ధాన్యశాకాదు లుత్పన్నమగు చున్నవి. పుష్పము లేనిదే ధాన్యములును, ఫలములును సామాన్యముగా నుత్పత్తికాజాలవు. పుష్పములం దాకర్షణ యత్యధికము. పుష్పమునందు మధువుగలదు. మధువు భూలోకామృతము. తత్కారణమున ధాన్య, శాక ఫలాదులు చిరాయుః ప్రదములు. కావున ఫలశాకము లేల భుజింపరాదు? అనుప్రశ్న వచ్చును. వర్షపునీరు తొలుత నిర్మలమైనది. అట్టిది ఉప్పునేల యందు బ్రవహించిన త్రాగజాలము. మలిన ప్రదేశములందుఁ బ్రవహించిన త్రాగక వదలుదుము. ఇసుకనేలల యందును, రాతి ప్రదేశములయందు బ్రవహించిన వర్షపునీరు రుచికర మనియు, ఆరోగ్యదాయకమనియు గ్రహింతుము. ఎచ్చట ప్రవహించిననేమి? వర్షపు నీరేగదాయని త్రాగుచుంటిమా? మలిన వస్తు సంపర్కము లేనివాయువు నాఘ్రాణింతుము. వాయువు ప్రాణతుల్యమని దుర్గంధయుతమైన దానిని పీల్చుచుంటిమా! అటులనే అమృతమూలములగు పుష్పములం దుద్భవించిన ఫల శాకాదులు బీజస్థలదోషముచే విసర్జింపఁదగినవి. పై యుపమాన

ములవలెనే అవియును స్వాస్థ్యభంగములు. పచ్చివస్తువేదియై నను పాకముఁజేయఁబడియు, చేయఁబడకయు ప్రాణికోటియం దున్న క్షుధాగ్నికి సామాన్యముగా జీర్ణమగును. జీర్ణశక్తిగల దను నభిప్రాయముచే ప్రతిపక్వాపక్వ పదార్థములు భుజింప రాదు. ప్రాణి, దేహము బోషించి లోకికార్య సాధన నెర వేర్చ వలెను.

దేహమునం దనేక మలములు గలవు. మలములుంటచే అది మలిన భూతమగుచున్నది. ఇట్టి మలిన పదార్థము నాహా రముగా దీసుకొనుట యుక్తముగాదు. ఎట్టి ప్రాణి దేహచ్ఛే దముఁజేసినను, చూచునపుడు బీభత్సము, హేయముఁ బొడ ముట ప్రత్యక్షము. ఏపదార్థము బీభత్సహేతుములుగా నుం డునో అట్టి దానిసేవనచే దేహమునందు శాంత్యుత్సాహాది గుణములు గలుఁగవు. మలపదార్థములను భుజించువాఁడు మలి నుఁడై భయంకర చేష్టలఁ గావించును. ఆకర్షణీయములును, బీభత్సదృశ్యముఁ జూపక, కేవలోత్సాహమునే గలిగించునవి భుజించువారికి సర్వదా యుత్సాహముఁగలుఁగు చుండును.

సామాన్యముగా స్వచ్ఛమైన జలమును త్రాగుదుము. గాని ఆజలమే ఇతరప్రాణి జీర్ణకోశముఁబొంది వెలువడినచో గ్రహింప యోగ్యమగునా? అటులే వేరొక ప్రాణి శాకాదులనే జీర్ణముఁ గావించుకొనిన దాని కాశించుట అయోగ్య మగును. ఏ పదార్థమైనను వేరురూపు దాల్చకమును పే దానిస్వభావ గుణ ములు నశింప కుండును. పుష్పమును లతనుండి గ్రహించిన, దాని అందము, సువాసన చెడక మన కానందముఁ గలిగించును.

ఇట్టిపుష్పమే వేరొకని భోగముకై శయ్యయందో లేక కేశములయందో యుంపఁబడి విసర్జింపగా దానిస్వభావగుణ మెంతయో మాయుచున్నది. పనికిరాని పదార్థములే అట్టి పుష్పమునందు మిగులుచున్నవి. ఆ పుష్పభోగ మొకని జ్ఞానేంద్రియ తృప్తి కొరకే.

ఆహారమందు త్రిపదార్థములు గలవు. ఒకటి జ్ఞానేంద్రియములకుఁ జెందుచున్నది. అదియే ఆహారమందలి సర్వోత్తమము. అనుభవించిన వానికేదక్క, ఇతరుల కది యలభ్యము. రెండవది పైదానికన్న తక్కువ ఫలము నిచ్చును. మూడవది కడు హేయముగా విసర్జింపఁబడుచున్నది. ఈ నుడువఁబడిన రెండవది దేహమందలి రక్తమాంస కండరాదులు. మూడవది మలమూత్రాదులు. దీనింబట్టిచూడ, మానవుఁడు శాకాహారమును ప్రత్యేకముగా భుజించిన, దానియందున్న మొదటిదియగు సర్వోత్తమ మగునట్టి జ్ఞానేంద్రియములకుఁ బుష్టినిచ్చు భాగము నశింపక జ్ఞానసిద్ధి గలిగించునని నమ్మకతప్పదు. అటుగాక మాంసము భుజించిన, రెండవదైన మాంసకండరముల వృద్ధిబరచుభాగమునే గలిగించునని ఊహింతము. అటులఁజూచినను, దానియందు శాకాదులందుగల గుణవిశేషము పూర్ణముగా నుండదు. జ్ఞానేంద్రియ పుష్టికరముగాని ఆహారము సర్వదా విసర్జింపఁదగినది. జ్ఞానహీనత పశుతుల్యము. కేవల శాకాదుల గైకొనిన పశువులకు జ్ఞానముఁగలదా? అను ప్రశ్నరావచ్చు. అట్టివానికి జ్ఞానము గలదు. మిక్కిలిగాగలదు. వానిజ్ఞానముఁ బ్రదర్శించుటకు వాగింద్రియ లోపము సృష్టిలో

తరగతి భేదములకే సిద్ధించెను. వాస్తవముగా జ్ఞానమే లేనిచో రెండవ ప్రకరణములో దెలుపఁబడిన జీవప్రయోజనమే విధముగా మానవునకుఁ గలుఁగును? అవి ఆహారమందలి సర్వోత్తమమైన పదార్థమును స్వభావములో మార్పుఁ జెందకమునుపే భుజించుట వలనను, మానవునికన్న విశ్వాసాను రాగములయందు మించియే జ్ఞానప్రదర్శన మొనరించుచున్నవి. అవి పైనివ్రాసిన ఆహారమందలి రెండవ భాగమే ప్రాధాన్యముగాగల ప్రాణిహింసాహారము నాసింపవు. ఇందువలన శాకాహారము యుక్తమనియు, తదితర మయుక్తమనియు, ఆహారమందలి యుక్తాయుక్తము వివరింపఁబడినది.

ప్రపంచమునందు శాకాహారులు, మాంసాహారు లని ప్రాణిసమూహమందు రెండుతరగతులు గలవు. శాకాహారుల స్వభావములు లోకోపకారములు. తదితరములు లోకాపకారములు. మొదటి తరగతియందుఁజేరినవి ఆవు, గేదె, మేక మొదలగునవి. వానివలన మిక్కిలి ఉపయోగము గానుపించుచున్నది. రెండవ తరగతికిఁజెందిన సింహము, పులి, ఎలుగు మొదలగు వానివలన నెల్లవేళల నపకారమే. వీనిబారినుండి రక్షింపఁబడుట కెన్నియో ఉపాయములు, జాగ్రతలు నవలంబింప వలసి వచ్చినది. మంచిఆహారమును బట్టి సద్భావముఁ గలుఁగునుగాన, వీనికిట్టి యపకార స్వభావము. అవితిను మాంసాహారము నుండియే కలిగినది. వీనిశరీరములు బలిష్ఠములు. ఆకలి లేనంతవరకు నిద్రించుటయు, ఆకలి గలిగినతత్క్షణమే దొరకినప్రాణిని తినుటయు వీనిస్వభావము. వీనినుండి రక్షణ మానవకోటి తిరి

కాలములయందు జాగ్రత్తపరచుకొనుచున్నది. ఇట్టివి శాకములు భుజించినచో ఇతర ప్రాణులవలె నుపయోగములై యుండెడి వేమొ! ఇవి శాకాహార విముక్తతచే మాంద్యగుణ ప్రాయములై యున్నవి. మాంద్యత నిష్ప్రయోజనము. ఆహారము వెదకుట యందుదక్క, మాంద్యమును వదలవు. పరమేశ్వరుడిట్టి జీవులను శాకాహారమునకే పుట్టించి యుండగూడదా! ఏలయనః సృష్టిలో ప్రాణినాశనమున కెట్టి జీవియుఁ గలిగి యుండలేదు. ఈజాతిజంతువులకు నజ్ఞానకారణమున ఆచారమే స్వభావమైనది. వీనిస్వభావము క్రూరము. మాంద్యతయందు క్రూరము వీనికిఁ గలిగినది. శాకేతరాహారమునందు క్రూరత్వముఁ గలదని తెలుచున్నది. శాకాహారము భుజించు జంతువులు సయితము క్రూరస్వభావులై యుండలేదా? అను ప్రశ్న గలుగును. అట్టివానికి క్రూరస్వభావముండవచ్చు. కాని కేవలమాహారార్జనమునకై ఇతర ప్రాణుల నంత మొందించుటకు క్రూర స్వభావ మనుసరింపవు. అపకారమొందిగాని లేక యితరములైన స్వభావములచే గాని ఎప్పుడో యొకప్పుడు క్రోధోన్ముఖములగును, నిత్యాచారముగా ప్రతిక్షణమునందు నట్టి క్రోధమును వహింపవు. వీనికి క్రూరస్వభావమున్నను మానవుల కేదోవిధముగా నుపయోగపడును. పైవానివలె నిరుపయోగములుకావు. పైక్రూర జంతువులను మాంసాహార దోషమువలన బుట్టిన దుర్గుణముల వలననే విసర్జింప వలసివచ్చెను. వానికుపయోగపడు నాహారమును సయితము అనగా మాంసాహారమును విసర్జించుట యుక్తమని తలపవచ్చు.

ఒకడే పదార్థమునైనను నోటితో స్పృశించి ఉమిసి తిరిగి దానిని గ్రహించ నసహ్యపడును. అందులకుఁ గారణము, ఆనోటిలోనున్న మఱియొక నిషేధపదార్థమును, అనగా మాంసము స్పృశించుటచే గ్రహించుట కర్హముగాదని తెలియుచున్నది. దీనివలన నెవనికి మాంసము వానికే యసహ్య మనఁబడుచున్నది. అటులగానిచో తన నోటియందున్న మాంసమును తగిలిన పదార్థ మేల గ్రహింపఁడు? మాంసముఁ దినఁదగినదే యైనచో దానిని స్పృశించిన యాహారమును తినఁదగినదై యుండవలెను. కాని యిచ్చో విరోధముఁ గలుఁగుచున్నది. అట్టిపదార్థము నీవేల స్పృశింపవని యొకనినిఁ బ్రశ్నించిన, వాడు – ఛీ, ఛీ, ఎట్టి యసహ్యకరమైన మాటలను పలుకుచుంటివనియు, ఈపదార్థము లోపలి మాలిన్యమైనదానిని తాకి వచ్చినదనియు, గాన అట్టిది గ్రహింప నయోగ్యమని ప్రత్యుత్తరమిచ్చును. ఇందువలన లో నున్నవి రక్తమాంసాదులు, వానిని స్పృశించు జలవాయువులు. అట్టివాని సంపర్కముచే ఏపదార్థమైనను మాలిన్యముఁ జెందుచున్నది. రక్తమాంసాదులు స్పృశ్యములుగావనియు, గోప్యముగా నుంచదగినవియేగాని, చూడఁదగినవియు, అనుభవింపఁదగినవియు గావనియు తెలియుచున్నది. శాకాదులందు సస్పృశ్యత, అసహ్యత కలుఁగదు. శాకఫలాదులను స్పృశింపఁగలము. ఆనందింపఁగలము. ఇతరులకుఁ బ్రదర్శింపఁగలము. అస్పృశ్యపదార్థము భుజింప నయోగ్యము. అందుచే మాంస మయోగ్యమైనదియే. శాకఫలాదులందును సుగంధముఁ గలదు. వానికి మలమూత్రసమ్మేళనము లేదు. మాంసమందు దుర్గంధమును మలమూత్రసమ్మేళనయు గలదు. జీర్ణ

కోశము, మూత్రకోశము, మలకోశము మాంసపుతిత్తులచే నిర్మింపఁబడినవి. మలమూత్రకోశములు మాంసరూపిమైన తిత్తులచే దప్ప, కొయ్య, ఇనుము మొదలగువానిచే జేయఁబడినవి కావు. శాకఫలాదులకు మలమూత్రకోశములు లేవు. కనుక వానికి మాలిన్యము లేదు. అవి వికృతిఁజెందిన, రక్తమాంసములుగా మారును కాని ప్రకృతిలో రక్తమాంసములు లేవు. రక్తమాంసములు స్పృశ్యములు గావని నిర్ధారింపఁబడెను. కాన శాకాదులు స్పృశ్యములగుచున్నవి. శాకాదులు మలిన రహితములనియు, శాకేతరములు మలినములనియు విదితమగుచున్నది. మలిన మలినేతరాహార విచక్షణ, అవశ్యవిచారణీయము.

పుష్పమందు సుగంధము గలదు. సుగంధ మాస్వాదించిన, నుత్సాహశాంతులు గలుగును. పుష్పమునందు శాంత్యుత్సాహము లుంటచే, పుష్పోద్భవములైన ధాన్య, శాక, ఫలాదులందును శాంత్యుత్సాహములు గలిగించుశక్తి గలదు. శాకేతరములందు తద్వ్యతిరేక గుణములగు భయ బీభత్సాదులు తప్పక యుండి తీరవలెను. సత్పురుషునియందు సుగుణము లున్నవనగా, దుష్పురుషునియందు చెడుగుణము లున్నవని వేరుగా చెప్పవలయునా! శాకాహారములందు శాంత్యుత్సాహములు, దాని నుండి బలము గలదు.

పుష్ప వనములనుండి పండ్లతోటలనుండి ప్రసరించు వాయువు ఆరోగ్యమనియు, చిత్తశాంతి కలిగించునవియు, వైద్యశాస్త్రములును అనుభవజ్ఞులును దెలుపుటయేగాక స్వానుభవము చేతను వాస్తవ మగుచున్నది. దానంజేసి పుష్పములందు

శాక ఫలాదులం దారోగ్య సౌఖ్యములుగలవు. అట్టి వైద్యశాస్త్రములును, అనుభవజ్ఞులును, స్వానుభవపరులును ఒకరు పీల్చి వదలినగాలిని మరొకరు పీల్చరాదనియు ఒకరుతినగా మిగిలిన లేక ఉమిసిన పదార్థమును గ్రహించరాదని వచింపుచున్నారు. ఎందులకని ప్రశ్నింపగా వాయువుగాని పదార్థముగాని ముక్కు నోరులనుండి దేహిలోనికి గ్రహించునపుడు స్వచ్ఛముగా గుణవంతముగా నుండుననియు, తిరిగి లోనుండి వెలుపలకు వచ్చునపుడు రక్తమాంసాదులను తదితర మలిన పదార్థములను తగులుటచే అనారోగ్య మూలమగునని నుడువుచున్నారు. ఏమి? లోనున్న రక్తమాంసాదు లంత హేయములా? రోగకారణములా? వింతగానున్నదే! అటులైనచో ఎట్టివారును వానినిస్పృశింపకుందురుగాక. శాకఫలాదు లారోగ్యప్రదములా! వానిపై నుండి వచ్చుగాలియే అంతయారోగ్య ప్రదమైన వానిని భుజించుచో ఎన్నిరెట్లధిక ఆరోగ్యముఁ గలుఁగునోగదా! ఎల్లర మట్టి శాకాహారమునే భుజింతము. శాకేతరములందు గుణపృథః కరణచే పుష్టి మొదలైనవి యుండవచ్చు. అంతర పుష్టియు శాకఫలాదులందుఁ గలుఁగును. రుగ్మతబాయుటకు విషేతర మూలికలందు విశేషముగా గుణములేనిచో విషమును సేవింపవచ్చు. అనవసరవాంఛచే విషమును సేవింతమా? శాకాదులయందు బహుళారోగ్యగుణములుండ, మలినమని, అయుక్తమని, హేయమని, హింసాయుతమని తెలుపఁబడిన మాంసాహారము నేల భుజింపవలెను? విషమువలెనే ఇట్టి దనవసరవాంఛచే గ్రహింపఁబడుచున్నదా? వాంఛ అవసరయుక్తముగా నుండవలెను. కాని అనవసరమూలముగా నుండరాదు. అన

వసరయోచనచే తనకును, ఇతరులకును హాని. తనకును, తన కుటుంబమునకు గావలసిన ధన, ధాన్యములు లభించుటతో తనయవసరము నెరవేరుచున్నది. అవసరమునకు మించి, అనవసరమున కాశించిన పరపీడనయో, లేక చౌర్యమో గావింపవలసివచ్చును. ఇట్టి బాధాచౌర్యములు అవసరయుక్తముగా జేసిన, కొంతయుక్తమగునేమో, కాని అనవసరముగా జేయుచున్నారు. ప్రాణికోటికి తగినన్ని శాకఫలాదులు సృష్టి నుత్పత్తియగుచుండ దృష్టింబడక, అనవసర లుబ్ధావేశులై పైదోషాచరణములచే మాంసాహార ముపయోగించుచున్నారు. విషసామ్యము చెప్పుటచే, శాకేతరపదార్థములును నిలవయుంచిన విషతుల్యమగునవియు, ఆరోగ్యగ్రంథముల యందును, అనుభవమునందును తెలియుచున్నది.

శాకాహారము భుజించిన, నారోగ్యము చెడుట లేదా? అను ప్రశ్నకు బ్రత్యుత్తరము. పాత్రలో వంటజేయుటకు పాత్ర ప్రమాణమునుబట్టి వండుపదార్థము నుంచవలెను. లేనిచో బచనము గాజాలదు. ప్రమాణమును తగ్గించి పదార్థముంచిన పాకమగును. ప్రమాణమునకు మించినపదార్థముంచిన, బాగుగా పాకము గాకుండుటయేగాక, ఉంచినపదార్థము నష్టమగును. రెండువిధముల నష్టమగుచున్నది. పాకమనుభవ దూరమును, పదార్థ ముపయోగమునకు బనికిరాని దగుచున్నది, పాత్రయం దొక భాగము పదార్థమును, అది పక్వమగుటకు దగుజలమును, మూడవభాగము ఖాళీగానుంచిన పాకముజక్కగా తయారగును. పాణిని జీర్ణకోశమును పాత్రకుపమింప దగినది. భుజించు నాహారమే వంటపదార్థము. తాగునీరే పచనమున

కుంచునది. పాత్రియందలి అనాక్రమణభాగమే జీర్ణకోశమం
దనాక్రమణభాగ మగుచున్నది. పాత్రి క్రింది అగ్నియే
జీర్ణకోశమందలి జఠరాగ్ని పక్వమగుట కెంత అగ్ని కావ
లెనో ఆహారము జీర్ణమగుట కంత క్షుధాగ్ని కావలెను.
వంటకు పూర్వము ధాన్యములను దంచియు, శాకాదులఁ దర
గియు దానినిఁబ్రారంభింతురు. అటులనే భుజించుటకుఁబూర్వము
నాహారముఁబక్వముఁజేసియు, బాగుగానములి భుజింతురు. దంచని
తరుగని, పదార్థము లెటులఁ బాకముగావో, పక్వముగాని
నమలని పదార్థములు జీర్ణముగావు, పాకవిషయములో పదా
ర్థమునుబట్టి, అగ్ని జీర్ణమగుటలో జఠరాగ్నినిబట్టి ఆహారమును
సమకూర్చవలెను. జఠరాగ్నికి మించిన పదార్థము జీర్ణము గానే
రదు. సామాన్యముగా జీర్ణకోశమం దొకభాగము నాహారము
నకును, న: జియొక భాగమును జలమునకును, మూడవభాగము
వాయుసంచారము నకును విడువలెనను ఆరోగ్యవిధులను విని
యున్నాము. అందుచేత నొకభాగ మాహారముతో నింపవలెను.
మూడుభాగములలో నింపిన, పాత్రి నిండుగా పదా
ర్థము వేసి నీరు ఖాళీ లేకుండ జేసిన, పాకమునకెట్టి స్థితి సంభవిం
చునో అట్టిదియే జీర్ణకోశమంతయు నాహారముతో నింపిన
సంభవించును. పాత్రక్రింద నెంత అగ్నియుండినను పాత్ర ప్రమా
ణముచొప్పున పదార్థ ముంతుము, గాని అగ్నిప్రమాణకొత్యా
నుంపము. అదేవిధముగా నెంత జఠరాగ్ని యున్నను, మితా
హారము భుజించిన నెట్టి ప్రమాదమును లేదు. పాత్రక్రింద
అగ్ని లేనిచో పక్వముగాదు. అటులనే జఠరాగ్ని లేనిచో తిను
ఆహారముఁ బక్వముగాదు. దీనింబట్టి మితా౽మితాహారవిష

యము, అందలి ఫలితముఁ దెలిసికొనిన, శాకాహారముచే గలుగు దోషములు తొలఁగును.

సృష్టియం దొకనిని, నీవు శాకఫలాదుల నేల నుత్పత్తి గావించుచుంటివని ప్రశ్నించిన, నేను, నా కుటుంబము, నా పశువులు జీవించుటకని జవాబిచ్చును. కాని, పెంచి పార వేయుటకని వచింపడు. తిరిగి వానినే, నీవు పశువుల నేల పెంచు చుంటివని అడిగిన, భూమిదున్నుటకు, ఎరువుగావించుకొనుటకు పాలు దాగుటకని చెప్పును. గాని నేనును, నాకుటుంబమును తినుటకని ప్రత్యుత్తర మీయడు. వానిని దున్నుటకు, పాలకు, ఎరువు కుపయోగించుటేల ? వానినే తిండిగా గైకొనరాదా? అని యడిగిన, అట్టివి తినుటకుగాదు, తినుపదార్థముల నుత్పత్తి జేయు సాధనములని చెప్పును. మఱియు తిండికై వాని నుపయో గించిన, వాని యుత్పత్తి తగ్గుననియు, తుదకు తిండి లభింప దనియు, అందుచే చావు సంభవించు ననియు చెప్పును. వానినిఁ దిండిగా నుపయోగించిన నాపశువులువానినిఁ దినవు గనుక పశుపోషణార్థమై యుత్పత్తియగు పైరుపచ్చలు వానినాశన ముచే నశించుచున్నవని నుడువును. అదియునుగాక నొకే దిన మున నొకపశువును నశింపఁజేసిన జీవితాంతమువరకు నుపయో గించు ధాన్యశాకాదుల యుత్పత్తి చెడుచున్నదని తెలుపును. దీనింబట్టి జంతుహింస లేకవధయు సర్వప్రాణుల దుదముట్టించు నదిగా గన్పట్టుచున్నది. ఆవానినే నీపశువులు స్వయముగా నశిం చిన నేమి జేయుదువని ప్రశ్నించిన నావలెనే వానికినిరోగము సంభవించుననియు, నేనెటుల రోగినగుచో బనిచేయజాలనో అవియు నటులేననియు, నారోగమునకై యెటులౌషధ సేవజేయు

ముకో వానికటుల గావించి రోగనివారణముఁ గావింతునని చెప్పను. ఇందువలన మానవునివలె పశువులకును రోగబాధలు గలవనియు ఔషధముచే నది వారింపఁ బడుననియు తెలియ నగును. మాంసాహార మట్టి జంతువులనుండియే దొరుకుచున్నది. కాన వానికి బాధలుగలిగించి నశింపఁజేసిననే గాని లభింపదు. వానిని నశింపఁజేయుటచే ఆహారోత్పత్తి నశింపుచున్నది. ఇంత కంటె ప్రాణులకు మించిన బాధ లేదు.

ఆహారమందు హింసాహింసలచే లభించునవిగలవుఁ అందును అహింసాహారమే ధాన్యశాకాదులు. హింస సేయక మాంసము లభింపదు. కావున దానిని విసర్జించి అహింసాహార మునే భుజింపవలెను.

జీవించు ప్రతిజీవియు దేనివలన బ్రతుకునో అదియే ఆహారము. లేక అవయవయుతమగు శరీరమునకు సత్తువనిచ్చునది ఆహారము. కొన్ని యాహారములు లాభకరములును, తిను టకు యోగ్యములునై యున్నవి. మఱికొన్ని లాభరహితము లును, విసర్జింపఁదగినవియు నై యున్నవి. ఆహారరీతుల విచా రించునపుడు ఆహార మెంతభుజింపవలె నను ప్రశ్నగలుగును. ఇట్టి ప్రశ్నయు ముఖ్యమైనదియే. ఆహారస్వభావముల మధ్య భేదము విచారించుట ప్రాణియొక్క చిత్తవృత్తి నెఱుఁగుటయే. ఆహారము కేవలము దేహారోగ్యమునకే గాదు. మానసికారో గ్యమునకును. ఎవఁడైనను దేహేంద్రియములకు స్వాధీనుఁడు గారాదు. ప్రతివాఁడును అవసరమునకంటె నధికముఁ గైకొన రాదు. మంచి ఆహారమును, స్వభావయోగ్య మగునదియు

నత్యవసరము. తిండిచే ఆనందింపవలదని, మిక్కుటముగా భుజింపవలదని చెప్పకతప్పదు. తినుట యనగా తినువానికి సర్వ విధముల లాభదాయకముగా నుండవలెను. కాని కేవల మాకలిఁ జల్లార్చుటకుగాదు. ఆరోగ్యముబాగుండవలెననిన,మంచియాహారముఁ దగినంత భుజింపవలెను. గొప్ప ఔన్నత్యముఁ గోరుచో, వినోదముకై యాహారముభుజింపరాదు. తినుటయను విషయమై యంతిమాభిప్రాయము మనముసుఖముగా జీవించుటకు, మన యెదుటనున్నపనినిఁ జేయగలుఁగుటకు చక్కని సంపూర్ణస్వాభావి కాహారము, శాకాహారము. స్వభావము, స్థితియునొకటే. స్వభావ మొకని యాకృతినిబట్టి వర్తనను దెలుపును. మనుష్యు లెటు లుండిరో తెలుపుటకు ముఖ్యముగా రెండువిషయములుఁగలవు. ఒకటి పూర్వమునుండి పారంపర్యముగా వచ్చునది. రెండవది ప్రపంచములో వారి జీవితములం దలవరచుకొనునది. మొదటిది రెండువిధములు. పూర్వజన్మలనుండి వచ్చునది. పూర్వీకుల నుండి వచ్చునది. మనుష్యుని స్వభావములో, వానియూహను నెరవేర్చుకొనుటకు, తాఁదలచినటులఁ జేయుశక్తి గలిగి యుండుటకు, తాడను ఆహారమునుండి మానవుఁడు స్వభావముల గుర్తింపఁబడుట, లేక చెరుపుకొనుట గలదు. వాడవలంబించిన యభ్యాసములచే నష్టపడును.

అలవాటులలో ఆహారము మొదటిదై ముఖ్యమైనది. అందు కుదాహరణ—ఒకవైద్యునికడ కొక స్త్రీవచ్చి తన కుమారుని దుస్స్వభావమును, అనారోగ్యమును కూర్చి నివారణోపాయములఁ గనుఁగొన నాశించెను. వైద్యుడు శాఖాహారి. ఇట్టిదాని కాహారమే మొదటవిషయమని యోచించి, ఆమె

కౌమరునికేమి యొసంగెనో యడిగెను. అంతట నామె, వాడు రోజుకు మూడు పర్యాయములు మాంసముఁ దినుచుండునని చెప్పెను. శరీరారోగ్యమునకు మాంసమే తగినదని యామెతలచి అటులఁజేసెను. వైద్యుఁడది తెలిసికొని, వానిదుస్థితి కాయాహారమే కారణమనియు, తద్వ్యతిరేకమైన తిండి నొసంగినచో వాని స్థితిలో మంచిమార్పు రాగలదనికూడ చెప్పెను. వైద్యునిసలహా ప్రకార మామె, శాకాహారముఁ గొమరుని దినునటులఁ జేయగా కొన్ని నెలలలో వాని పూర్వపు స్వభావము మారుటయు, నారోగ్యముఁ జక్కఁబడుటయు గలిగెను. అప్పటినుండి వానితో నెట్టికష్టములు లేకుండెను. ఈయుదాహరణ ద్వారా ఆహారమునకు, స్వభావమునకు నెట్టి సంబంధముగలదో వివరింపఁబడినది. మనము తిను ఆహారరీతినుండి, స్వభావము, ఆరోగ్యము అనాదినుండి గుర్తింపఁబడెననుట వాస్తవము. దీనిని సమ్మతించినను, లేకున్నను ఎడతెగని సిద్ధాంతమిదియే.

దీనినే స్థిరపరచుటకు మత్తుపానీయ విషయముల దెలుపుటఁ దగియుండునని దలతును, మత్తుపానీయములఁ ద్రావుటయందు జిక్కుకొనిన వానికి ఆరోగ్యమేగాక స్వభావమును చెడును. త్రాగనపు డొనరింపని కార్యములు తప్పక త్రాగినపు డొనరించును. వాని నడ్డుపఱచిన పొమ్ము. నాకేమి? అని తిరస్కరించును. మద్య మాంసాభ్యాసకుల స్వభావారోగ్యము లిటులుండును. మాంసాహారము చెడ్డపను లొనరింపఁజేయుటయే గాక, ఆత్మ కౌన్నత్యము నడ్డుపరచును. మనుష్యుఁడు మంచి చెడ్డలఁ జేయుటకు శక్తిగలిగి యున్నాడు. అట్టిశక్తి ఇచ్ఛపై నాధారపడి యుండును. ఇచ్ఛ లొంగునదిగా నుండవలయు.

గాని లోంగదీయునదిగా నుండగూడదు. మన స్వభావములు ఇచ్ఛలచే సృష్టింపఁబడుచున్నవి. అట్టిఇచ్ఛలు దివ్యత్వమునకు సంబంధించవలెను. అవి దివ్యస్వభావమును జనింపఁజేయును. దివ్యస్వభావము ప్రపంచమునకు తరతరములనుండి మహాబోధకులచే మనకుఁ దెలుపఁబడినది. మార్గాన్వేషులమైన మనము మనసునందు దలంచుచో అవి మనకు గోచరమగును. న్యాయధర్మములు మనకు పీఠముగా నుండవలెను. మనముఖమందు దయాసత్యములు తాండవించవలెను. ఆత్మోన్నతస్థానమధిష్ఠించుచో నది దేవుఁడొనరించిన పనులఁ గాంచును. ప్రేమయే దైవము. మనము పైకివెళ్లిన కొలఁది మార్గము మరింత తేటతెల్లమగును. ప్రపంచమునందలి మహాబోధకులు దయాన్యాయములనే యందరకు బోధించిరి.

మన చెడ్డయాహారమే మన చెడ్డయూహాలకు కారణమగుచున్నది. మనకంటె తక్కువ తరగతియందు లెక్కింపఁబడు జీవులకు, దయారహితముగా, న్యాయహీనముగా జీవించు తలంపు గల్గుచున్నది. ఈ చెడ్డతలంపునుండియే చెడ్డయాహారము, దానినుండి చెడ్డ స్వభావము, తుదకు దుస్స్థితి సంభవించుచున్నది. మాంసభక్షణము మాంసాహారి స్వభావమును క్రిందికి లాగును. మాంసభక్షణ లేనిచో తిండికై జంతువధయుండదు. అనవసర వధ భయంకరమును, చెడువృత్తియు నగుచున్నది. ఎవఁడైనను వానికొడుకు కసాయివృత్తి నవలంబించుట కొప్పుకొనునా! ఎవఁడట్టివృత్తి నవలంబించును? కటికవారు మానవజాతిలో నెంత అధమస్థానమునునుండిరి. వాస్తవము విచారింపగా

వారికంటె తక్కువవారు నాహారముకై చంపుటకు జంతువులను విక్రయించువారును, దొరుకుటతో మెక్కువారునునై యున్నారు. ఉల్లాసముకై కొందఱు జంతువధ జేతురు. వారే వేటకాండ్రు. సామాన్యముగా వారు మాంసభక్షకులుగా నుందురు. చాలమంది మాంసభక్షకులు వేటకాండ్రగుదురు. వేటయు హింసాచరణలోనిదే, కనుక వినోదముకైనను జంతుహింస జేయుట లేక వధించుట నిషేధింపవలెను.

## పండితుల, వైద్యుల యభిప్రాయములు.

మాంసాహారమే ప్రధానముగా నెంచుకొను యూరపు అమెరికాఖండ ప్రసిద్ధ విద్వాంసుల యభిప్రాయములలో పక్షపాతమునకుఁ దావుండదని వారి యభిప్రాయములనే యిట బొందుబరచు చున్నాడను.

యూరపులోని ప్రసిద్ధ విద్వాంసులును డాక్టరులు నగు యం. డి. జోన్‌వుడ్ గారు:-

"మాంసభక్షణ ముపయోగము గానిది, సృష్టివిరుద్ధమైనది రోగముల దెచ్చునదైయున్నది."

ప్రొఫెసర్, బారన్ క్యూవియర్ లేకాండ్ ఎనాటమి కంప్యారెటివ్ గారు.-

"ప్రాణుల శరీర తారతమ్యము వలన మనుష్యుఁడు ఫలాహారి ప్రాణులనే ప్రతివిషయమునను పోలియున్నాడు. కాని మాంసాహారి ప్రాణుల నే విషయమందును పోలియుండ లేదు. ఓరాంగ్ ఔటంగ్ (ఒకవిధముగుకోతి) యొక్క పండ్లవ్యవస్థయు

సంఖ్యయు మానవుని పండ్లవలె నున్నది. ఈకోతిఫలాహారియు అన్నివిషయములలోను మనుష్యుని బోలియున్నది. మనుష్యుం డీకోతినే బోలిన ప్రాణియని,విజ్ఞానశాస్త్రముచే ఇద్దరిపండ్లను పరీక్షించి సిద్ధాంతము చేయబడినది. ఈకోతియాహారము వనస్పతులే. జ్ఞానమును బొందిన ఈకోతియే మనుష్యుండు. మనుష్యుడు వెనుకకు బోవుటేనా, జ్ఞానఫలము? ఇది సృష్టివిరుద్ధము. ఈరీతిచెప్పుట తర్కశాస్త్ర విరోధమైనదిగాదు. జ్ఞానముగల మానవజాతియొక్క స్వాభావికాహారము ఫలములే. మనుష్యుని యోగ్యాహార మేమని విచారించవలసిన పని మానివునిదే. ఏ యాహార మారోగ్యతను, వీర్యమును, ఉచ్చన్నృత్తులను, నిజమైన సజనత్వము నిచ్చునో, ఏయాహారము గృహపరిబంధశాస్త్ర దృష్టితో నగ్గువయు, మిక్కిలి లాభకారియునగునో, ఏయాహారము దొరుకుటలోనే ప్రాణియొక్క ప్రియమగు ప్రాణమునకు గొంచెమైన నపాయము గానింపబడదో ఆయాహారమే మనుష్యుని కుత్తమమైనదని నాయభిప్రాయము. ప్రతివిచారశీలుండు నీమాట నొప్పుకొనునని నమ్మెద."

మిష్టర్ జూన్‌వుడ్, యమ్, డి, గారు:-

"మనుష్యుని యాహారము మాంసముగాదని బహుశాస్త్ర జ్ఞానులందరి యభిప్రాయము. మాంసభోజనముచే మనుష్యుండు సృష్టిక్రమ మతిక్రమించును. దీనికి ఫల మనేక రోగములే. సృష్టి విరుద్ధమైన, రోగదాయకమైన యాహారము. నిరుపయోగము గాక మరేమి? ఏయాహారమును సంపాదించుటలో నధికవ్యయమును, లాభరహితమగునో, అట్టి యాహారము నిరుపయోగ

మైనది గానియెడల, నింకేమి యాహారము నిరుపయోగము? మాంసాహారము సృష్టివిరుద్ధముగునా కాదా?"

"ప్రొఫెసర్, విలియంలారెన్స్ యఫ్, ఆర్, యస్. ప్రొ. అనాటమి అండ్ సర్జరిటు ది రాయల్ కాలేజ్ ఆఫ్ సర్జన్సు:-

"పండ్ల పైభాగముననుండు కాంతి దప్ప, మిగతవిషయములలో మాంసాహారి ప్రాణుల పండ్లను, మనుష్యుని పండ్లు బొత్తిగా పోలవు. మనుష్యునకిని కోరపండ్లున్నవి నిజమేగాని, అవి మిగలిపండ్లకంటె సమానతను మించియుండవు. మాంసాహారి ప్రాణులకుండు పండ్లుచేయుపనిని, మనుష్యున కుండునవి చేయజాలవు. మాంసాహారి ప్రాణుల "ఎలిమెంటరీ క్యానల్" అనగా నోరు, కడుపు, ప్రేవులు మొదలగునవి చాల చిన్నవి. పండ్లను, దవుడలనుగాని, జీర్ణముచేయు యంత్రములనుగాని పరిశీలించిన, మనుష్యుని శరీరపు లోభాగము పూర్తిగా కోతి శరీరమునే బోలియున్నదని సులభముగా దెలియును. కోతి వనస్పతుల యాహారమునే జేయునది."

ప్రొఫెసర్. సర్ చార్లస్ బెల్.యఫ్,ఆర్, యస్, ఎనాటమి, ఫిజియాల్జీ, అండ్ డిసీజెస్ ఆఫ్ దిటీత్.:-

మానవ శరీరరచన:- మనుష్యుడు నిజముగా ఫలాహార ప్రాణియని స్పష్టముగా చెప్పుచున్నటుల నేను దలచెద. ఇది యతిశయోక్తిగాదు. మనుష్యునిపండ్లు, పాచనాయంత్రము, చర్మము, అవయవముల రచన, ముఖ్యముగా వీనిని గాంచుటచే నీయభిప్రాయ మేర్పడినది.

డాక్టరు ఎఫ్, ఏ. పౌచట్:—మనుష్యుఁడు ఫలాహారియనునది నిజముగా చెప్పఁబడినది. వాని వ్రేవుల వివరమేగాక దంతముల రచనయును పైమాటను స్పష్టముగా రుజువు బరచుచున్నది.

ప్రొఫెసర్—జే హావర్డ్ మూర్ చికాగో యూనివర్సిటీ:— "మనుష్యునిశరీరము విశేషముగా కోతిశరీరమునే బోలియున్నది. ఇంతేగాక వీరిద్దరు నొకటేవర్గపు ప్రాణులు. వీరిద్దరికి శరీరములో 200 ఎముకలు నొకటే విధముగాను, 300స్నాయువు లొక్కరీతిగా నున్నవి. చర్మముపై రోమావళియు నొకటే. నాళ్ళగుండా రక్తమును ప్రవహింపఁజేయు నాలుగు మూలలుగల హృదయమొక్కే తీరున మధ్యలో నున్నది. అదే 32పండ్లు దవడలలో నదేప్రకారమున్నవి. జీర్ణముజేయు యంత్రములు నొక్కేవిధముగా నున్నవి. మానవజాతి నుద్ధరించెడు ప్రజోత్పాద కావయవము లనేక విధముగా నున్నవి"

డా. జోసియా ఓల్డ్ఫీల్డ్ డి. సి. యల్. యం. ఎ. యం. ఆర్. సి. యస్. యల్. ఆర్. సి. పి:—

"మాంసము సృష్టిక్రమమునకు విరుద్ధమైన యాహారము. గనుకనే దీనిని భుజించుటచేత నెన్నియో రోగములు పుట్టును. ఈనాగరిక దినములలో నది తినబడుచున్నది ఇందుచేత నేకొంటుకు, పుండ్లు, క్షయ, జ్వరము, భయంకరములైన వ్రేవుల రోగములు మొదలగునవి విశేషముగా బుట్టుచున్నవి. ప్రపంచములోబుట్టిన నూటిలో 99మంది మాంసాహారముచే గలుగు రోగముల వలననే చత్తురు. ఇదియొక యాశ్చర్యముగాదు."

ప్రొ. పీయర్ గేసెండీ:-"మనుష్యు మాంసాహారముకొరకు బుట్టించ లేదని నా పండ్లరచన, నామనస్సులో ప్రతిదినము, శాస్త్రార్థము (వాదము) జేయుచుండెను. ఏలనన? ఏప్రాణులు మాంసాహారులుగా సృష్టిని జేయబడియుండెరో వారిపండ్లుపొడువుగాను, కూచిగాను, వాడిగాను, సమముగానివిగాను, రెంటి మధ్యలో సందుగలవిగాను జేయబడినవి. పులి, సింహము, తోడేలు, కుక్క, పిల్లి మొదలగు మాంసాహారి ప్రాణులపండ్లు ఇదేరీతిగా నున్నవి. కాని, శాకఫలాదులతో జీవించు ప్రాణుల పండ్లు చిన్నవిగాను, నొకటికొకటి దగ్గరనంటినట్టుగాను, సమమగు వరుసలు గలవిగాను నున్నవి."

డా. జి. యఫ్. రాజర్సు, ఎం. డి. గారు 1905-5-12:- "నేను 13 సంవత్సరములనుండి ఫలాహారముం జేయుచున్నాను. మొదటికంటె నిప్పుడు బుద్ధి యెక్కువైనది. నాయారోగ్యము మిక్కిలి మంచిగా నున్నది. దీనినుండి నాకేమియు నష్టముగా లేదు. నష్టమనుమాట దూరమే, గాని నాకు లాభమే లాభమైనది. సైన్సు అనగా విజ్ఞానశాస్త్ర పండితులు మాంసములో నొకవిధమగు విషమున్నదని దెలుపుచు వచ్చుచున్నారు. ఫలాహారులలో సహనశీలత యవశ్యముగా నుండును. మద్యపానమును, మాంసాహారముం జేయుటచే మంచి యుద్ధవీరుండుగాజాలండను విషయమును నిరూపించుటకు, జపానువారిప్పుడు చేయుచున్న యుద్ధముకంటె మంచి యుదాహరణము వేరే యుండజాలదని నాయభిప్రాయము. దీని విరుద్ధాభిప్రాయము గలవారు భ్రమతో నిండినవారేయని చెప్పవచ్చు."

భగందరమను రోగపు ప్రవీణవైద్యుఁడును, ప్రఖ్యాతుఁడునగు డా. బేల, యం. డి. ఎఫ్. ఆర్. ఎఫ్. పి. ఎస్. గారిచే రచియింపబడిన కొరుకు (ది క్యాన్సర్ సర్జ్ అండు హార్నుట్ డెస్ట్రాయిట్) పుండు పోగొట్టు విధానమను ప్రసిద్ధగ్రంథములో ప్రపంచమున 25,000,000 జనులును, ఇంగ్లండువేల్సులో మాత్రము 30 000 మనుష్యులును, ప్రతియేట నీపెద్ద రోగముచే చచ్చెదరని చెప్పుచు, ఈమాంసభోజనమును విడుచుటకై సిఫారిస్ చేసినాడు. ఈ రోగోత్పన్నపు చిహ్నమగుపడగానే, రోగి మాంస భక్షణమును తక్షణమే వదలిన, జీవించు నను ఆశగలగును. మఱియు వానికి శస్త్రచికిత్స జేయ నావశ్యక ముండదు. ఈరోగపు ముఖ్యమైన చికిత్స శాకాహారమేయని సిద్ధము చేయుటకై ఆహారముచే ఈభగందరరోగ విముక్తులగు ననేకుల రక్తపు ఛాయాపటములను పై పుస్తకములో నతఁడమర్చి యున్నాడు. ఇది భ్రమ జనకమని, ఇంగ్లండులో నొకడాక్టరు ఇతనిని తప్పుపట్టెను. అందుపై డా. బేలాతనిపై మాననష్టపు వ్యాజ్యమును తేగా, అది విచారింపఁబడి, అనేకడాక్టర్ల, రోగుల వాఙ్మూలములు తీసుకోబడి కోర్టు వారిచే డా. బేలునకు 30,000 రూపాయలు అపరాధముక్రింద నిప్పింపఁబడెను. (ఈ పైని వివరించిన, విదేశీయ పండితుల వైద్యుల అభిప్రాయములు మాత్రము దక్షిణ, హైద్రాబాదు జీవరక్షామండలివారి ఆహారమారోగ్య మను చిన్ని పొత్తము లోనివి)

పైమహామహుల అభిప్రాయముల జూడ, శాకాహారము మనుష్యులకు నుత్తమాహారము. శాకాహారముచే సుస్వభావము

జనించును. జగత్తు కర్మక్షేత్రము. శాకేతరాహారము భుజించు వాడు కర్మభ్రష్టుఁడు. మోక్షసాధన దూరుఁడు. త్రికరణముల చే హింసనే తలంచుచుండును. హింసకు ప్రతిఫలము మరొకప్పుడు హింసింపఁబడుటయే. మానవజాతి అంతయు శాకాహారమునే భుజించిన, తమోగుణ నివృత్తియై పరస్పరానురాగము పెంపొందును. వైద్యశిఖామణు లిందరిట్టి నిశ్చితాభిప్రాయములను శాకాహారమునుగూర్చి నుడువ, నదెట్టి ప్రయోజనకారియో విశేషించి చెప్ప నవసరముండదు. శాకాహారమే సర్వమానవకోటికి నాహారమగునని తెలుపుచున్నాడ.

## మత్తు పదార్థములు.

మత్తుపదార్థములు మూడు విధములు. త్రాగునవి. తినునవి. పీల్చునవి. ఇవి సేవించువానిని వశపరచుకొనును. వీని సేవన వలన స్వశక్తి నశించి స్మృతిహీనుఁడగును. మాదకద్రవ్య ప్రభావము లోపించి నంతవరకు వెర్రిచేష్టలఁ జేయును. వదించున వన్నియు వ్యర్థభాషణములు, ఎల్లపుడు కార్యభంగమగుచునుండును, పలువురహాస్యములకును గురియగును. భార్యా పుత్రులకు పిశాచరూపిగా గనుపడును. బయలుదేరుచో ఇతరులు వాని నుండి మిక్కిలి దూరముగా తొలఁగవలసి వచ్చును. ద్రవ్యము పుట్టదు. ఇతరుల సహకారముండదు. ఈమత్తు పదార్థాభ్యాస మెంతహేయమో, అభ్యసించినవారి చేష్టలఁ జూచినవారు గ్రహింపవచ్చు. మానవజన్మమెత్తి ఇట్టి నీచస్థితికి వచ్చుట కడుం గడు విచారకరము. పశుపక్ష్యాదులు, జడపదార్థములు సయిత ముపయోగ పడునుగాని, అతఁ డెందులకు నుపయోగింపఁడు.

సామాన్యముగా సాంగత్యదోషమున వీనిసేవనాభ్యాసములు గలుఁగుచుండును.

సామాన్యముగా త్రాగుబోతుల ముఠా చౌర్యసంఘముగా పరిగణింపఁబడును. చౌర్య మనునది సమాజమునుండి తొలగవలెనన్న, త్రాగుడు మాన్పింపవలెను. త్రాగుబోతునకు అప్పిచ్చువారుండరు. డబ్బులేని కారణముచే దొంగిలింపవలసిన అవసరము కూడ గలుఁగును. మత్తుగ్రోలుటలో మితామిత విచారణ యుండదు. తన్ను దాను మరచునంతవరకు సేవించు మత్తుపదార్థము చేతినుండి విడువనొల్లఁడు. రుచిగల పదార్థమును సయితము ఆరోగ్యభంగమునకు వెఱచి మితముగా సేవింతుము. కేవల మారోగ్యమునకు హాని గలిగించుదాని, నమితముగా గైకొనిన సంభవించు హాని ఎంత అనవచ్చు!

మత్తుపదార్థమును సయితము మితముగా బుచ్చుకొనిన అనారోగ్యముఁగాదని యెంచి, సేవించుటెప్పటికిని తగదు. దాని ప్రత్యంశమందును మత్తు గలిగించు శక్తిగలదు. రోగనివృత్తికై సేవించగూడదా? అని యుపయోగింతురు. అదియు నుకూడదు. ఔషధమందు నాభి ఉంచఁబడును. నాభి చేదు. హానియు. ఔషధమందు నాభి ఉంచుటలేదా? అని భుజించిన ఎట్టిమేలుఁ గలుఁగునో సర్వులకు విశదమేగదా! మత్తు పదార్థములందు రోగనిర్మూలన గుణములు గలవని సేవించుట హానిదాయకము. మత్తు నలవడినవారు రోగకారణములఁ దెలుపుటలేదు. పైగా రోగగ్రస్తులగుచున్నారు. జన్మపర్యంతము విడువలేక, నానాటికి పరిమితి హెచ్చించి, ఎట్టి ఔషధములచే నైనను

నివారణము గాని వ్యాధిని దెచ్చుకొనుచున్నారు. ఇట్టి అభ్యాస మనవసరమని తోచుచున్నది. ఆర్థికబాధచే దరిద్రులు మానినను ధనికులేల మానవలయు నందురేమో? ఎవరికైనను ఫలిత మొకటియే. ధనికునికి సౌఖ్యమును, దరిద్రునికి కష్టమును గలిగింపదు. ధనికుని ధనము స్థిరము గాదు. అలవడినది మాత్రము స్థిరము గును. అస్థిరమైన ధనముచే స్థిరహాని కలిగించు మత్తు నభ్యసించుట మే లెన్నడును గాజాలదు. ధనికుఁడు మత్తు నభ్యసించిన, దారా పుత్రాదులును, ఇతర బంధువులును, అట్టి దానినే కోరుదురు. కుటుంబ మంతయు పారంపర్యముగా ఆ దురభ్యాసమునకే లొంగిపోవును. ధన వ్యయమును, పరస్పరవిద్వేషమును సంభవించును.

## బ్రాంది

మత్తు పానీయములలో బ్రాంది, సారాయము, కల్లు ముఖ్యములు. వీని సామాన్యగుణము మత్తు. బ్రాంది విదేశ మందు తయారగును. వెల అధికము. జమీందారులు, ప్రభుత్వోద్యోగులు, తదితర ధనివంతులకే ఇది లభించును. వారిధన మం దధిక భాగము దీనికై వ్యయపరుపఁబడును. దీని నలవడినచో జమీందారుని జమీ, ఉద్యోగస్థుని యుద్యోగము, ధనికుని ధనము నాశనమొందును. ఈబ్రాంది త్రాగుట కొరకై సంస్థా నాధీశ్వరులు భూమిశిస్తు పెంచుచున్నారు. సర్కారీ నౌకరులు వేతనపు హెచ్చు గోరుచున్నారు. ధనికులు వడ్డీరేటు పెంచు చున్నారు. ఈమూడు తెగలవారు స్వగృహములందు వీనిని సేవించుటయేగాక, క్లబ్బులలో మద్యపానశాలలు నెలకొల్పి,

సాలీనా కొన్నికోట్ల ధనము విదేశములకు పంపుచున్నారు. బ్రాంది కనుపాన పదార్థములన్నియు విదేశమునుండియే రావలెను. వీరలు, అనగా ప్రభువులు, ధనికులు, నుద్యోగులు నుపయోగించు ధనమంతయు వీరి కాయకష్టముచే ఆర్జింపబడి నదిగాదు. కష్టజీవులనుండియే వీరి భోగ్య సముులు నిండవలెను. వీరెట్టి ఉన్నత పదవులొందినను త్రాగుబోతుల లో లెక్కింప బడక తప్పదు. మత్తెక్కి క్లబ్బులందెన్నియో హాస్యపుచేష్ట లొనర్తురు. మఱియును వేశ్యలనాట్యము, సంగమము మొదలగు దుశ్చేష్టల నాశింతురు. ఇట్టి దురభ్యాసములచే వీరికి నాదర్శులు గాక అధోగతిని జెందుదురు.

త్రాగుబోతు జమీందారులు జమీన్ ప్రజలను పీడింతురు. జమీన్ గ్రామములను వేలమందు విక్రయింప వెనుదీయరు. త్రాగుబోతు ఉద్యోగస్థులు లంచములకుఁబాల్పడి న్యాయవిరుద్ధమైన కార్యములచే ఎందరినో హింసింతురు. త్రాగుబోతు ధనవంతులు తీర్చినపత్రములను పునస్సృష్టిజేసి కార్మిక కర్షకుల గృహములపై దారిద్ర్యాస్త్ర ప్రయోగము గావింతురు. త్రాగుడే లేనిచో ఇట్టి పరపీడన గలుగదుగదా! మఱియు దేశము దారిద్ర్యావస్థయం దుండియుండదుగదా! వీరిముందు శాంతవచనములకుఁ దావు లేదు. దీనాతిదీనుల విన్నపములు వీరి సమ్ముఖమున అరణ్యరోదనములు.

## సారాయము
## పూర్ణమత్తుస్థితి

ప్రభుత్వమువారు మనదేశమునందే సారాయమును తయారు గావించుచున్నారు, ఆ సారాయ మనే సమ్మోహనా

త్రము బీదకార్మిక కర్షకులపై ప్రయోగింపఁబడుచున్నది. ప్రజాహితముఁగోరు పాలకులైనచో ఇట్టి మాదకపిశాచమును ప్రజలచెంతకు రానిత్తురా! సారాయమునకై యావదాస్తులఁ గోల్పోయి, వీధులందు వికృతివేషధారులై దిరుగుచుండుట మనముఁ గాంచుటలేదా! మతిభ్రష్టులై వ్యభిచారనేరము లొనర్చి కారాగారవాసులగుటలేదా! దైన్యులగు వీరి దారా పుత్రాదుల దుఃఖ మెంతని వర్ణింపవచ్చు? రూకలా ఖర్చు. ఆరోగ్యమూ క్షీణించు. తామస మభివృద్ధి. తామసగుణం బెన్ని చెడుగులైనను మరవులైనను గలుఁగుచుండును. ఇక్కాలమున నందెందరో మోటారు, రైలుబండ్లు నడపు డ్రైవర్లు బాధ్యతను గుర్తింపక, మత్తుచే ప్రమాదములఁ గావించుచు ఎందరికో కీడును గలిగించుచున్నారు.

## కల్లు

తాటి కల్లును, ఈత కల్లును ఎక్కువగా కూలివాండ్లు నుపయోగించు చుందురు. పై రెండింటికన్న ఇది చవుకపదార్థ మైనను ఎన్నియో కుటుంబములు దారిద్ర్య మొందుచున్నవి. త్రాగుడుచే దరిద్రులైనవారు దానిని విడువఁజాలక, చౌర్యవృత్తి నవలంబించి, దారులుగొట్టుట, హత్యలుఁజేయుట, తుదకు పాలకులు విధించు కఠినశిక్షలకు లోనగుట దటస్థించు చున్నది. కల్లు దుకాణములముందు ఎన్నియో కలహములు, వికృత చేష్టలును మనముఁగాంచు చున్నారము. నోరులేని పశుపక్ష్యాదులు సయితము ఇట్టి పానీయములను స్పృశింపవు. వీనియం దెంతయో విషపదార్థమును, అసహ్యమగు వాసనయుగలదు. వీనిని చీమలు,

దోమలు, ఈగలు ముట్టిన వెంటనే మరణించును. వీనికనుపానము మాంసపు ముక్కలు. ప్రస్తుతము దీనియుత్పత్తి విక్రయాదులు జాతీయ ప్రభుత్వమువారు శాసనరూపేణ అరికట్టుచున్నారు.

## నల్లమందు

నల్లమందు సేవించిన నరములకు సత్తువ కొలది కాలము మాత్రమే యుండును. పిదప నరములందున్న పూర్వపుసత్తువ నశించి నానాటికి అధికబలహీనత గలుగును. ఈ పదముచివర "మందు" అని ఉండుటచే ఔషధ జాతిలోనిదని తలతురు. రుగ్మత గలిగినపు డౌషధ మెవఁడైన సేవించునుగాని, ఇతరసమయములం దుపయోగింపఁడు. నల్లమందును ఏదైన యొక రోగనివృత్తికై ఇతరౌషధముతో జతపరచి సేవింపవచ్చు. కాని కేవలము నల్లమందే నిత్యభక్షణము గావించు చున్నారు. ఇందువలన క్షుధాగ్ని చల్లారును. అరుచి గలుఁగును. నిదురవెచ్చును. దీర్ఘరోగివలె పడకనుండి లేవనీయదు. లోనికేగి దేహమందున్న జీరేణువులను నానాటికి నశింపఁజేసి, ధాతు నరములపైనను, సర్వాధికారిణియై దేహరాజ్యముఁ గొల్ల గొట్టును. సాధారణముగా ప్రాతః సాయంకాలములయం దాహారము దినుటకుఁ బూర్వమే, నల్లమందు మాత్రరూపమున మ్రింగుదురు. అటులఁ జేయనిచో బలాత్కారముగా ఆహారమును లోనికి ద్రోసినను, వాంతులు గలుఁగును. జిహ్వాఎండును. వాగింద్రియము నిశ్చలమగును. చెవులు దిబ్బలు పడును. కన్నులు మూతపడును. నాసికా రంధ్రము బంధింపఁబడును. దేహము కట్టెవలె బిగియును. మఱియును అధికముగా గష్ట

ములఁ బొలగుదురు. వెల అధికము. ప్రతిగ్రామమునందును లభింపదు. ప్రతివాడును విక్రయింప వీలుండదు. రూక దొరకనిచో ప్రాణాపాయముగూడ గలుఁగును. సర్వవేళల నందరిచెంత ధనముండదు. ఇతరవస్తువులవలె కొన్ని వత్సరములవరకో, లేక కొన్ని నెలలవరకో చాలునంత కొన వలనుపడదు. ప్రభుత్వము నిర్ణయించిన తూకముకంటె మిక్కిలి కొనిన జైలు ప్రాప్తి. తాలూకా ముఖ్యస్థలములం దిది విక్రయింపఁబడును. దీనివెల ఎంతగునో అది తెచ్చుటకు ప్రయాణభత్య మంతకంటె రెండు రెట్లగును. ఎంతటి గౌరవనీయుఁ డైనను ప్రమాదవశమున నల్లమందు లేనిచో నీచునైనను యాచింపక తప్పదు. అట్టి అవసరమున ఒక్క నల్లమందు మాత్రమే ప్రాణముగాక, ఇంకేదైన విడువగలడు గదా!

ఇట్టి దలవరచుకొనుటకు పూర్వము శేరుబియ్యము దిను వాడు క్రమేణ పరకశేరులోనికి దిగును. నూటయేబది పౌనుల బరువుగలవాడు దాదాపు నలుబది పౌనులలోనికి వచ్చును. దారాపుత్రాదులపై ప్రేమభావమున్నను, సకాలమున కన్నపానీయము లొసంగనిచో దీర్ఘవైరి యగును. సూర్యోదయాత్పూర్వమే నల్లమందునకు పాకము సిద్ధము జేయవలెను. అటులఁ గావింపనిచో మిగుల దుఃఖించును. సర్వవేళలం దిట్టి నియమములు నెరవేరునా! సూర్యాస్తమయమునకు ముందు వంటకము సిద్ధమొనర్పవలెను. సంధ్యావేళలందలి భోజనము రోగులకేగాని, ఆరోగ్యవంతులకుగాదు నల్లమందు నభ్యసించిన వాడును రోగియే అగుచున్నాడు. ఏమి! వీనిజీవన్నరకము!

చచ్చి నరక మనుభవింతు "రని వినుచున్నాము. కాని వీడన్ననో బ్రతికియే నరక మనుభవించుచున్నాడు" నల్లమందుచెలిమి నరకప్రాప్తి గావించెనుగదా! పురాకృతదుష్కార్యఫలము గాబోలు! దీనిని సేవించుటవలన మేలేమని తినువాని నడిగిన, భుజించిన బ్రతుకు, లేనిచో మృత్యువని చెప్పును. ఇది ఆహారమునుగాదు. ఆహారము లేనిచో కొలఁదిదినములవరకు బ్రతుకవచ్చును. కాని దీని వీడ్కోలుచే మరుసటిరోజే నిర్జీవుఁడగును.

నోరులేని పశుపక్ష్యాదులుసయితము, ఇట్టి మత్తుద్రవ్యములను స్పృశింపవు. వీనియం దెంతయో విషపదార్థము గలదు. చీమలు, దోమలు, ఈగలు తాకిన చచ్చిపోవును. ఇది మందో, బాగుగా విచారించిన మన్నో తెలియుచున్నది. మన్నుదినువాని యాహారకోశము చెడి దుర్బలుఁడగును, దీనియం దట్టి మంచి గుణము లుంటచే నల్లమన్ను, అని చెప్పదగును. దీనికంటె మన్నే శ్రేష్ఠము, ఏలయన? దీనియందున్న విషపదార్థములు మంటియందు లేవు. గాన, దీని దినుటకన్న మన్నే దిను టుచితమని తెలియుచున్నది.

దీని అభ్యాసమున నెందరో దారిద్ర్యపీడితులై, బలహీనులై కుందుచుండుట మనముఁ గండ్లారఁ గాంచుచున్నారము. గాన, దీని చెలిమివీడుట ఓక్కాలి మేలగును. ఆర్థికముగూడ జక్కఁబడును.

## గంజాయి

దీనిబీల్చువారి స్వభావ మెల్లరెరిఁగినదే. నల్లమందుకువలెనే దీనియందును కష్టనష్టములు మెండు. ఆహారముఁజక్కగా భుజిం

పడు. పైత్య ప్రకోపము గూడా గలుగును. వేడి యధికమగును. శక్తి క్షీణించును. ఇందువలన ఎట్టిబాహ్య కర్మాచరణలకు యోగ్యుడు గాకుండును. మనోనిగ్రహము గలిగించు జ్ఞానప్రవృత్తి అని సాధువు లందురు. మనోనిగ్రహమునకు మందే లేదుగదా! కర్మచింతనలచే నిగ్రహశక్తి సిద్ధించును. సామాన్యముగా గంజాయి మొదలగువారు సోమరులై ధర్మశాల లందును, దేవాలయము లందును కాలము గడుపు చుందురు. భిక్షుక వృత్తికి గూడ దాసులగుదురు. ఇది లభింపనిచో నల్లమందభ్యసించిన వానివలెనే దుస్థితికి గురియగుదురు.

పై వ్రాయంబడిన మాదక ద్రవ్యములన్నింటిని ప్రభుత్వమే నిక్రయించు చున్నది. నిక్రయ సమయములందు కొందరు వారిలకు పరస్పర ద్వేషములు గలిగి వీని విలువ పెంచు చున్నారు. ఇట్టివి విక్రయించుటచే ప్రజాసామాన్యమున కెంతయో నష్టము గలుగు చున్నది. వీని ఉత్పత్తి సేవనల రూపుమాప యత్నింతురుగాక. దేశ గౌరవముగాపాడి చిరౌన్నత్య మొందుదురుగాక.

## ముక్కుపొడి

పొగాకు నగ్నిపై గాచి చూర్ణము జేతురు. పిదప మెత్తని మంచి సున్నమువేసి నూరుదురు. కమ్మని నేతిని తగుమాత్రము వేసి నూరడముతో పూర్తి యగును. అందేది తక్కువైన నెక్కువైన బాగుండదు. కొందఱు పరిమళ ద్రవ్యముఁజేర్చి ముక్కున నెక్కింతురు. మఱికొంద ఱట్టే పీల్తురు. "నశ్యదానం మహాదానం" "నశ్యము వేయువాడు నరలోక పూజ్యం"డను కల్ల చాటువుల నాధారముఁ జూపుచు, తమలోపముల గప్పిపుత్తురు.

"బాల్యమునుండియు నేవ్యాధియు లేక యారోగ్యముగా నున్నాను. సహవాస దోషమువలన పొడి బీల్చుట కలవడితిని. దాదాపు 14 యేండ్ల అనుభవమువలన నాకు గలిగిన శారీరిక, మానసిక క్లేశముల నిటబేర్కొనడము మేలగునని నమ్ము చున్నాను."

"ఈ దుర్వ్యాసన పిశాచవాత బడిన కొలందియేండ్లలో నా జీర్ణకోశముం జెడ నారంభించెను. దీని కనువగుం జికిత్సలం గావింపించితిని. లాభముం గలుగదాయెను. దేశీయ, యూనాని, యింగ్లీషు మందులను సేవించినను సుగుణము గలుగదాయెను. రోగోత్పన్నకారణము లరయని వైద్యులచెంత పెక్కుచికిత్సలం జేయుంచినను సుఫలితముం గలుంగలేదు. చివరకు రక్తక్షీణము, నడుమునొప్పి, కండ్లుమంటలు, వీర్యస్ఖలనము, నిద్రాభంగము, నిరుత్సాహము మున్నగు దుర్గుణముల కాలయమై చిత్తస్థైర్యము సన్నగిల్లెను. చిత్తస్థైర్యము, శాంతియు లేని వారెల్లపుడు దుఃఖభాజనులగు చుందురు. ఒకటిరెండు రోజులు నిరాహారులుగ నుండిన నుండవచ్చు. కాని చిటికెడు ముక్కుపొడి లేనిచో మన శ్శాంతి గలుగుట దుర్లభము"

సభా సమావేశములలోను, శుభాఽశుభ కార్యములలోను నశ్యము (గాంచిన మనుజు లొక్కుమ్మడి చేతులంజాపుదురు. ఇంత యేల! ఉన్నతాధికారియును, గర్వియు సైతము పొడికై సంజ్ఞలం జేయు చుందురు.

జనబాహుళ్యమున జీవనటకవకాశము లేకయొగబీలిచి దిగమ్రింగుదు రనుటలో నాశ్చర్యము లేదు. జేబురుమాలలో జీదు

కొని యట్టే జేబులో కొందరు దాతురు. ఇంకొందరో పాదము లకు, వస్త్రములకు, మంచపుకోళ్లలకు, కుర్చీలకు, గోడలుమున్న గువానికి బూయుదురు. పొడిఁ బీల్చువారి ముక్కులనుండియు, పొగపీల్చువారి నోటినుండియు వెడలు దుర్వాసన, దాపునున్న వారినిసయితము తరిమివేయును. అసహ్యించుకొందురుకూడ. పొడిబీల్చువారు శయనించునపు డొక ప్రక్కకొదిగి పరుండ వలెను. అటులొనరింపనిచో కొంతము ముక్కులో నిలువయుం డిన పొడుము లోనికేగి వాంతికలుఁగజేయును. నాసికాద్వారము బంధింపఁబడుటచే వాయుసంచారము మందగించి స్పష్టోచ్చార ణమునకు వీలుండదు.

ఇటులనే చుట్ట, బీడీ, సిగరేటు మున్నగు పలు రూపములలో పొగాకు నుపయోగించు చుందురు. వృద్ధు లలోను, మధ్య వయస్కులలోను చుట్ట వ్యాపించి యున్నది. నవనాగరికుల చేతులలో బీడీ, సిగరెట్లు విరా జిల్లుచున్నవి. అనాగరికులు పుగాకును నవుడనిడుకొని ఉమియు చుందురు. కొందఱు తములపాకులలోఁ జేర్చి నములుదురు. బుద్ధి మంతు లెవ్వరేని నస్యము మున్నగు దుర్వ్యసనములను వదలుఁ డనిన, మానుటకు శక్తిలేక యాటంక పరంపరలచే ఢీకొను చుందురు.

పొగ బీల్చుటవలన మృదువగు పెదవులు మొద్దుబారి పోవుచున్నవి. వణుకు, గుండెదడ, మెదనొప్పి గలుఁగును. శ్వాసకోశము చెడును. అనారోగ్య ఫలములు లెక్కకు మిగిలి

సంభవించుచున్నవి. దురభ్యాసములు వృద్ధులలో లేక, యువకులలోఁ బొడఁజూపినను సర్వదా విసర్జింపఁ దగినవి.

వీనిని వీడుఁడని బోధించు నే నీ యలవాటుకు లోనగుట లజ్జితముగా నుండెను. నాలోపములను సవరించుకొను శక్తి లేనపుడు పరులకేమి మేలుచేయగలను ?" అను ప్రశ్న లుదయించి కొంతకాలమునకు చుట్టఁదాగుట, పొడిపీల్చుట మానివేసితిని. అంతటఆరోగ్యము దినదినాభివృద్ధి గాఁజొచ్చెను. మీారారోగ్యవంతులుగా నుండఁగోరిన నీవ్యసనబంధమునుండి విముక్తులు గండు.



# అహింసాగేయములు

## జంతువులమొఱ

(1) కరుణారసముఁ జూపుఁడయ్యా— జీవ—
కారుణ్యమున కన్న ఘనత లేదయ్యా ॥
పరమకారుణ్య సం—భరితుఁడౌ భగవంతుఁ
డరయ జీవావళుల—కన్నింటికిని దండ్రి ।
వరుసభావింప సో—దరుల మేమును మీారు,
కఱకుఁ గత్తులఁబూని—కంఠముల్ దెగఁగోసి-
తఱిగి తినుటకు మీాకు— తలపెట్లు జనియించె ॥క॥
పోరాట సేయఁగా లేము— మీాకు—
మాఱొడ్డుటకు మాకు మాట లేరావు ॥

పూరిపొలమున మేసి-నీరు వాగున ద్రావి-
అరుబయలునబండి క్షీర మిత్తుము మేము।
కూరిమిఁ జూప రేమయ్యా-
మీరు-క్రూరులై పట్టి మా-గొంతు గోయకుఁడయ్య ॥క॥
నమ్మి శరణముఁ జొచ్చినాము-నోట-
నాలుక లేని యనాథలము మేము॥
తుమ్మిన దగ్గిన యమ్మవార్లకు మ్రొక్కి-
నమ్మిన వాని ప్రాణమ్ము దీయఁగనౌనె।
ఇమ్మహిలోన ఖా-యమ్ముగనుందురె,
అమ్మాయనుచు నార్వ-నసువు దీయఁగనౌనె ॥క॥
త్రికపై కెత్తఁగ జూచి-మాదు-
కన్నులవెంబడిఁ గాఱుఁ బొటబొటనీరు॥
నెత్తురు జొత్తిల్లఁ గుత్తుకఁ దెగఁగోయ-
కత్తితో మీగొంతుఁ గాలుఁడు గోయఁడె-
రిత్త జనములార మొత్తుకొన్నను వినరె ॥క॥
కనికరమిసుమంత లేదా- మీరు-
మనసురాయితోడ నొనరించినాఁడా।
తనువున ముల్లునాటిన యంతమాత్రనె,
వనమాలిహరియంచు వాపోవుదురు మీరు।
పనివడిమాగొంతు - పట్టికోతురుపాటి -
బండ్ల వేంకటసుబ్బయార్యు పల్కు-లవిని ॥క॥

# వేడికోలు.

(2) వద్దువద్దయ్యా, మాంసముఁ దిన! వద్దు వద్దయ్యా !
వద్దు వద్దు ధర్మ, పద్ధతి మీరకు ।
రద్దిజెందకుము కి, రాతుఁడైపోవకు ।
హద్దుమీరగబోకు మాంసా,హారమునుత్యజియింపుమిప్పుడు,
దిద్దుకొనుమీ నీప్రవర్తన, దీనిచేగడుమేలుఁ గల్గును॥వ॥
దేవీపూజలకు, ప్రాణులబలి, యీవలదికను ! దేవికిధరలోని,
జీవకోట్లన్నియు, భావింపసుతులని, నీవెరుంగగరాదె !
జీవులను నిర్దయుఁడవై యూ, దేవిసన్నిధియందు నఱికిన,
దేవినిను రక్షించునెనీ, జీవములు బోరిగొనకయుండునె॥వ॥
క్రూరగాయలను, ఎన్నిఁటినో నీ, కొరకుంచెనజుఁడు ।
నేరకసాత్వికా,హారము వర్జించి,
కోరిజీవులగొందు, గోసి తినెదవేల! వ॥
క్రూరతరమా పెద్దపులివో, ఘోరరాక్షస వీరవరుఁడవో,
నేరవోజడబుద్ధివో సువి, చారమును గావింపవేల॥వ॥
వీరులపాటి, చౌదరినేలు, విశ్వేశుసాక్షి !
నేరమెంచకు మేలుఁ, గోరిచెప్పుచునుంటి,
ఓరీ యీతామసా, హారమువర్జింపు !
భారతీయులు సాత్వికులుసువి, చారులుత్తములనెడు కీర్తిని,
దూరముగ బోజిమ్మకుము మన,
పేరునైనను నిలువఁ బెట్టుము ॥వ॥

(3) దయజూపు మయ్యా, జీవులమీద, దయజూపుమయ్యా ।
దయజూపుభారత, ధర్మము విడబోకు. ।
దయకంటెమించిన, ధర్మమెయ్యది లేదు ।
దయయొకింతయు లేక జీవుల,దారుణంబుగనఱకి మాంసము,
నయముగా భక్షింతునని యెదు,
న్యాయమాసువివేకమూ యది ॥ద॥
వేదశాస్త్రము లెన్ని, విడివడిజదివిన,
సాధువాదములెన్ని, సభలలో జేసిన ।
సోదరులవలె ప్రాణికోటులఁ, జూచిసంరక్షింపకుండిన ।
లేదు మోక్షము, రాదు పుణ్యము,
కాదు మనజన్మము పవిత్రము ॥ద॥
మానవుఁ డెవ్వఁడో, దానవుఁడెవ్వడో,
మానుగ దెలియుము, మదిలోనఁ జర్చించి ।
జ్ఞాన మొక్కింతయును లేకని, దానమావంతయును లేక యే,
పూని జీవులఁజంపి మాంసము,పొట్టనింపెను వాఁడె దైత్యుఁడు॥
అడవిమృగమువోలె, మెడబట్టి ఖండించి,
వడివడిమాంసము- వ్రక్కముక్కలు సేయు ।
కడుపుదఱుగక పోదె హృదయము,
చెడదె దేహముఁ గంపమెత్తదె,
తడవగామీకంటె గ్రూరపు, టడవిమృగమే శ్రేష్ఠమాగద ॥
శాకాహారములను, సర్వ భక్ష్యములను,
నీకుసిద్ధముగాగ నిర్మించె దేవుఁడు ।
ప్రాకటంబుగ వానినన్నిటిఁ, బాఱద్రోసిన రాలు ప్రేవులు
నీకుఁదినగా బుద్ధిపుట్టుట, నింద్య మతినీచాతినీచము ॥ద॥

వీరులపాటిని, వేంకటశౌచాదరి।
కారుణ్యమునఁ నేలు. ఘనుఁడు మిమ్మెల్లర ॥ద॥
సారతర మాంసీయహింసా, చారులనుగా జేయుటకునై,
కోరి భజియించెదను నను. కరుణారసంబున జూచి మిగుల॥ద॥
(4) జనులార రండిమాదు, సందేశము వినిపొండి ॥ జ ॥
అనయము శ్రీహరిభజనము. మనమార జేసుకొండి ॥ జ ॥
గొరియల మేకలఁ దెచ్చి, కోడిపుంజులఁ దెచ్చి,
ముఱియుచును గోసెదరు, ముందుగతి జూచుకొండి ॥జ॥
సాధుజంతువులఁ దెచ్చి, చంపిన ఫలము లేదు,
నీదు తలగోసియీయాయ, నిను దేవి మెచ్చునయా ॥జ॥
కఱకుఁ గత్తులఁబూని, నఱికి జాతర జేసి,
శరణన్న దేవి మిము, విఱచుక తినకమానదు ॥జ॥
పరుల శిరములబల్మి, నఱికిన వారినెట్లు,
పరమేశ్వరి కరుణించును? కఱకఱ గోయకుండ ॥జ॥
పరమపావనమైన, భరతఖండమునందు,
నరజన్మమెత్తినట్టి, నా యన్నలార రండి ॥జ॥
వీరులపాటిని, వేంకటశౌచాదరి,
కూరిమినేలు ప్రభువు, గుణసంకీర్తనము జేయు ॥జ॥
(5) చంపబోకుర సోదరా, సాధుజీవుల సోదరా।
చంపక రక్షింపరా, సత్యమార్గము సోదరా ॥చం॥
భూతదయను బూనరా, పుణ్యావర్తన సల్పరా ।
ఖ్యాతి దీన గల్గురా, కర్మము లెడబాయురా ॥చం॥
హింస సేయబోకురా, మాంసమింక మానురా ।

హింసకంటె క్రౌర్యమీ, యిలను లేదు సోదరా ॥చం॥
నీ శరీరమెట్టులో, యా శరీర మట్టులే ।
కోసి తినఁగ జూడకు, క్రూరుఁడ వై పోవకు ॥చం॥
జీవ రక్షామండలి, సేవమైన గాంచుము ।
దేవికి బలి యీయగా, జీవుల కొనిపోవకు ॥చం॥
వసుధ వీరులపాటి ని, వాసుఁడైన చౌదరి ।
మసలక ప్రార్థించు నీ, మాంసభక్షణ మానుమీ ॥చం॥

(6) భూతదయకు మించిన సత్కర్మము, భూమీస్థలి లేదండీ ।
భూతవధకు మించిన దుష్కర్మము, ముజ్జగముల గనమండీ॥
పరులయొడలి మాంసము భక్షింపగ, దురిత మేలరాదండీ।
పరుల బాధలను మనబాధలతో, పాటు జూచి మానండీ ।
జంతువులన్నియుఁ బరమేశ్వరునకుఁ, జర్చింపగ సుతులండీ ।
జంతుహింసచే పరమేశ్వరుమది, సంతాపము పడునండీ ॥
ఒక్కపూట కూరకు నేయాకో, చిక్కకపోవునటండీ ।
బక్క జీవులనుబట్టి కఱకున, బడగోయుట తగునండీ॥భూ॥
పరప్రాణులను బలియీయగ నా, భగవతి మెచ్చునటండీ ॥
కఱకున తనతల నఱికియిచ్చునెడ, గాంచి భళీ యనునండీ।
అరయ నహింసా ధర్మముకంటెను, అధికమైన దేవండీ।భూ॥
నరజన్మము సార్థకమౌ విధమున, నడచుకొన న్వలెనండీ ॥
వీరులపాటి నివేశుఁడు చౌదరి, వినుతుఁడు రక్షకుఁడండీ ।
మీరందరికి నహింసాధర్మము। గూరుప్రమొక్కెదనండీ॥భూ॥

(7) మాంసముదినుటను, మానుముసఖుఁడా !
మానుము హితుఁడా?

కటకటజీవుల శిరముల దునుమగ,
గని కనికరమునుగలుగదె సఖుఁడా! ॥మాం॥
ప్రాణులెల్లరికి బాధసమముగద, ధీనిధివైయుఁది తెలియఁగలేవా
జ్ఞానముగల్గిన మేనొందియున, జ్ఞానకార్యముల సలెపెదవేలా॥
ఓపినకొలఁదిపరోపకృతులనే, ఓపికతో నొనరించుముసఖుడా!
కుటిలతపీడుము, క్రూరతవదలుము,
పటుబుద్ధిని సత్పథమున నడువుము ॥మాం॥
పీరులపాటిని వేసుఁడుచౌదరిసారతరంబగు సద్బుద్ధినివిని॥మాం॥

---

# అహింస—శాస్త్రములు.

"పశూన్ పాహి॥" యజు_ అ 1_ మం.

**జంతువులను రక్షింపుఁడు.**

"నమాగ్ సమశ్నీయాదితి శ్రుతిః" ॥ యజు.

**మాంసము భక్షించగూడదు.**

"య ఆమం మాంస మద న్తి పౌరుషేయంచయే క్రవిః।
గర్భాన్ ఖాద న్తి కేశవస్తానితో నాశ యేత్సదా"॥ అథర్వ.
కాం_8_అను_2_సూ 6 మం. 27

ఎవడు మాంసమును, గ్రుడ్లను భక్షించునో వానిని రాజు నాశపరచ దగును.

" మాంసభక్షణము, సురాపానము, జూదము, వ్యభిచారము, మానవుని మనస్సామర్థ్యములను పూర్ణముగా నాశముజేయును." అథర్వ. 7-7-70-1

"యేవాజినంపరిపశ్యన్తి పక్వంయ ఇదమాహుః సురభిర్నిర్హరేతి యేచార్వతో మాంసభిక్షామ పాసతఉతో తేషామభిమూర్తి ర్న ఇన్వతు॥" ఋగ్వే. మం_1_అష్టక 2_సూ162_మంత్ర.12

ఏమనుష్యు లన్నమును, జలమును, శుద్ధిపరచి పక్వముజేసి భుజించుటకు శనివెట్టుదురో, ఎవరు మాంసమును వర్జించి శుద్ధాన్నమును భుజింతురో అట్టివారు శ్రేష్ఠులగుదురు.

"విజానీహ్యార్యాన్యేచదస్యవో. బర్హిష్మతేరంధయాశాసదవ్రతాన్ ॥ ఋ. మం 1_సూక్త_1_మం-7.

ధర్మాత్ములును, ఈశ్వర దివ్యమహిమ నెరింగినవారును, భూతదయ పశ్చాత్తాప చిత్తులును, సదాచార సంపన్నులగువా రార్యులనఁబడుదురు.

"తరవశ్చాపి జీవంతి జీవంతి మృగపక్షిణః।
సజీవతి మనోయస్యమననేనోపజీవతి"॥ మహోపనిషత్తు.

చెట్లు, మృగములు, పక్షులు బ్రతికియుండునట్లు బ్రతికియుండువాడు మనుష్యుఁడు గాజాలడు. ఎవనిమనస్సు జ్ఞానవిచారము చేయుచుండునో వాడే మనుష్యుఁడు.

"అన్నమయోహిసౌమ్యమనః" ॥ బృహదారణ్యకోపనిషత్తు.

ఏవస్తువుల భుజింతురో ఆస్వభావమై మనస్సు మారును.

"ఆహారశుద్ధౌ సత్వశుద్ధిః। సత్వశుద్ధౌ ధ్రువాస్మృతిః॥" ఛాందోగ్యోపనిషత్తు.

ఆహారశుద్ధిచే భావశుద్ధియు, దానిచే స్థిరత్వమును గలుగును.

"యజ్ఞానాం జపయజ్ఞోస్మి" ॥ గీత_10_25

జపయజ్ఞమే శ్రేష్ఠము.

"సాయుస్సైఃసుమనోభిశ్చతస్యాపియజనంమతమ్" గీత. అ13.

క్షీరాదులచే గావింపబడు యజ్ఞము సంపన్నమగును.

"ఆత్మౌపమ్యేన సర్వత్ర సమంపశ్యతియోఽర్జున! ।
సుఖంవా యదివా దుఃఖం సయోగీ పరమోమతః ॥ గీత.అ.6

ఎవడన్నిటియందును సుఖ దుఃఖములు తనవిగా జూచుకొనునో, అతడే పరమయోగి.

"కుర్యా దహరహః శ్రాద్ధం అన్నాద్యే నోదకేనవా।
పయో మూలఫలైర్వాపి పితృభ్యః ప్రీతిమావహాణ్"॥
మను. అ. 7

అన్నముతోగాని, జలముతోగాని, పాలతోగాని, కందమూల ఫలాదులతోగాని, శ్రాద్ధము చేయువలయును. అందుచే పితరులు ప్రీతి జెందుదురు.

"నాకృత్వా ప్రాణినాం హింసాం మాంసముత్పద్యతే క్వచిత్।
నచ ప్రాణివధః స్వర్గ్యస్తస్మాన్మాంసం వివర్జయేత్"॥
మను. అ. 5 శ్లో॥ 48.

ప్రాణుల వధింపక మాంసము లభింపదు. వధలవలన స్వర్గసుఖము లభింపదు. కాన మాంసభక్షణము వీడవలెను.

"దృష్టిపూతం న్యసేత్పాదం వస్త్రపూతంజలం పిబేత్।
సత్యపూతాం వదేద్వాచం మనఃపూతం సమాచరేత్॥"
మను. అ. 4 శ్లో॥ 46.

నడచునపుడు జాగ్రతయు, నీరుత్రాగునపుడు శోధనయు, వచించునపుడు సత్యము నవసరము. పరిశుద్ధమైన మనస్సు కలిగియుండవలెను.

"సముత్పత్తించ మాంసస్య వధే బంధౌచ దేహినాం ॥
ప్రసమీక్ష్య నివర్తేత సర్వమాంసస్యభక్షణాత్॥"
మను అ. 5 శ్లో. 49.

మాంసోత్పత్తి, ప్రాణివధ, బంధనముజూచి, అన్నివిధములగు మాంసభక్షణములనుండి మనుష్యుడు నివృత్తుడు గావలెను.

"అనుమంతా విశసితా నిహంతా క్రయవిక్రయీ।
సంస్కర్తాచోపహర్తాచ ఖాదకశ్చేతి ఘాతకాః॥" మను.5_51

చంపు సాజ్ఞనిచ్చువాడు, శస్త్రముచే అవయవముల వేరుపరచువాడు' చంపువాడు, కొనువాడు, అమ్మువాడు, పంచువాడు, వండువాడు, తిను వాడు, వీరలందరు ఘాతకులు."

"విధియజ్ఞా జ్జపయజ్ఞోవిశిష్టో దశభిర్గుణైః॥" మను. 2_95

విధి యజ్ఞముకంటె జపయజ్ఞమే దశగుణాధిక్యము గలది.

కలియుగమునం దశ్వమేధము, గోమేధము, సన్యాసము, మాంసముచే శ్రాద్ధముచేయుట గూడదు. "వృద్ధ పరాశరస్మృతి."

"మద్యపాన" రతోదైత్యః - మాంసాశీచ నిశాచరః
నారాయణస్మృతి.

సురాపానరతులు మనుష్యరూపులగు అసురులు జంతువుల జంపి తినువారు మానవ రాక్షసులు.

"గ్రామారణ్యా పశూనాం హింసనం సంకరీ కరణమితి॥"
విష్ణుస్మృతి.

గ్రామములలో వసించు జంతువులనుగాని, అడవులలో వసించు జంతు వులనుగాని జంపుట సంకరీకరణ పాపము.

"నహింస్యా త్సర్వ భూతాని"॥ శతపథ బ్రాహ్మణము.

ఏ జీవినైనను హింసింపగూడదు.

"దుష్టం హింసాయామ్ తస్య సమభివాహరతోదోషః॥"
వైశేషిక. అ6 అహ్ని। సూత్రి. 78

మద్య మాంససేవనాది దురాచారరతుడే దుష్టుడు. వాని సాంగత్యము కూడ దోషము.

"అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః"
పాతంజల యోగశాస్త్రము.

హింస చేయనివానికి విరోధిలేడు.

"అపివంశ క్రమాయాతాం యస్తు హింసాం పరిత్యజేత్।
స శ్రేష్ఠః సులసఇవ" కాల సౌకరి కాత్మజః యోగశాస్త్రము.

కుల క్రమముగా ప్రాప్తించిన హింసనైన వదలవలెను. హింసాత్యాగము వలన కసాయి కాలసౌకరిక పుత్త్రుడగు సులసుడు శ్రేష్ఠుడయ్యెను. ఇతనికుటుంబ మెంతయు ఇతనిని హింసామార్గమున ప్రవేశింప ప్రేరేపించెను కాని అతడు ఆరీతి చేయలేదు. ఈగాథ యోగశాస్త్రమం దెక్కడు వ్రాయబడెను.

" నగోప్రదానం నమహీప్రదానం
నాన్నప్రదానంహి తథా ప్రధానమ్।
యథావదంతీహ బుధాః ప్రధానం
సర్వప్రదానేష్వభయప్రదానమ్॥ " పంచతంత్రము. శ్లో. 298.

గో, భూ, అన్నదానములకంటె అభయదాన ముత్తమము.

" ద్యూతంచ మాంసంచ సురాచ వేశ్యా
పాపర్ధిచౌర్యం పరదారసేవా।
ఏతాని సప్త వ్యసనానిలోకే
ఘోరాతిఘోరం నరకంనయంతి॥ సర్వదర్శనకారుల సూచన."

జూదము, మాంసాహారము, సురాపానము, వేశ్యాగమనము, షికారు, చోరత్వము, పరదారాగమనము, ఇవి సప్తవ్యసనములు. ఇవి మానవులను ఘోర నరకముల కీడ్చును.

"అష్టాదశ పురాణేషు వ్యాసస్య వచనద్వయం।
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్॥"

పదునెనిమిది పురాణముల సారాంశ మేమన? పరోపకారమే పుణ్యము, పరాపకారమే పాపము.

"స్తుతా సంపూజితా పుష్పై ర్ధూపగన్ధాదిభి స్తథా।
దదాతి వి త్తం పుత్రాంశ్చమతిం ధర్మే గతిం శుభామ్॥"

దుర్గాస ప్తశతి. అధ్యా 11

గంధ పుష్ప ఫలములచే మాంస రహితమైన నైవేద్యము గైకొని, పుత్త్రిలను, ధర్మమును, ధనమును, సుఖముల నిచ్చుచున్నది. దేవికి సాత్విక విధిచేతనే పూజ చేయవలెను.

"యస్తు మాత్స్యాని మాంసాని భక్షయిత్వా ప్రపద్యతే।
అష్టాదశాఽపరాధంచ కల్పయామి వసుంధరే॥"

వరాహ. అ 117 శ్లో 21

మాంసము భుజించి నన్నెవడైతే పూజించునో, వాడు నా పదునెనిమిదవ, అపరాధి.

"పూజోత్తరం మాషా భక్తబలిం కుష్మాండాది బలింవా
నివేదయేత్॥" స్కంధపు.

కూష్మాండ (గుమ్మడికాయ) మాషాదు (ధాన్యములు) లచే బలి విధానము నెరవేర్పవచ్చు.

"యథాత్మనః ప్రియాః ప్రాణాః తథా తస్యాపి దేహినః।
ఇతిమత్వా న కర్తవ్యో, ఘోరప్రాణివధో బుధః॥"

విష్ణు పురాణము

తమ ప్రాణమెటుల ప్రియమో అటులే అన్నింటికి కాన ఏప్రాణిని వధింపరాదు.

"శ్లో॥ అహింసా ప్రథమం పుష్పం। పుష్పమింద్రియ నిగ్రహం
సర్వభూత దయాపుష్పం। క్షమాపుష్పం విశేషతః॥
శాంతి పుష్పం తపః పుష్పం। ధ్యానపుష్పం తథైవచ
సత్యమష్ట విధం పుష్పం। దేవీ ప్రీతికరంభవేత్॥" వామనపు.

"తే॥ ప్రాణివధయె కృత్యంబుగ బ్రత్యహంబు.
సంచరించుచు చేసెడి జనుడు వైత
రణివసించును ఘోర నరకమగునది
దానివర్ణింప నేరికి దరముగాదు."

బ్రహ్మాండపు. ఉపసంహారపాదముఆశ్వా। నరకప్రశంస

ఆ॥ ద్రవ్యలోభమునను దంభార్థమై పశు
వులనుజంపి జన్నములను సేయు
వానిబట్టి యముని వారలు గోయుచు
నుందు రెపుడు మిగులు సందడిలుచు॥"

భాగ. స్కం. 5. ఆశ్వా. 2.

"మ॥ తన దేహంబునకై యనేకమృగ, సంతానంబుఁ జంపించు దుర్జనుభంగిన్॥ భాగవతము స్కం 1.

వ॥ విధిదేశకాలప్రాప్త కందమూల ఫలాదికంబై హరి నైవేద్యంబున విధి చోదిత ప్రకారంబుగా శ్రద్ధతోడఁ బాత్రంబునందు బెట్టిన యన్నంబు కామదంబయి యక్షయ ఫలకారియగు. ధర్మతత్వ వేదియైనవాడు శ్రాద్ధంబులందుమాంసప్రదానంబు సేయక,భక్షింపక చరింపవలయు. కందమూలాదిదానంబున నయ్యెడి ఫలంబు పశుహింసనంబున సంభవింపదు. ప్రాణి హింసచేయక వర్తించుటకంటె మిక్కిలి ధర్మంబులేదు. యజ్ఞవిదులైన ప్రోడలు నిష్కాములై బాహ్య కర్మంబులు విడచి, ఆత్మజ్ఞాన దీపంబులందుఁ గర్మ మయంబులైన యజ్ఞంబుల నాచరింతురు.

భాగవతము. స్కం. 7 వచ. 455

"క॥ శునకములఁ బెంచి యెవ్వం
డనయంబును వేటసలిపి, యాత్మార్థముగా।

వనమృగములఁ జంపును నా
మనుజాధము నస్త్రములను మర్దింతురొగిన్''
భాగ. స్కం. 5. ఆ2. నరకలోక వర్ణనము.

"కం॥ పశువుల బొరిగొని మఖములు
విశదములుగ జేయు బుధుని వీక్షించి తమున్
విశసనము సేయునోయని
క్రశిమున్ బెగడొందు భూతగణము నరేంద్రా !''

శ్రీమదాంధ్ర భాగవతము. స్కం. 7. ప 456

"సర్వే వేదాశ్చ యజ్ఞాశ్చ తపోదానాని చానఘ! ।
జీవాఽభయప్రదానస్య నకుర్వీరన్ కలామపి''॥
భాగ.స్కం.3. అధ్యా. 7.

జీవులకు, అభయదాన మొసగు కళ నైనను, వేదములు, యజ్ఞములు తపస్సులు, దానములును చేయజాలవు.

"తే॥ గీ॥ అన్ని తపములకును బెద్ద, యన్ని దాన
ములకు నెక్కువ, యన్ని నోములకు హెచ్చు,
అన్ని తీర్థములకును గన్నాకు వినుము
భూతదయకంటె ధర్మంబు భూమి లేదు॥''
దే. వి. భాగ. స్కం. 4.

"సర్వే వేదా నతత్ కుర్యుః సర్వేయజ్ఞాశ్చభారత ।
సర్వేతీర్థాభిషేకాశ్చ యత్ కుర్యాత్ ప్రాణినాందయా॥''
భార. శాం. ప్రథమ పాదము.

ఓ అర్జునా ! చతుర్వేదములును, సమస్తయజ్ఞములును, సర్వతీర్థస్నానములును, వందనములును, జీవదయతో సమానమైన ఫలితమివ్వజాలవు.

"గీ॥ మనసునను వాక్కునను గాయమున నహింస
నడుచుమాంసంబుఁ దినుటతో నాలుగయ్యె
దెఱగు లది నూవె హింస వర్తింపఁజేయుఁ।
గానఁగడుగీడు మాంసభక్షణముఁదలఁప॥" భారతము.

"నైషధర్మః సతాం దేహీ యత్రవధ్యేత వై పశుః॥
ఇదం కృతయుగం శ్రేష్ఠం కథం వధ్యేత వై పశుః॥" భార_శాం.

(యజ్ఞమున) పశువును వధించుట శ్రేష్ఠముగాదు. కృతయుగమున పశువధ యెక్కడిది? కాన అకాలమే మంచిది.

"గీ॥ వాజిమేధంబుకంటెను బూజనీయ
కర్మమందురు మాంసభక్షణము విడుపు;
వినుముచంపుటయును, చంపఁబనుచుటయును,
కల్మషంబులకెల్ల నగ్గలము లధిప!॥" భార. అనుశాసనిక.

"అద్రోహః సర్వభూతేషు, కర్మణా మనసా గిరా।
అనుగ్రహశ్చ దానంచ, సతాంధర్మః" సనాతనః॥
భార. శాం. అధ్యా. 132

మనసా, వాచా, కర్మణా, ఏజీవికిగూడ హానిగలిగింపక, పరోపకారము జేయుటయే సనాతనధర్మము.

"క॥ లోకము నిర్మర్యాదా
వ్యాకులమై చెడదె; సజ్జనావళి మధుపా
నాకాంక్ష దొరగకున్న గు
ణాకల్పా! ఏమిసేయ దక్కిడు నరుఁడు॥

భార. అనుశాసనిక.

తే॥ వెలది, జూదంబు, పానంబు వేట, పలుకు
పల్లదంబును, దండంబుఁ బరుసదనము,
సొమ్ముకు నిష్ప్రయోజనముగ వమ్ము సేత,
యనెడు సప్తవ్యసనముల జనను తెగుల॥

భార. ఉద్యోగ.

"దాణాణ సెట్ఠం ఉభయప్పహాణం॥" మహావీరుడు.

దానములన్నింట అభయ దానము శ్రేష్ఠము.

ఆ॥ వె. పేరుసోమయాజి పెను సింహబలుడాయె
మేకపోతుబట్టి మెడలు విఱుచు।
క్రతువు చెంత దీర్పగల్గునా మోక్షంబు
విశ్వదాభిరామ వినర వేమ॥

ఆ॥ వె॥ తనవలెను నవియును ధరబుట్టినవి కావొ?
పరగ తన్కు ప్రవంటి, బ్రతుకుగాదొ?
జ్ఞాని వానిఁజంప, గారణమేమిరా?
విశ్వదాభిరామ వినర వేమ!॥

గీ॥ జీవిజీవిఁ జంపి జీవికి వేయగా
జీవివలన నేమి జిక్కునీకు।
జీవహింసకులకుఁ జిక్కునా మోక్షంబు।
విశ్వదాభిరామ వినర వేమ॥

"పులై యుం, కొలైయుం, కళవుం తవిర్" (అవ్వ)

మాంస భక్షణమును, జీవహింసను, దొంగతనమును విడిచి పెట్టుము.

"నుత్తి నవ నైఙ్ఞా (న్యా) ని యెనుచ్చి కూరొణ్ణను"

(తిరువళ్ళువర్)

జీవహింసచే కలుగు మాంసమును భుజించువానిని జ్ఞానియని వచింప రాదు.

"న సిర్ఘు ద్ఖురో నేహానవరజ్యు॥
యనీన ఆ స్తదీనే ఝుర దు స్తనేకు" షాహనామా.

పశువధ, మాంస భక్షణము, షికారు చేయగూడదు.

పశువులకు మేతవేసి వాటిని రక్షించ వలసినది. సన్మార్గుల కిదియేసూచన.
ఖురాన్ షరీఫ్. కాం. 16. సురా 20 వ 50

"ఎందుకీ యసంఖ్యాత యాగములు నాకు? అను! (చేసెదరు) పశువులయు, గొఱ్ఱెలయు, మేకలయు, రక్తముచే నాకు సంతోషముఁ గలుగదు." అని దేవుఁడు చెప్పెను. బైబిల్. ఇసయ, 1-11-14

"కీడు చేయుట మానుఁడు. మేలుచేయ నేర్చుకొనుఁడు. న్యాయము జాగ్రతగా విచారించుఁడు. హింసించువానికి న్యాయముఁజేయ నేర్పుఁడు."
( బైబిల్. యెషయా. అ1. వ17. )

మాంసభక్షణముగాని, ద్రాక్షాసవ పానముగాని నీసహోదరుని కడ్డము కలుగజేయునది మరేదియుంగాని మానివేయుట మంచిది. (రోమా అ. 15. వ21)

దహన బలులకంటె దేవునిగూర్చిన జ్ఞానము నాకిష్టమైనది.
హోషేయ అ. 6వ. 6.

"కనికరమునే కోరుచున్నాను. కాని బలిని నేను కోరను" అనువాక్య భావము మీరు దెలిసినచో నిర్దోషులను దోషులని తీర్పుఁదీర్చకపోదురు.
(మత్తయి. అ. 12వ7.)

ఇట్టి యుద్గ్రంథములన్నియు మహనీయుల స్వానుభవ భరితములు గాని కేవలము పుక్కిటి పురాణములుగావు. ఆయా గచయితలెల్లరు తమతమ యను భవములను జగద్విదితము లగునట్లు గ్రంథముల రూపేణ వెల్లడించియున్నారు.

---

# మూఢాచారములు.

ఆచరించునది, ఆచారమనఁబడును. ఆచరించునది కర్త కనుకూలించవలెను. ప్రతివాడును అనుకూలమగుపనిని, లాభకరముగు దానినే జేయును. చేయుపనియందు ప్రతిఫల ముండవలెను. ఎవనికేది యిష్టమో అద్దానిని వాడు తప్పక చేయ నెంచును. వాడుచేయునది లాభకరమైనదైనను సంఘవిరుద్ధముగు దానిని మానవలెను. ఎందుకన? సంఘమునకును వానికిని సంబంధముఁ గలదు. సంఘవ్యతిరేకాచారము లాచరించిన, సౌఖ్యముఁ జేకూరదు. ఆచారము సంఘమే శాసించును. ఎట్టి ఆచారమువలన ప్రయోజనముండునో దానినే నిలుపును. పలువురి శ్రేయస్సు గోరునది సంఘము. సంఘము వ్యక్తివాచకము గాదు. ఒకజాతి చెట్టునందు ఫలించిన ఫలమా జాతిగుణము లే కలిగియుండవలెను. వేరొక విధముండుట యసంభవమును, విసర్జనీయముగా నుండును.

సంఘశక్తి ధూమశకటవాహియైన యంత్రమును బోలునది. శకటమందున్న యొక్కొక్క పెట్టెను సమకూర్చుకొని తన్నో నడపించును. అందలి యొకపెట్టె స్వయముగా గాని, తదితర కృత్యముచే గాని తొలఁగిన, విదలఁజాలక తొలఁగిన చోటనే యుండును. మిగిలినపెట్టె లేరీతి యంత్రము ననుసరించి యుండునో, వ్యక్తులును సంఘనిర్మాణ పద్ధతుల ననుసరింపక తప్పదు ఏవ్యక్తియైన తొలఁగిన నడువఁజాలదు. యంత్రము నడుపుటకుఁ గొన్ని శాస్త్రీయ నిర్మాణములు సమకూర్చఁబడినవి. సంఘము నడచుటకును శాస్త్రీయాచారములు గావలె.

యంత్రమందలి పరికరములు వీలైనంతవరకు తగ్గింపఁగలము గాని, అనగా పెద్దవి లేక చిన్నవిఁ జేయఁగలము. అటులఁగాక సంపూర్ణముగా త్రోసిపుచ్చిన నిష్ఫలమైన దగును. సంఘము నందును కొన్ని ఆచారములు పెంచుట, తగ్గించుట వలనుపడును. కాని ముఖ్యముగా నెట్టి యాచారములచే సంఘము నడచునో అట్టివానిని విడనాడిన, యంత్రము రీతిగనే ఫలముండును. శాస్త్ర వ్యతిరేకములైన నిర్మాణములచే యంత్రరూపము సిద్ధించదు. శాస్త్రవిరుద్ధములైన పద్ధతులచే సంఘమును నిలువఁజాలదు. యంత్రమందలి పనిముట్లు యంత్రమునకు సాయము జేయు నవిగా నుండవలయుగాని, వేరు విధముగా నుండరాదు. సంఘమందలి యాచారములు సంఘప్రయోజనములుగా నుండ వలయు. శకటమందలి ఏ పేటియందును విరుద్ధములును, హానికరములు నగు పదార్థములున్న, దానికిని శకటమునకును హాని సంభవించును. గాన అట్టి వానిని తొలఁగించుటయో, లేక ఆ పేటిని విసర్జించుటయో శకటమున కవసరము. సంఘమందే వ్యక్తియైనను విరుద్ధక్రియలును, దుశ్చింతలును గలవాడైన, అవి వానినుండి తొలఁగించుటయో, లేక వానిని సంఘ విముక్తునిఁ గావించుటయో తగును.

చల్లని ప్రదేశమందున్నవారు, ఉష్ణకరములగు దుస్తుల ధరింతురు. అటుల ధరింపమిచే శైత్యబాధ గలుఁగును. ఇది ఆరోగ్యసంబంధమగు నాచారము. ధనవంతులు శరీరసౌఖ్యమున కాసించి బీదలగు వారిచే సేవలఁ జేయించుకొనుచున్నారు. ఇది ఆర్థిక సంబంధమగు నాచారము. ధనమును వ్యయపరచుట, ధనము నార్జించుటయు నై యున్నది. పాలకులు శాసిం

చుట, ప్రజలు పాలింపఁబడుట రాజకీయాచారము. విద్వాంసులు జ్ఞానోపదేశముఁ జేయుట, మూఢులు వినుట సాహిత్యాచారము. శైవులు శివుని పూజించుట, వైష్ణవులు విష్ణు నారాధించుట మతాచారము. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులనుట వర్ణాచారము. కొందఱు కొన్ని అనుకూలపద్ధతుల నేర్పఱచుకొనిరి. ఇతరుల కార్యములై మెలఁగుట సాంఘికాచారము. ఇటులే అనేకాచారములు గలవు. పై యాచారములకంటె సాంఘికాచారములు భిన్నమైనవి. దేశకాలపరిస్థితుల ననుసరించియు, విజ్ఞానాభివృద్ధి ననుసరించియు మారుచున్నవి. గనుక నాచారమును సంఘమే సృష్టించుచున్నది. పలువుర యభిప్రాయమే యాచారము. పలువుర యభిప్రాయమును కొన్ని తగిన మార్పులచే నేకోన్ముఖముఁ జేయఁగలిగిన యొకవ్యక్తి ఆచారకర్తయగును. అట్టివాని యభిప్రాయమే పలువుర, అనగా సంఘముయొక్క యభిప్రాయము. సంఘమున కాచారమే ప్రాణము. చెట్టుయొక్క ప్రధానమగు వేరు స్థిరముగా నున్నంత వరకును, ఆహారము గ్రహించునంత వరకును, వృక్షము పుష్పఫలభరితమై యుండగలదు. లేనిచో నశించు. సంఘమందలి ప్రధానాచారము, అనగా హిందువుఁడు హిందువుఁడుగా నుండుట, క్రైస్తవుఁడు క్రైస్తవుఁడుగా నుండుట, తదితరమతస్థులు తగినటులుండుట మొదలగునవి మతాచారములు. వృక్షమందలి చిన్న చిన్న వేరులు సర్వత్ర తిరిగి ఆహారమెటుల సంపాదించి చెట్టునకు బలముఁ జేకూర్చునో, అటులే సంఘమందలి యుపాచారములు వేరువేరుగా నున్న విషయములను సంఘోపయోగముఁ జేయునొప్పును. చెట్టు

బలమున కెట్టు లసంఖ్యముగా వేరులు బయలుదేగునో, అటులే సంఘోపయోగమున కనంతాచారములు గలుగవచ్చు. అంగ్లేయునితో భారతీయులు వీలైనంతవరకు నాచారముచే నేకీభవింపవచ్చు. కాని, వాడు వీడు కాడు. చెట్టుయొక్క ముఖ్యమైన వేరు పుష్టికరముగా నున్నంతవరకును చీలికలగు వేరులు చరింపఁ గలవు. సంఘమందలి ప్రధానాచారము మారనంతవర కుపాచారములు నెన్నియైనను కలుగుచు పోవుచుండును. చెట్టునకు శక్తి కొలఁది నాహారమును సంపాదించగల చిన్నివేరు మాత్రమే పెద్దవేరునుండి బయలుదేరును. సమర్థత లేనిది బయలు వెడలదు. సంఘమందెట్టి యుపాచారమైనను సంఘాభివృద్ధికై యుద్భవించి, సమర్థత లేనిచో నశించును. ఆచార మొకఁడు సృష్టింపఁ జాలఁడనియు, ప్రయోజనమెన్నదిది లేనట్టి దానే ముఖ్యాచారమునుండి వెలువడు ననికూడ దెలియనగును. శీతలదేశవాసులు నాపాదమస్తకము దుస్తులచే గప్పుదురు. ఆరోగ్యము నిమిత్తమాహారము నుష్ణ ముష్ణముఁ గలిగించునదియే తిందురు. ఉష్ణప్రదేశమందలి వారలిటులఁ జేసిన స్వాస్థ్యముఁ జెడును. కనుక నాచారము దేశకాల పరిస్థితుల ననుసరించి స్థిరపడును.

ఒకప్పుడు సంఘమున దుర్గుణములు మెండైన, దురాచారములు ప్రబలును. అటులే యొకప్పుడు సదాచారములు వర్ధిల్లును. దుర్గుణము లనగా, స్వలాభార్థ మితరులపై క్రోధము వహించుట, పరౌన్నత్యము సహింపకుండుట, గర్వించుట, కామోపేతముచే చెడ్డక్రియ లాచరించుట మొదలగునవి. క్రోధోన్మత్తుఁడైన వానికి సంఘము విరోధియగును. ఈర్ష్యచే

మెలంగువాని కితరులు శత్రువులగుదురు. గర్వపూరితుఁడైన వానికి కంటకములే సంభవించును. కాముకుఁడు చేయని దురాచారములుండవు. సంఘమున కోపిష్ఠు నభిప్రాయములు వ్యక్తి శాసనములగును. కోపమునందు యుక్తాయుక్త విచారముండదు. కోపితుని లాభము నిష్కృపికి నష్టము. సంఘమునకు నిష్కృపులు మెండుగా నుండుటే యిష్టము. అంతట సంఘ శ్రేయస్సు గలుఁగును. ఈర్ష్యచే మెలంగువాఁడితరుల మంచిని నశింపఁ జేయఁగోరును. గర్వితుఁడు పరుల వంచనపరచును. కామోద్రేకుఁడు పరవనితావ్రత భంగమొనర్చును. ఇది అజ్ఞాన భూతములగు పశువులాచరించునది. కాన పెక్కు దురాచారములలో వ్యభిచారము మొదటిది. సంఘము వ్యభిచారకరములగు సర్వోద్దేశములను నశింపఁ జేయవలెను. "కామాతురాణాం నభయం నలజ్జా, అర్థాతురాణాం నగురు ర్నబంధుః" అను నీతివాక్యముచే భయము, లజ్జలేనివాఁడు తానుజేయు కార్యములయందు యుక్తాయుక్తములు విచారింపఁడు. లజ్జాహీనుఁడు వస్త్రహీనముగా విహరించినను లజ్జయని వానికిఁ దోపదు. భయములేనివాఁడెట్టి గౌరవపురుషున్నైన నగౌరవింప వెనుకాడఁడు. లజ్జయనునది మానవునందు గల దురభిప్రాయమును మాటుపరచు తెర. దుస్సంకల్పముఁ దెరచాటున నున్నను దాని ఛాయ బయటికిఁ గనుపించుచునే యుండును. అర్థాతురులైన వారలు బంధువులని, గురువులని తలపరు. తమ యర్థమును సమకూర్చుటయే ప్రధానముగా భావింతురు. ఎవరెటుల నష్టపడినను, ఎట్టిబాధల పాలైనను పరికింపరు. పరపీడనయే వారి కర్తవ్యము.

నాగరికత వృద్ధిఁజెందిన కొలఁది పూర్వమున్న యాచారములు మార్పుఁ జెందుచున్నవి. పూర్వమున యంత్రములు లేవు. వస్త్రోత్పత్తిఁ జేయుటకుఁ దగు సాధనములు లేవు. వస్త్రములకు మారు ఆకులు, చర్మము లుపయోగింపఁ బడెడివి. రాను రాను, అది మూఢాచారమని, అనాగరికతయని తలపఁ బడెను. ప్రస్తుతమందు వస్త్రముల నుత్పత్తిఁ జేయుటకుఁ దగు యంత్రములు గలవు. తద్ద్వారా వివిధరకములైన వస్త్రములు తయారుఁ జేయఁబడుచున్నవి. విజ్ఞాన మభివృద్ధిఁ జెందినకొలఁది పూర్వాచారములు సంస్కరింపఁ బడుచున్నవి.

పూర్వము వంటపాత్ర లుపయోగింపఁ బడెడివికావు. పాకశాస్త్ర మనుభవమందు లేదు. ఏ వస్తు వెటులఁ బక్వముఁ జేయవలసినది తెలియఁ జాలరైరి. అందుచే దొరకినది దొరకినటుల భుజించు టాచారమయ్యెను. విద్యయనునది సున్నగా నుండెడిది. అట్టి అజ్ఞానముచే మంచిచెడ్డల వివేచన లేదయ్యెను. ఆచారములు మూఢాచారములయ్యెను. హిందూదేశ చరిత్రయందలి విషయములచే ననాగరికులనఁబడువా రరణ్యమందు నివసించుచు, జంతువులవేఁటాడి వానిపైననే జీవించిరని తెలియుచున్నది. పూర్వమడవులున్న ప్రదేశములలో నిపుడు పట్టణములున్నవి. పూర్వమున్నదంతయు సమగ్రముగా మార్పుఁజెందినది. ఇందుచే పూర్వాచారములు మూఢత్వముచే నిండిన వనియు, ప్రస్తుతాచారములు విజ్ఞానముఁ జేకూరినవనియు గ్రహింపవచ్చు. ముందుముందు మన యిప్పటి యాచారములు మూఢతమములుగా భావింపఁబడును. వర్తమానమందు ఖండాంతర స్నేహముఁ బెంపొందినది. ఒకరిఁజూచి మరొకరు సర్వమును

సంస్కరించుకొనుచున్నారు. అటుల సంస్కరణ లేనిచో నాగరి
కతయందు వెనుకబడిన వారుగాఁ దలంపఁ బడుదురు.

## బాల్యవివాహములు.

బాల్యవివాహపద్ధతి పనికిరాదు. ప్రస్తుత మా బాల్యవివాహములు శాసనముచే మాన్పింపఁ బడుచున్నవి. వివాహయోగ్యదశ నిర్ణయింపఁ బడినది. మనోవృత్తులు వధూవరులకు స్థిరముగా నేర్పడిన వెనుక గావింపఁబడిన వివాహబంధము స్థిరముగా నుండును. త్రాడు నల్లువాడు లేతనారతో పేనిన, స్థిరత్వముగా నుండక నిరుపయోగమగును. ఋతువునందు దీసిన నారయే త్రాటికి బిగింపు. మఱియు నుపయోగమును. బాలబాలికల మనసులు లేతవి. అట్టి కోమల హృదయులగు వారికి జన్మాంతమువరకు బాధ్యతగల వివాహబంధము ముడివెట్టుటయవిచార్యము. వారు వినోదప్రియులు. గృహకార్య విమర్శకులు గారు. అన్యపోషితులుగాని స్వయం పోషకులు గారు. వివాహమాశ్రమధర్మము ప్రకారము గృహస్థాశ్రమము. వివాహమైన మరుక్షణమే గృహకార్య నిర్వహణము వధూవరులపై బడును. నేడు జేసిన బాలబాలికల వివాహములు రేపు వారు మరతురు. వివాహమనునది మరువదగినది గాదు. జన్మకుఁ బురాది. బాలబాలిక లొకానొక పాఠశాలయందు బఠించిరనుకొనుఁడు. పాఠశాల విడుచునంతవరకు కిరువురు, నాటలందును, నిష్కారణ వైరములందును గడపుదురు. యుక్తవయస్సు రాగానే తమ తమ గృహముల కరుఁగుదురు. యుక్తవయస్సునందు బాల్యచేష్టలఁ దలంచిన క్షణమే స్మృతియందుంతురు. తమలోఁ దాము సిగ్గుఁ

జెందుదురు. బాల్యమందు స్త్రీపురుష భేదము లుండవు. ఆనంద స్నేహములు మెండుగా నుండును. ఇతరులవలె తమకును పెండ్లి గావలెననియు, సంతానము గావలెననియు నా బాల బాలికలు చింతింతురు. వీరలకే (బాల్యమందు) వివాహమైన (యుక్త వయస్సు ప్రాప్తించగానే) బాల్యచేష్టల నెటుల మరతురో, అటులే వివాహమును మరువక తప్పదు. వారు భార్యా భర్త లని విశ్వసింపఁ జేయఁదగిన ప్రమాణములు లేవు. వారికి మరపుఁ జెందుటయే స్వభావము. నిద్రించువాని కెన్ని యుపచారములు చేసినను, ఏమి ప్రయోజనము? మేల్కొనినవాని కట్టివోఁసర్చిన గుర్తించఁగలఁడు. నిద్రించువాని వస్త్రము జారినను గ్రహింప లేడు. నిద్రాళువు చెంతనున్నవానినిఁ బాదతాడనముఁ జేసియు గ్రహించలేడు. పుష్ప సుగంధాదులచే నలంకరించినను గ్రహిం చజాలడు. జాగ్రతుఁడైన వాని కివి యెల్లను సుఖమో, కష్టమో గలిగించును. బాలురు నిద్రించువానివలెనే వస్త్రము లేకున్నను సిగ్గుగా దలపరు. ఇతరులదన్నియుఁ దప్పుగా దలపరు. నిద్రించిన వాడు కలువరించినరీతి నితరుల దూషించియు నింద్యముగాదల పఁడు. నిద్రాజాగ్రతల కెట్టి సంబంధముఁ గలదో, బాల్యయౌవ నముల కట్టిదియే గలదు. నిద్రించువాని కుపచారమొనర్చి యెటుల నవివేకతపాలగుచుంటిమో, బాల్యవివాహము లొన రించి అట్టి అవివేకతనే పొందుచున్నాము. అవివేకమునఁ గార్యముఁ జేయనేల? పిదపఁ జింతిలనేల! జాగ్రదవస్థ యందు లేని వాని కేవి యొనరించినను, తత్క్రియా ఫలితము లకు బాధ్యుఁడు చేసినవాడగును. ఆహా! ఏమి? బాలబాలికలు నిద్రించువానివలె నజ్ఞానులుకారా! వారికి జాగ్రతరానిది వారి

కేవి యొనరించినను దోషము చేయువారిదికదా! నిద్రించి మేల్కొనినవాడు మీరువాకేయుపచారాపచారములు జేసి యుండ లేదనియు, వానిని ప్రత్యక్షముగా జూచియుండ లేదనియు, నజ్ఞానావస్థ యందుంటిననియు, నేడిదియైన నిపుడొనరింపు డనుభ వింతునని తెల్పిన, తిరిగి వానియిచ్ఛచేనటు లొనరించుటయు ధర్మమనంబడును. బాల్యవివాహము, యౌవనమురాగానే దుర దృష్టముచే విచ్ఛిన్నమైన, బాలిక తిరిగి ప్రత్యక్షప్రమాణ ముచే జూడఁగోరిన, మఱల నటులొనర్చుట ధర్మయుక్తము. అటులఁ గావించుట లేదు. అప్రత్యక్షక్రియను ప్రత్యక్షముగా ఋజువుచేయుచు నిర్బంధించి మోసగింపఁదగునా! శిశువు లజ్ఞానులని, పాపమెఱుఁగరని నుడువఁబడుచున్నది. నిద్రించువాఁ డటులే యగును. అట్టివాని కేవియొనర్చినను హాస్యాస్పదమును, అజ్ఞానమును, అశక్తతను వెల్లడించును. మేల్కొనినవాఁడు సమ్మతించునో, లేదో యని యొనర్చుచున్నారు. బాల్య వివాహము లొనర్చుటయు, బాలబాలికల హాస్యముఁజేయు టయే. యుక్త వయస్కులైనవారు సమ్మతింప రను కారణ ముచేతనో, లేక, యంతకంటె మంచి బాంధవ్యము దొరకదని యో యటులఁ జేయుచున్నారు. నిద్రించువాడు మేల్కొని తనకొసఁగబడిన దేహమందలి మాల్యగంధాదుల విసర్జించుట కధికారము గలదు. బాల్యమునందు వివాహముఁ జేయఁబడిన వారును. యుక్తప్రాయమందు తమబాల్యమందలి భార్యా భర్తల విసర్జించుచో నెట్టిదోషము లేదు. పునర్వివాహితులగుట కెట్టి అటంకముండదు. జాగ్రతయందున్నవాడు ప్రయత్నముచే నొక వస్తువును సంపాదించి, తిరిగి విసర్జింపఁగూడదా? అటులే

యుక్త వయస్కులును పునర్వివాహ మాచరింపగూడదా? అను ప్రశ్న రావచ్చు. జాగ్రతయందున్న వాఁ డట్టివస్తువు దుర్లభ మని గ్రహించి, చిరకాలము దానికై చింతించి, అట్టివస్తువు తనకుఁ దగినదని గ్రహించి కైకొని, వెంటనే దానియందుప యోగ మొందకయే విడువ నుద్యుక్తుఁడగుట సంభవింపదు. యుక్తప్రాయమం దున్నవారు ప్రత్యేకముగా గుణరూపములఁ చే తృప్తిఁ జెందుచో అట్టితృప్తి త్వరలో నాశన మొందఁ జాలదు. అటుల విచ్ఛిన్నమైనదానికి ఫలభోగులు, బాధ్యులు తామేనని గ్రహించుశక్తి గలవారగుదురు. బాల్యమందు హస్తమందు గల మణివిలువ దెలియదు బాల్యాతీత ప్రాయమందు దాని విలువ గ్రహింతురు. స్త్రీపురుషులకు పరస్పర గుణరూపములు నచ్చవలెను. ఎట్టివాడైనను కావలసిన యాభరణమును బజా రులో నున్న దుకాణములందు దిరిగి తిరిగి, మనస్సునకు దృప్తిఁ గలుఁగుదానిని స్వీకరించును. అటులనే యౌవన ప్రాయమైన స్త్రీపురుషులు మనస్సునకుఁ దృప్తిఁ గలిగిన వారలే వివాహ మయ్యెదురు.

## స్త్రీ విద్య

సామాన్యముగా స్త్రీలకు విద్యయేల? అని ప్రశ్నింతురు. ఇటుల పలుకుట మూఢాచారము. స్త్రీజన్మయుఁ బురుషజన్మము వలె విలువగలది. సంసారమం దర్ధభాగ నిర్వాహణవిధులు స్త్రీల వలననే సమర్థింపఁ బడుచున్నవి. వారు ప్రాలుమాలిన సమాజ మునకు నష్టము. విద్య లేనిచో విషయపరిజ్ఞానముఁ గలుఁగదు. కుటుంబపోషణయందును, తదితర కార్యములయందును, విమర్శనా జ్ఞానము విద్యవలననే కలుఁగును. విద్యయం దున్నంత విలువ

ధనమునందు లేదు. విద్యనేర్చుకొనుటకుఁ దగినంత మనోవిజ్ఞానము పురుషులకువలె స్త్రీలకు లేదని నుడువఁజాల. సర్వవిషయములందును, పురుషులు మాంద్యత జెందునపుడు స్త్రీ జాగ్రత్త పడుచుండును. పురుషులవలెనే స్త్రీలును అభిమానము, కీర్తి నార్జింపఁదలచిన అరికట్టరాదు. సంసారచక్రమునకు స్త్రీ ఆధారమైన ఇరుసు. మానవకోటి యుత్పత్తిస్థానము స్త్రీ. స్త్రీలకు విద్య లేనిచో సంతానమునకును విద్య కొఱవడును. సంతానమందు తల్లి యంశములు తండ్రి యంశములవలెనే ఇమిడి యున్నవి. తల్లికి విద్య లేనిచో విద్యయందలి విలువ తెలియక, తనసంతానమునకును విద్య లేకున్నను బాగుండునని తలచును. ఆమెకే విద్యయొక్క విలువ తెలిసినచో తనసంతతికిని విద్య వలయునని, పరితపించును. పుత్రీపుత్రులు గృహస్థులగునంతవఱకు తల్లియొక్క నీతులందు వృద్ధిజెందుదురు. విద్యగలతల్లి బిడ్డలకు యుక్తమైన శిక్ష నొసంగును. కాన స్త్రీవిద్య లోకకల్యాణము. స్త్రీకి విద్యయేల? అని గర్హించు ప్రతివారును, అట్టి స్త్రీలు, రణక్షేత్రమందు వెనుఁజూడని వీరశ్రేష్ఠులకును, మహాసభలయందు సకల శ్రుతిస్మృతుల ప్రమాణములతో వాదించి జయమొందు పండిత ప్రకాండులకును, కాయకష్టముచే సర్వజీవపోషణ జేయు గల శాంతియుతులైన కార్మికకర్షకులకును, వారు వీరనేల! సకలమానవకోటికిని జన్మస్థానములు, పూజనీయమని గ్రహింపవలయు. అట్టి స్థానమున విద్య లేనిచో మనమెంత కుందవలయునో యోచింపుడు. ఆచోట విద్య, అనగా జ్ఞానమెంత మెండుగా నుండునో మానవకోటి కంత శ్రేయస్కరముఁ గలుఁగును. ఏమి? విచారహీనముగా స్త్రీవిద్యయేల? అనిపలుకు

ఎంత మూఢాచారము! ఎందరు స్త్రీలు పురుషులతో సమాన ముగా సాహిత్యసేవ, కళోపాసనలచే కీర్తిప్రియులైరి. అట్టికీర్తిని దుడుప, నెన్నిపురుష హస్తములైనను శక్తిగలవగునా! ఆకీర్తి కాంతను గర్హించుచుంటిమా! లేదు. స్త్రీజాతికి విద్యవలనను మూఢత్వమును రూపు మాపుట మేలగును.

## అంటరానితనము.

అస్పృశ్యత, అనునది సమాజమును పీడించుచున్నది. ఇది మనుష్యులయందే ప్రయోగింప బడుచున్నది. మానవ శరీర మంటరానిదని చెప్పుటలో సిగ్గగుచున్నది. ఆత్మ నిత్యమైనది. సర్వవ్యాపకమైనది. సనాతనమైనది. అవ్యక్తమైనది. అగోచరమైనది. చింతా దూరమైనది. ఉపాధి రహితమైనది. వర్ణములేనిది. అట్టి ఆత్మయే మానవ శరీరమందున్నది. ఆత్మకుం బవిత్ర స్థానమైన దేహమును తాక, వెనుకాడు టెంతవిచారణీయము! స్మృతుల యందును నాలుగు వర్ణములే కలవనిరి. కాని యిప్పు డైదవర్ణమును కూడ కల్పించి, అంటరానివారుగా భావించుట మిక్కిలిశోచనీయము. పూర్వము నిషాదులు, శబరులు, భిల్లులు మున్నగువారు బాహ్య ప్రదేశములందే నివసించుచుండిరి. వారల నంటరానివారలనుగా భావించుచుంటిమా? ధర్మశాస్త్రరీత్యా పరికించినను, అనుభవముచే దిలకించినను సందేహము నివారణమగును. కర్మనుబట్టి అంటరానివాడని చెప్పుటకు వీలుండదు. ప్రస్తుత మేజాతి అంటరానివారుగా భావింపఁబడుచుండిరో అట్టివారియందును విజ్ఞానులును, గొప్పసంస్కారులును గలరు. దానంజేసి, వారియం దస్పృశ్యత మానుటకు

చున్నది. అవిద్యయే అస్పృశ్యతకుఁ దావిచ్చినది. పైయుదాహరణరీత్యా, చదువుటచే అంటరానితనముఁ బోవుచున్నదనగా, చదువనివానియందంటరాని తనమున్నదని యూహింపవచ్చు. నాలుగు వర్ణములందెవఁడైనను విద్యావిహీనుఁడైన, వాడే అస్పృశ్యుఁడనఁబడుచున్నాడు, ఇటులనిన సవర్ణులకు ద్వేషముఁ గలుఁగవచ్చు. అయినను వారెటుల దీనిని రుజువు చేయఁగలరు? స్పృశ్యునకు, నస్పృశ్యున కెచటభేదముగలదో చూతము. ఇరువురు భాషయు, తినుపదార్థములు, త్రాగు నీరును, పీల్చు వాయువు నొకటియే. అవర్ణుఁడనఁబడువాఁ డస్పృశ్యుఁడే యైన త్రాగునీరు, పీల్పుగాలి మొదలగునవి సవర్ణులకు వేరువేరుగా సృజింపఁ బడవలెను. అటులఁ గన్పట్టుట లేదు. గాన సృష్టిలోని సర్వపదార్థములకును, మానవులందరు సమాన హక్కు గలవారని తెలుచున్నది. కుటుంబమందు సోదరులకు, ఆస్తియందెట్టి సమానహక్కులు గలవో విశ్వమందలి మానవులకట్టి హక్కులే గలవు. సోదరులయం దస్పృశ్యతాభావముఁ గాంచము. గనుక మానవులందును, అస్పృశ్యత తలచరాదు. నేఁడస్పృశ్యుఁడు పాలుపితుకుకొనిన గేదెను రేపు స్పృశ్యుఁడు కొన్ని రూకలచే గొని తనయింట పాలు పితుకుకొనును. అస్పృశ్యతా దోషము స్నానాది ప్రాయశ్చిత్తములచే పోవునని వాదుక. అవర్ణుం దేహము సవర్ణుఁడు దాకిన ప్రాయశ్చిత్తముఁ జేసికొనును. వాడు స్పృశించిన యేవస్తువు నైనను స్పృశించిన ప్రాయశ్చిత్తమే దోషవిముక్తి. పైయుదాహరణచే గేదెను అస్పృశ్యుఁడు తాకెను. అట్టిదానిని సవర్ణుఁడు తాకకయుండు, స్నానాది ప్రాయశ్చిత్త కర్మలొనర్చి గృహమునకుఁ గొంపోవుట లేదు, అవర్ణుం

నుండి వచ్చిన యేవస్తువైనను, అగ్నిచే శుద్ధిఁజేసి సవర్ణుఁడు స్వీకరించు వాడుకగలదు. అటులే తాఁగొన్న గేదెను సయితము స్నానముఁ జేయించి, అగ్నితో శుద్ధిఁగావించవలయు. అటులఁ గావించుట లేదు. ధాన్యము పండించుటకు, దంచుటకు అవర్ణుఁడవసరము. సవర్ణుఁడు ధాన్యము నాహారరూపమున భుజించు సమయమున అవర్ణుఁడు చూడరాదట! దిగువరోజున అవర్ణుఁడు తన యింటియందున్న ఎంగిలిచల్లి, తాను స్పృశించిన జలముతో గేదెకు కుడితి మొదలగునది నొసఁగును. అట్టి పదార్థముచే నుత్పన్నమైన క్షీరమును మరుసటి దినమున సవర్ణుఁడు తనయింటియందు ద్రాగుచున్నాఁడు. ఇచ్చిన యాహారమునుండియే గదా, పశువులకు క్షీరోత్పత్తి.

సవర్ణునికేల, అవర్ణునిపై నిట్టిద్వేషము? స్వలాభముండునంతవరకు, అనగా పాడిపంటల ననుభవించునంతవరకు అస్పృశ్యత లేదు. అస్పృశ్యతమాత్రము సౌఖ్యముగా మనుచుండునంత వరకే. దూరముగా పొమ్మని తరుముట, న్యాయమా? చోరుని బంధించి దూరముగా తాకకుండనుందురు. ఘాతుకునకు భయపడి దూరముగానుండి స్పృశింపరు. వ్యభిచరించువానిని దోషిగాభావించి, వానినుండి స్త్రీపురుషాదులు స్పృశింపక తొలఁగుదురు. మత్తు గ్రోలిన వానినుండి దుర్గంధమునకు, మదచేష్టలకు వెఱచి తాకక యుందురు. శాక ఫలోత్పత్తిజేయువారలను, తద్విక్రేతలను స్పృశించి, వారి చేతులనుండి శాకఫలాదులను సంతోషముతో గ్రహింతురు. జీవవధచే మాంసోత్పత్తిఁజేసి, విక్రయించువారలను బహిష్కరించి స్పృశింపరు. ఇందుచే చౌర్య, క్రౌర్య, వ్యభి

చారములందును, మద్యపాన, జీవవధ, మాంసభక్షణ, మాంస విక్రయాదులందును అస్పృశ్యత బొడమచున్నది.

పై నుడువంబడిన గుణములుగలవా రెట్టివర్ణమువారైనను, అంటరానివారుగా తలంపఁబడుదురు. ఇతరులం దస్పృశ్యత తలంచుట యవివేకము. ఈగుణములన్నియు నవిద్యచే నుత్పన్న మగుచున్నవి. సమాజమందు విద్యావ్యాపకమున్నచో అస్పృశ్యత నశించును. ఒకజాతిని అస్పృశ్యులుగా తలంచుటకు వీలుండదు. నేడంటరానివారుగా భావింపఁబడుజాతియం దెందరో కవులు, కవయిత్రులు, వేదాంతులు, విద్వాంసులు, మహాపతివ్రతలు పూర్వమునుండియు నిప్పటివరకును గలరు. అస్పృశ్యతయందు దోషమున్న, స్నానముచే నెటులఁ బోగలదు? స్నానముచే దేహమునందుగల మురికిమాత్రముఁ బోవును. అస్పృశ్యత మురికి రూపమున గనిపించుటలేదు. అది ఏరూపముననో అగోచరముగా నున్నది. ఎంతపరిమాణముఁ గలదో తెలుపలేము. అంటినచో నెటుల వ్యాపించుచున్నదో గాంచుటలేదు. దానికి భావనారూపమే గాని వస్తురూపము లేదు. భావపరివర్తనముఁ జేయఁగలము గాని, వస్తురూపమును మార్పుఁ జేయఁజాలము. కనుక క్షణకాలములో భావము మార్చుకొనిన అంటరానితనమును క్షణములో నడుగంటిపోవును. ఇది నిరాధారమైన మూఢాచారము.

## ఉగాది

ప్రతిచైత్రమాసము శిశిరాంతము. వసంతమునకాది. సంవత్సరమంతయు వృక్షసంతానములకు పత్రములు వృద్ధాప్య

మందు రాలుచున్నవి. వృక్షములు తిరిగి కోమలపత్ర సంతాన మును గనుచున్నవి. మృదుత్వము, కోమలత వృక్షజాతమందు మనోల్లాసముగా నుండును. వసంతుఁడట్టి పసిపాపలైన పత్రము లతో కేళీవినోదము సలుపును. అప్పుడే పుష్పోద్భవ మగును. నూతన వత్సరమునకు ఫలపూతములైన సుమదర్శనముచే సర్వ ప్రకృతి యానందమునం దోలలాడు పుణ్యదిన ముగాది. దీనియం దెంత గుణపాఠము గలదు! నూతనతలంపు లుద్భవించుటకే యుగాది. చైత్రమందుద్భవించు పుష్పజాతము, వత్సరమంతయు ఫలాదు లొసంగును. వత్సరాదియం దుద్భవించు చింతనలు వత్స రమంతయు ఫలము లొసంగవలెను. ఎట్టిచింతనలు క్రౌర్యయుత ములుగావో ఎవ్వానిచే అర్థప్రయోజనముఁ గలుఁగునో అట్టి ఊహలుమనసునందుద్భవించు పుణ్యదినమే యుగాది. శిశిరమందు పత్రపతనమువలె పూర్వవత్సరపు దుశ్చింతలు క్రూరకర్మములు నశింపఁజేసి సుకృతాచారముల నవలంబించుకొను సంధిదిన ముగాది. ఉగాదియందు మంగళస్నానమాచరించి నూతనవస్త్ర ధారణ మొనర్చి నిర్మలమనస్కుఁడై తద్వత్సరకార్య యోచనా పరుఁడై, ఎట్టి దుష్క్రియల నానాడాచరింపక వత్సరాంతము వరకు తానుజేయువలసిన కార్యములకు ప్లాను వేయువలెను. నూతన వత్సరపు పుష్పశయ్యయందున్న మధువును నవీనోత్సా హముఁ గొఱకు గైకొనవలెను. ఆ వత్సరమం దుద్భవించిన షడ్రస (ఉప్పు పులుపు, కారము, తీపి, చేదు, వగరు) ముల సేకరించ వలెను. అందువలననే వేపపూత, క్రొత్తబెల్లము, క్రొత్తచింత పండు మిళితము గావించి భుజించుటాచారమైనది. ఆ నూత్న పర్వదినమందు వీనిసేవనచే జిహ్వామాలిన్యము వదలుచున్నది.

అట్టిదినముననే మూఢాచారపరులు జంతురక్తమాంసములఁ దినుచుండిరి. ఎంత యరుచి! ప్రకృతి కెంతవిరోధము! ఇట్టిహింసాచార మీ నాడొనరించుటేల! ప్రకృతిమాత యొసంగు నూతన పదార్థమువదలి, మందబుద్ధిచే నిట్టిపని గావించుట యుక్తమగునా! ఆనాడు ప్రకృతియం దెంత మార్పుగలదో యోచింపుఁడు. మూగ జంతువుల వధించుటకా యీ యుగాది! లేక, కార్యభారము వహించుటకా! ఎంత విరుద్ధము! ఎంత యవివేకము!! ఉగాదియం దిట్టి శాకేతరపదార్థము లుపయోగించుట యుక్తమగునా! ఉగాది రాజోత్సవదినముల కాదర్శకముగా నుండవలెను. ఆ నాఁడీవత్సరమం దీకార్యము చేయఁబోవుచుంటిమని ప్రారంభోత్సవముఁ జరుపుట, పై మూఢాచార మూహించి, వత్సర మంతయు మే మిట్టి మూఢచర్యల నాచరింపమని ప్రతిజ్ఞలు చేయుట, మఱియు సన్మార్గముఁ ద్రొక్కుట సార్థకంబగును.

## పారువేట

శరత్కాలము సర్వపైరులు ఫలించుఋతువు. ఆహ్లాదకరమును. దిగంతములవరకు నమృతాంశునికిరణములనుండి, కష్టించిన రైతుకులముయొక్క జయకీర్తిచంద్రికలా! అను నటుల పండువెన్నెలవ్యాపించినది. గగనము నిర్మలమై, రైతులోకము సస్యఫలములఁ గాంచి చిత్తస్థాయి నొందెనా! అను నటుల మనస్సునెంతో సౌఖ్యాబ్ధి నోలలాడించుచున్నది. వన్యమృగములు పండినపైరుల నాహారింప బయలుదేరును. రైతు వానిని బారఁదరుమును. పైరును వానిబారినుండి కాపాడ

నుద్యుక్తుఁడగును. అటులొనరింపనిచో జీవనోపాధియగు ధాన్య జాతము నశించును. వీలగుచో మిక్కిలిమారమువరకా జంతువులఁ దరుమును. వానిఁ బారఁదరుముచు రైతు కావలిగాయును గాని, వాని నంతమొందింపఁడు. ఇటుల పైరులనుండి అడవిజంతువులఁ బారఁద్రోలుటయే పారువేట. ఈబుతువునందే భూపతులొండొరులపై నెదుర్కొనఁబోవుటకు, త్రోవలు, డొంకలు, నదులనుకూలముగానుండును. యుద్ధసన్నాహమందు వారాయుధములఁ దయారుజేయుదురు. దీనినే ఆయుధపూజ యందురు. ఆయుధములను సరిజేయుటకుఁ దగినద్రావకాదులవసరముగాని, నోరులేని జంతువుల రక్తముఁ దగునా! చేతిపనులుచేయువారు తమతమ పనిముట్లను వ్యవసాయదారులు నాగళ్ళు మున్నగువానినిఁ బూజింపవలెను.

మూఢవిశ్వాసముచే, మనోదౌర్బల్యముచే అజ్ఞానులై ఎన్నడో ఏనాడో రాజాధిరాజు లాయుధసన్నాహముచే ఒకరిపై నొకరు ఢీకొని విజయమందిన కారణమున ఆ దశమికి విజయదశమియను నామముతో తమనునమ్మి తమవెంట విడువకవచ్చు మూఁగిగొఱ్ఱెల మహాయోధాను యోధులవలె శమీవృక్షము క్రింద పదునులేనికత్తిచే ఖండించి విజయమును వెల్లడించుచున్నారు. ఏమి? వీరి వీరి వీరావేశములు. వీరలవీరత్వము నోరులేని గొఱ్ఱెలపైననా! లేక తమనెత్తిపై స్వారిజేయు వారలపైననా! సిగ్గు. సిగ్గు. ఇట్టి మూఢాచారమును స్వప్నమందైనను ఎట్టిభారతీయుఁడును స్మరింపకుండునుగాక ! పైరుపంటలఁగాపాడ మూఁగ జంతువులఁ బారఁ ద్రోలుటయే పారువేట యనఁబడును. గాని జమ్మిచెట్టుక్రింద మూఁగిగొఱ్ఱెలను జంపుట గాదుసుమా!

## బాణాసంచా

దీపావళి యనగా దీపముల సమూహము. ఆరోజున అన్నిప్రాంతాలలోను బాణాసంచా గాల్తురు. అందువలన ధన వ్యయమును, ప్రమాదమును, అనారోగ్యమును గూడ సంభవించుచుండును. రాత్రియంతయు నిద్రాభంగము మఱియు ఇండ్లు, బజార్లు దుర్గంధ యుక్తములగును. పశుపక్షులకు నిద్రాభంగమును, భయోత్పాదకమును గూడ. కాల్పులచే గొప్ప ప్రమాదములు గలుగుచుండును. గాన, ఇట్టి మూఢాచారమును మానుకొనుటుత్తమము.



కోడి పందెము.

సంక్రాంతి పండుగ హేమంత ఋతువులో వచ్చునది. క్రొత్తపంట లింటికిఁ జేరును. మానవ, మానవేతరములగు పశుపక్ష్యాదులకన్నింటి కానాడు పండుగ. అందరు వినోదింపఁదగిన సర్వోత్తమమైన పర్వదినము. ఇట్టి దివసమున నోరులేని కోడి పుంజులకు పౌరుషము గలిగించి, యుద్ధక్షేత్రమందు వానిని వదలి, వాని కిరుప్రక్కల మానవులు తండోప తండములుగా జేరి, అందేదియో ఒకటి తుదముట్టువరకు నట్టే వేచియుందురు.

పక్షిజాతికి వైరముఁగలిగించి ఆనందించుటకాక సదాచారమగునా! వేలకొలఁది కోడిపుంజులు హతమగుటకన్న, మేలెద్దియు గానుపించుటలేదు. ఇట్టి కోడిపందెముల చెంతఁజేరిన మానవ సమూహామందు బద్ధవిరోధము లేర్పడుచున్నవి. పుంజుల ఓటమి, జయము తమదిగానే దలతురు. చివరకుఁ గత్తి కఠారులతో పగదీర్చుకొనుటకుఁ బూనుకొందురు. ఆనాటి విరోధము లే దీర్ఘవైరము లగుచున్నవి. సంక్రాంతిపండుగ వైరోత్పన్నములకు మూలమా! లేక నూతనధాన్యపు రాసులఁగాంచి ఆనందించుటకా! కోడిపందెములవైచు వారల ముఖమందు క్రౌర్యము తాండవమాడుచుండును. పందెపుస్థలమంతయు క్రౌర్యముచే నొప్పుచుండును. క్రౌర్యమునకుఁ జెడుఫలమేగాని, లాభముండదు. సంఘమందిట్టి మూఢాచారముఁ దొలఁగింపనిచో అనాగరికత వృద్ధిఁపొందును.



పొట్టేళ్ళ పందెము.

పొట్టేళ్ళపందెము నీ రకములోనిదే. ఆ సాధువులకును లేనిపోని వైరముఁ గల్పించి తలలు బ్రద్దలుగా గొట్టించుచుందురు. పందెమోడినవాఁ డెంత ధనమైనను వ్యయపరుప వెనుదీయఁడు. అటుల వ్యయపఱచు ధనము వృధా యగుచున్నది. పందెము గెలిచినవాఁడును ధనవ్యయముఁ గావించును.

ఇంకెన్నియో పందెములకుఁ దయారగును. ఒక పందెమునందు గెలిచినవాఁడు మఱియొక పందెమున నోడును. పశుపక్షులకు వైరములు గలిగించి తాము నష్టపడి చివరకుఁ గూడును గుడ్డయు లేక, అల్లాడువారి నెందరినో మనముఁ గండ్లారఁ గాంచుచున్నారము. సమాజమందిట్టి మూఢాచారము లెంతయు వినాశకరములును, నాగరికతా దూరము లగును.

## హింసాయజ్ఞము

పౌరాణికయుగమునుండియు యజ్ఞము, తపస్సు అను ద్వివిధాచారములు గలవు. ఆధునికమందు వానిపై విశ్వాసము లేకయు, తత్సిద్ధికొరకు శ్రమకోర్వ లేకయు చాలవరకు విడనాడిరి. విడనాడినను వానిని విశ్వసించువారలు కొందరు మాత్రమే గలరు. విశ్వసింపవచ్చు. ఆచరింపవచ్చు. కాని వాని ఆచరణోపయోగముల గ్రహించు టుత్తమము. యజ్ఞము అను శబ్దమునకు పూజ అని అర్థము. తపస్సు అను శబ్దమునకు పరితాపమొందుట, కాల్చుట, అని అర్థము. పూజయనగా నేమి ? పూజార్హుఁ డెవఁడు ? పూజ ప్రత్యక్షమా ? పరోక్షమా?

జగదుపకారియు, ఫలప్రదాయియు పూజార్హుఁడగును. అట్టివాని నర్చించుటయే సుఫలము. యజ్ఞములు పరోక్షపూజలు. పరహితార్థము పూజించువా డుత్తముఁడు. స్వార్థముకై పూజించువాడు మధ్యముఁడు. పరార్థస్వార్థములకు భిన్నముగా పూజించువాఁ డధముఁడు. పరాపకారముకై పూజించువా డధమాధముఁడు. పూర్వకాలమందలి యజ్ఞము లన్నియు పరోపకారముకై చేయఁబడినటుల ద్యోతమగుచున్నది.

ఒకనిని నశింపఁజేయు శక్తికొఱకు వేఱొకఁడు యజ్ఞముఁజేయుట పూజయనిపించు కొనదు. పూర్వీకులలో గొందఱు తమదర్ప మును వెల్లడింప యజ్ఞములు జేసియుండిరి. యజ్ఞము ప్రత్యక్ష పూజగాకుండుటం బట్టి మిక్కిలిగా దానిరూపము వర్ణింప నుత్త మముగాదని వదలు చున్నాడను. ఒకని కోరిక వస్తువుగావలసిన అట్టివస్తువుఁ గలవాని చెంతకరిగి సేవాస్తోత్రము లొనర్చినను లేక చతుర్విధోపాయములఁ బ్రదర్శించినను లభింపఁగలదు. నిరప కారియు, సత్వగుణ సంపన్నుఁడగు వాఁడే పూజార్హుఁడు. వాఁడే ఫలముల నొసఁగును. అట్టివానికిఁ జేయు పూజలలో సాత్విక ద్రవ్య ములను, నిరపకారతచే లభించిన సత్వ పదార్థములును వినియో గింపఁదగును.

పై యజ్ఞములఫలము సత్యదూరమై హోమగుండము చెంత పశుబలి, అనుదాని ఫలితమే యజ్ఞకర్తకు లభించును. పరోక్షయజ్ఞమందు యజ్ఞఫలదాత ప్రత్యక్షమగునని తలంతుము. ఫలము లొసంగునని ఊహింతుము. అట్టి యజ్ఞపురుషుఁడు ప్రవే శించు మార్గమును దొలుతనే యజ్ఞపశురక్తముచే అపవిత్రముఁ జేయుచుండిరి. మహాపురుషులు చరించు మార్గమందు సుగంధ ద్రవ్యములు, ఆకర్షణీయ తోరణములు నిర్మింతురు. అట్టివాహ్వా నమునకు యోగ్యమైనవి. పశుబలిచే అసహ్యముఁ గావించిన, ఆమార్గముననేగక వేరుమార్గమున నేగును. అనగా సుగంధ, ఫల, పుష్పాదులచే నర్చించు మార్గముననే పోవును. దీని భావమేమన ఒకేసమయమం దొకఁడు పశుయజ్ఞమును, మఱియొకఁడు సాత్విక రీతియజ్ఞములు గావించిన, రెండవవాని కూహించుఫలమబ్బునని తెలియుచున్నది. హింసాయజ్ఞము మూఢాచారములలో నగ్రి

స్థాన మాక్రమించుచున్నది. ఇట్టి యజ్ఞములే పూర్వముండెనేని ప్రస్తుతము నుండవచ్చు. ముందు నుండవచ్చు. కానిఎప్పుడున్నను అది హింసాయజ్ఞ మనిపించుకొనును. హింసాయజ్ఞముం జేయు వారును, చేయించువారును తొలుతనే పరాపకారముంగావించు చున్నారు. సర్వాంతర్యామియైన, సర్వఫల ప్రదాయియైన యజ్ఞపురుషునికి నమస్కృతులొనర్చి, సాత్వికముగా ధ్యానముం జేసిన ప్రత్యక్షమగునేమోగాని, పశుహింసారూపమున, అమ్మహానీయుని శరీరముం గత్తితో జీరి బాధించిన క్రోధాత్ముండు గాకుండునా? ఫలశూన్యత గావింపకుండునా? యజ్ఞ మనగా పూజ. అట్టి దానిని హింసారూపమున నాచరించు టతిహేయము. ఆహా! ఏమి? పశుబలిచే సర్వశక్తిసంపన్నుండగు నీశ్వరు నర్చింపుచున్నారు. ఎంతటి నీచార్చన! తమకంటె నీశ్వరుని దక్కువగా భావించుట గాదా!

వర్షములు గురియుటకును, పైరుపండుటకును యజ్ఞముం జేయవలెనట! ఇంద్రలోకప్రాప్తికిని, రంభాదివేశ్యలసౌఖ్యము నకును, సంతానోత్పత్తికిని యజ్ఞ మొనరింపవలెనట! యజ్ఞములచే వర్షములుగురిసిన, వేసవికాలమున నుష్ణబాధ నొందు టేల? యజ్ఞములచే వర్షములును, వర్షములచే పైరు పంటలు పండిన, పూర్వమునుండి కాటకబాధ లొందుటేల? రంభాది వేశ్యలంగాంచకయు రతిభ్రముం జెందుచున్నారు. ఇట్టి భ్రాంతిచే యజ్ఞములం గావింపుచున్నారు. యజ్ఞములుచేసి ఇంద్రలోకముం బ్రవేశించుటకన్న అచట సౌఖ్యమిచ్చు వస్తుజాలము లిటకు సరఫరా జేయించుకొనరాదా! యజ్ఞముచే సంతానోత్పత్తియైన వివాహములేల? ఎంతటి మిథ్యాచారము?

అంతర్యజ్ఞము, అనగా ఆత్మయజ్ఞమే సుఖదము. అదియే తపస్సు, కామ క్రోధాదులచే చిత్తముఁ జలింపఁబడి, కార్య విఘ్నత గలిగించుతఱి, అట్టి చిత్తశాంతి నిరోధకములైన కామ క్రోధాది దుర్గుణముల నాహార నియమముచే దపింపఁజేసి, లోలోన పూర్వకృత కర్మలకై పశ్చాత్తాప పరితాపముల నొందుచు నింద్రియజేత యగువరకును, సత్సంకల్పసిద్ధిఁ గాంచు టకును, అమోఘ వ్రతానుయాయియై ధ్యానమొనరించు టయే తపస్సు. ఇట్టి ఆత్మయజ్ఞముచే ఎంతయుశాంతిఁ జేకూరును. కార్యఫలముఁగూడ గలుఁగును. ఇది ఎవరికైన, ఏక్షణముం దైన ఆచరించుటకు వలనుపడును. దీనికి యజ్ఞపశువులను, ఋత్విజులను సమకూర్ప నవసరముండదు. ఆర్థిక వ్యయముం డదు. బాహ్యయజ్ఞముచే కొలఁదిదినములవరకే సౌఖ్యము. మఱియు నెన్నియో దినములు యజ్ఞ ద్రవ్యములు సమకూర్ప వలెను. ఋత్విజుల నెందరినో తృప్తిఁబరుపవలెను. ఎన్నియో ఆటంకము లెదుర్కొనవలెను.

అంతర్యజ్ఞము జన్మాంతరమువరకు సౌఖ్యమిచ్చును. తలచిన క్షణముననే ప్రారంభింపవచ్చు. ఆత్మ యజ్ఞమునకు నిర్జనప్రదేశమే యాగశాల. చిత్తమే హోమగుండము. పరితా పమే హోమాగ్ని. కామక్రోధాదు లడంచుటయే బలి. చిత్త స్థాయియే యజ్ఞఫలసిద్ధి. చిత్తస్థైర్యమందు ప్రత్యక్షమగు నూహా జాలములే యజ్ఞపురుషుని వరములు. అట్టి ఊహాలచే జన్మసాఫ ల్యమొందుటే పరమేశ్వరునిచే వరసిద్ధిఁ గాంచుట. ఎంత చవుక యజ్ఞ మీ అహింసాయజ్ఞము! మోక్షయజ్ఞము

ప్రతివానికి లభ్యమగునని. దేహియొక్క త్రిదోషములను హరించునది. తరుచిన శక్తులం బ్రసాదించునది. ఇట్టి యజ్ఞ తత్వము బాగుగా నర్థముం జేసుకొనువారెవ్వండును, బహు బాధాయుతమగు బాహ్యయజ్ఞమును మనమునందు దలంపఁడు. అంతర్యజ్ఞమునకు వెలచవుక. ఫలమధికము. బాహ్యయజ్ఞము నకు వెలయధికము. ఫలముసున్న. బాహ్యయజ్ఞము జేయు రాజాధిరాజులు ప్రజాపీడన మొనరించి, ధనము సమహర్చి, యజ్ఞశాలలందు మంత్రములం బఠించు ఋత్విజులకై లాభమును తమకు ఫలశూన్యతయు గల్గించుకొనుచున్నారు. దీనిలాభ మెవ రొందిరో అట్టివారే దీనిని సృజించిరి. ఎన్నియో భ్రాంతులను దీనియం దిమిడ్చిరి. ప్రభువును కింకరులచే ప్రజలను పీడింపఁజేసిరి. ప్రభువులు యజ్ఞములు చేయవలెనన్న, ఎన్నియో ప్రజాకుటుంబ గ్రాసము లాహుతి గావింపఁబడి, కాటకములు సంభవించుననున్న మాటనిజము. కాటకనివృత్తికై గావింపఁబడు యజ్ఞము కాటకప్రద మగుచున్నది. యజ్ఞకర్తలెట్టి భ్రమజాలములందు జిక్కుకొనిరో యోచింపుఁడు. ఆత్మయజ్ఞమందు భ్రమలు నశించును. సర్వమును విమర్శించు జ్ఞానోత్పన్నమగును. సత్యప్రకాశముంగలుగును. యజ్ఞ కర్తయేగాక మరెందరో భ్రమమూను లగుదురు. భ్రమలుపోయిన ఫలము మెండగును. భ్రమలందుః జిక్కిన కష్టనష్టములెన్నియో కలుఁగును. లోకమందలి యజ్ఞానము నాత్మయజ్ఞముచే తుడిచి వైచి అవినాశకీర్తి ప్రదులైన మహానుభావుల చరిత్రల నెన్నిం టినో మనముం దిలకింపలేదా? వారి తపోదర్శిత సూత్రముల చేతనే లోకమజ్ఞాన దూరమగుచున్నది. అట్టి సూత్రములే ఇక ముందును ప్రయోజనకరము లగును. ఆ తపోధనులే సంఘకర్తలుః

తను దావిమర్శింపఁజాలనిచో ఇతరులనెటులు విమర్శింపఁగలుఁగును? తను దా విమర్శించుటయే ఆత్మయజ్ఞము. అనగాతపస్సు. ఇట్టి సాత్వికయజ్ఞముచే తనుదావిమర్శించుకొని, సులభమార్గము గ్రహించి ఇతరుల కాదర్శుఁడై తనమార్గమున నెందరినో నడపించుచున్నాఁడు. బాహ్యయజ్ఞ మొనరించినవా రెందరో అహంకార పూరితులై పేరుకైనను లేక నశించిరి. వారి ననుసరించువారు లేరైరి. పైగావారిచే బాధపడువారు మెండు. పశుయజ్ఞముచే కష్టమో సుఖమో ఒకడేమాత్ర మనుభవించును. తపోయజ్ఞముచే సన్మార్గము పలువురకును లభించును. పలువురి శ్రేయస్సే తగినది. గనుక మూఢాచారమగు హింసాయజ్ఞము మాని సౌఖ్యప్రదమగు అహింసాయుతమగు అంతర్యజ్ఞ మాచరింతురుగాక.

## శక్తిపూజ

శక్తి సర్వ ప్రపంచమందును, సర్వ జీవులయందును ఇమిడియున్నది. దానికి నామరూపములు లేవు. అద్దానినే స్త్రీ వాచకముగా వాడుచున్నారు. శక్తిని స్వాధీన పరచుకొని, తద్ద్వారా క్రియల నాచరించి ఫలములొందవలెను. సాత్వికాహారముచే శ ......నమగును. తామసాహారముచే శక్తి తనను వశపరచుకొనును. క్రుద్ధుఁడగువాఁడు కోపముచే జయింపఁబడినవాడగును. శాంతస్వభావుఁడు కోపమునకు లొంగఁడు. కోపమనునదియు లోనుండి కలుఁగు ఒకానొకశక్తియే. అట్టి శక్తికి మానవుఁడు లొంగరాదు.

కోపమనుశక్తిని గుఱించి, నన్ను నీవెపుడు వదలకుం డుము. నాచే సర్వక్రూరకర్మలఁజేయించుము—అని ఎవఁ డారాధించును? శాంతరూపుఁడు, ఓ కోపపిశాచమా! నీరూప మంధకారము. నీవు నన్నానరించిన జగత్తునందలి యుక్తాయుక్తములు నాకుగోచరింపవు. నీవు నాయందున్నంతవరకు నశక్తుఁడను. నీవు నశించుటకు శాంతి చంద్రోదయ మవసరము. శాంతి ప్రాప్తికి సాత్వికపదార్థములు భుజించి, తద్ద్వారా గలుఁగు శక్తిచే సత్యచింతనలఁబొంది సుఖప్రాప్తి పొందగలనని నుడువును.

శాక్తేయు లనఁబడువారు శక్త్యుపాసకులు. ఇందుచే ఆ మతమునకుఁ జెందనివా రశక్తులుగా నుందురా ! అటులైన వెయ్యింటికి 999 మంది శక్తిలేక మూలఁబడి యుండిరా! లేదు. శాక్తేయులకంటె శక్తిగలవా రనేకులు గలరు. కాలక్షేపమునకై శాక్తేయుఁమని నామమిడుకొని శక్తికి నామరూపములిడి, శిలారూపులఁ గావించి, ఓ శిలా! మాకెంత శక్తిలేదు. నీవే శక్తివి. నీకాహారమిచ్చుచుంటిమి. గైకొనుమనుచు, ఎన్నియో క్రూరహింసలు జేయుచున్నారు. ప్రతిజీవియం దేదియో ఒక రూపమున శక్తిగలదు. అనగా క్రియలఁ జేయుట, చేయించుట జ్ఞానేంద్రియములచే గ్రహించుట మొదలగునవిగా నుండును. ప్రపంచమునఁ గల సర్వజీవులు శాక్తేయులు. శాక్తేయు లను వారు దేవీపూజలచే శక్తిలేనివారుగా వెల్లడించుకొనుచు హింసాకృత్యములచే ఇతరశక్తుల నశింపఁజేసికొనుచున్నారు.




తామసపూజ

శక్తికొఱకుగాక, వినోదముకై విగ్రహములఁ నిలిపి, వేరువేరునామములుగల్పించి, అసభ్యపు కేకలతో, వికృతవేషములతో పిశాచములవలె నాట్యమాడు నీచజాతి మానవసమాజమిం దిప్పటివరకుఁ గన్పట్టుచున్నదనిన, ఎంతఅవమానకరమో యెంతసిగ్గుచేటో యోచింపుఁడు. వీరు పూజలందు చిందులు ద్రొక్కుట, కత్తులతో ఆట, ముఖమందు వివిధవికృతభావములు గన్పరచుట, సునాయాసముగా జీవజంతువులఁ బ్రాణములు దీయుట మున్నగు క్రియల నాచరించుచు, వన్యమృగములవలె మానవ సంఘముమధ్య దిరుగుచున్నారు.

ఎంత అవినీతి ! భగవన్నామములకు మారు గంగానమ్మ, గంటలమ్మ, మారెమ్మ, మైసమ్మ, చింతలమ్మ, సుంకులమ్మ మొదలగు నర్థములేని వ్యర్థపుపేరులు పెట్టిరి. ఇక నీ నీచుల పూజాద్రవ్యములు, కోడి, మేక, దున్నలు. ఎంత అనాగరికత ! ఎట్టి పూజావిధానమందైనను పైనుదువం బడినవి గాంచగలమా ! శ్రుతి స్మృతి పురాణములయందు పైనామములు లిఖింపబడి యుండెనా ! అట్టి పూజల కాధారములుండెనా ! పుక్కిటి పురాణములు నిరాధారములు. ఇట్టి నీచజాతిని సంఘము నుండి వేరుపరచి, శాస్త్రరీత్యా సంస్కరణ లొందుటకుఁ దగిన శిక్షణము సమాజ మొసఁగనిచో శ్రేయస్సు గలుఁగదు.

ఆరాధన కంతర్ధ్యానము, ఏకాంతవాసము సాధుసంగతి సద్గ్రంథపరిశీలనము మొదలగునవి సాధనములు. ఈ నీచపూజకు క్రూరములగు కేకలు, కర్ణకఠోరములగు వాద్యములు, ఆయుధసంగతి, రక్తమాంసపరిశీలన ! ఏమి ! ఇది పూజయా ! మానవుఁడెవఁడైనను దీని నొప్పుకొనునా ! విశ్వాసము లేనిచో ఆరాధనలు మానవలయునుగాని, ఇట్టివిచేయ సాహసింపదగునా ! మానవసమాజ మంతయు నీలాటి పూజలొనరించుచో భూలోకమందు బలికి పశుపక్షులుచాలక, తుదకు బలిస్థానే మానవులుపయోగింపఁబడి లోకమునఁ గల మానవకోటికిగూడ నపాయము సంభవించు ననుటలో అతిశయోక్తి లేదు. హింసాపూజ ఎంతఅపకారము! ఎంతభయోత్పాదకము ! సమాజ మస హ్యపడవలెను. భీతిల్లవలెను. ఇట్టికొలుపులచే రాబోవు అపాయమును గ్రహించవలెను. ఇది యొకచెడ్డ అంటువ్యాధిగా

గమనించవలెను. దీనిని రూపుమాపు సర్వోపాయము లరయ వలెను. హింసాపూజయు నొక పూజ యగునా !

శక్తియనునది సర్వజీవ మాతృస్థాన మలంకరించి వాని వాని కార్యములు నెరవేర్ప సాయపడుచున్నది. శక్తి స్త్రీవాచక మగుటచే దేవీ, మాత, అనుచున్నాము. అట్టిది ప్రత్యక్షమగుచో పాదసేవ చేయుదుము. ఆ దేవీప్రతిమలు నిర్మించి ఆలయములం దుంచినను తల్లికిజేయు సేవవలెనే ఆమె కొనర్పవలెను. ఆమె కసహ్యాకరములైన పనులు చేయరాదు. శుభ్రమగు ద్రవ్యము లనే నివేదింపవలె. జగమంతయు ఒకేరూపుతో ఒకే నామ ముతోనుండవలెను. ఆరాధించుట కంతశ్శక్తి చాలనిచో ప్రతిమా రూపమును సుగంధఫల ద్రవ్యాదులతో అర్చనజేయుట యుక్తము.

పై నుడువంబడిన హింసాపూజను వివరింతును. అది ఎంత హేయమో, అవశ్య విసర్జనీయమో గమనింతురుగాక! అంకమ్మ, పోలేరమ్మ, కట్టమైసమ్మ. గండిమైసమ్మ మొదలుగాగల నమ్మ వార్లను పలువురు బలురీతుల బూజింపుచున్నారు.



సాత్విక పూజ

బ్రాహ్మణులు, వైశ్యులాది శాకాహారులు ఫలపుష్పములతో నారాధింతురు. తదితర మాంసాహారులు [illegible]దజీవులను దేవి ఆరాధనకుగాను బలిఇత్తురు. దేవి జగన్మాత. ఆమె కెటుల మనము పుత్రులమో అటులనే పశువులుకూడ ఆమెకు బిడ్డలే. బిడ్డల నానందాబ్ధి నోలలాడించునది తల్లి. గాని దుఃఖితులఁజేయునది తల్లిగాదు. దయార్ద్రహృదయయగు నాదేవి,

ఎన్నఁడు తనపుత్త్రుల తనకు బలిగా నిమ్మను ననుట వట్టి అవివేకము. భ్రాంతి.

ఎచ్చోట అవిద్యాంధకారమావృతమై యుండునో అటకు అనుమానము, బెదరుదనము బరుగులిడుచుండును. అనుమాన గ్రస్తుల హృదయములు భూత, ప్రేత, పిశాచముల కాశ్రయములు. సుద్దు జెప్పెడి బుడుబుడికివారును, సోదిచెప్పెడి ఎరుకల సానులును, కృత్రిమ గణాచారులును వీరికి గురువులు. అట్టి గణాచారుల ఆవేశ వాక్యములు వీరికి పరమ ప్రమాణములు.



## ఆవేశపరులు

ఆవేశము సాధారణముగా (కృత్రి)మపరులమాట అటుండ

గింపు) పైత్యముగలవారికే కలుగుచుండును. వీరంగవాద్యములోగూడ కొంతపైత్యముగలదు. పంబలవారు పంబజోళ్లతో, కొమ్ములవారు కొమ్ములతో ఆవేశపరు లక్కిరిబిక్కిరి అగునటుల వాయింతురు. అట్టివాద్యములను తెచ్చు దేవీపూజలందు నుపయోగింతురు తత్సమయమున పైత్యాధికులు చిందులు ద్రొక్కుదురు. చిటికెలు వేయుదురు. పండ్లు పటపట గొరుకుదురు. కనుగ్రుడ్లు ద్రిప్పుదురు. శిరమూపుదురు. బుసగొట్టుదురు. పరిపరి విధములఁ బ్రేలాపింతురు. పైత్యరోగము తగ్గనంతవరకటులే చేయుచు నుందురు.

ఇక నా గణాచారులు బలికించు పద్ధతిని గుర్తింతురు గాక. (ధైర్యస్థైర్యములు లేని భక్తులు, భక్తురాండ్రు) వారిపాదములపైఁబడి, తల్లీ! నీవుకాళివా? మహంకాళివా? నీకేమికావలయు? మేఁకలా? గొఱ్ఱెలా? అని వేడుకొందురు. అప్పుడా కృత్రిమ గణాచారులు ఫలానా దేవిననియు, తనను దృష్టిపడుప మేక మున్నగు వానినిఁదెమ్మనియు, అటులఁ గావింపనిచో మిక్కిలి కీడు కలిగింతుమని గడబిడ జేతురు. దాపుననున్న వారందరా మాటలు నిజముగ దేవీ మహిమయని భావింతురు. కాని దీర్ఘాలోచన జేయుచో అట్టి మూఢనమ్మకలు పటాపంచలగును. ఆసమయమున కల్లు కాలుమన్నదనియో లేక బిద్దమాత్రలో బడెననియో, ఆటక్కరి గణాచారులంతో ననుడు. దేవీ ఆవేశ మెక్కడఁబోవునో! ఏమ్మిచు బలాయనమంత్రము బఠింపక మిన్నకుందురా! చూతుము. సత్యమెప్పటికిని మరుగుపడదుకదా! గణాచార, గణాచారిణులు తమకిష్టమైన మేకల, గొఱ్ఱెల గోరు

దుఃరేగాని, కుక్క, నక్కలంగోరరుగదా! ఎందుచేత? తినుటకు వీలు లేమింజేసి. ఇదంతయు రెండంగుళముల నాలుక రుచికై బన్నిన పన్నుగడయేగాని వేరొండుగాదు,

అల్పజ్ఞులగు వారి కేవిపత్తులు వాటిల్లినను, దేవి కంట గట్టుచు, ఆమెను దృష్టిబరచిన, ఆ యావిపత్తులు వారింపబడు నని తలతురు. ఇట్టి వెఱ్ఱినమ్మికల బాఱద్రోలవలెనన్న, విద్యా ప్రచార మత్యంతావశ్యకము. విద్యావిహీనులగు నా సోదరులు కొందరిట్టి మూఢ విశ్వాసములకు లోనయి దేవి పేరిట ఏమియు నెఱుఁగని సాధు జంతువుల బలినిత్తురు. జీవుల నెన్నింటిని బలి నిచ్చినను విపత్పరంపరలు దొలగుననుట కల్ల. "ముడుపు గట్టినపోతు పడకప్రక్కనెయుండ, పాడెగట్టుట మీరు చూడలేదే" అనువాక్య మెల్ల రెరింగినదే. ప్రాణుల వధియించి దేవి కోపానలమునకు గురియగుటకంటె వేరుమార్గ ముఁగనరుగదా. దేవి రక్తపిపాసిని యగుచో బుడమిపై నీప్రాణి కోటి ఎటుల జీవింపఁగలదు? సృష్టి కాధారభూతురాలైనయద్దేవి శక్తిహీనులగు మానవ మాత్రులతో తన కాహారమిడుడని, అను నను టెంత హాస్యాస్పదము! మాయదారుల మాటలనువిని దేవియెడ నింతటియపరాధము మూఢవిశ్వాసులు చేయు చున్నారు.

ప్రాణివధలుచేయుట సంతోషమునకా? లేక, నేరము నకా? సంతోషమున కనిన ప్రాణివధ దుఃఖదాయకముగాక సంతస మెటులగును? నేరమునకనిన ఆ సాధుజంతువు లేమినేర ముఁ జేసినవి? కాలికి ముల్లునాటిన నెంతయో దుఃఖంతుముగదా!

కుత్తుకలు కోయఁబడు నా సాధుజంతువుల కెటుల దుఃఖము, నొప్పి వాటిల్ల దనుకొంటిరా! చావు, దెబ్బ మన కెటు లప్రియములో వానికిని అటులే.

సాధుజంతువుల దేవికి బలియిచ్చు విధానముఁ గాంచుఁడు. దేవీబలికై నియోగింపఁబడిన జీవులపైఁ జల్లనినీరముఁ జల్లుదురు. ఆ వెనుక దేవిమందిరము చుట్టు ముమ్మారుఁ ద్రిప్పి, విగ్రహము కెదుట నిలిపి, నీటిబిందువులను ముక్కులలోను, చెవులలోను విడుతురు. నీళ్లారంధ్రములలో బాగుగా జొచ్చుకపోవుటచే జీవులట్టే నిలువఁబడి యుండుట నటించుచుండును. మరల రెండవసారి మూడవసారి పైవిధముగా వానిపై నీళ్ళు జల్లుదురు. అదివరకు చలిబాధచే గడగడ వణకుచుండు నా యమాయకపు జంతువులు పాపము, చివర నూపిరాడమిచే జలదరించును. పామరు లదిగాంచి, జడతాయించినది, జడతాయించినది. అమ్మ పలికినది. ఆజ్ఞనిచ్చినది. సమయమైనది. ఇప్పుడే, దెబ్బకే, నరకురా, చంపురా, అని వెర్రికేకలు వేతురు. అటు పిమ్మట నా జీవి ఘాతుకుని వశమై కఱకు గరవాలమున కెరయగును. చూచితిరా! మోసకృత్యము. కించిత్తు కరుణగలవారేరైనను దీనిని గాంచి సహింతురా! ఇట్టి ఘాతుక కృత్యము లరికట్ట విద్యార్థు లెల్లరు ముందంజ వేయవలె.

అమ్మవారి పూజా సమయమునఁ బురోహితుఁడు వచ్చి "ఫలం సమర్పయామి, పత్రం సమర్పయామి" అను మంత్రములఁ బఠించుగాని, "మహిషం సమర్పయామి, కుక్కుటం సమర్పయామి" అనుటగలదా! అమ్మవారు (స్ఫోటకము)

బోసినవు డింటికి మాంసము దేనే! కారణము! రక్తము గాంచినచో అమ్మవారి శాంతికి భంగము గలుగుననియే. గృహమందలి అమ్మవారికి రక్తము వలనుపడనపుడు, గుడి ముంగిట నేరీతి జీవహత్యలు చేయనగునో తెలియకున్నది. పరుల బీడించు పాములకు సయితము (నాగుల చవితినాడు) పాలు పోయుదురే! ఇక నెల్లపు డొరుల సేవయొనర్చుచు బ్రతుకు ప్రాణి సముదాయము నెటులు బూజింపవలయునో యోచింపుడు. మాటాడనేరని బిడ్డను మనము ప్రేమించు పగిది జగజ్జనని మూక జీవకోటినంతయు ప్రేమించుచున్నది. ఆమె ప్రేమను బడయవలెనన్న, ఆమెసంతానమును ప్రేమింపవలయు. "అన్యథా శరణమ్ నాస్తి."

సద్గతికి మూలము సాధుసేవ. గాన సాధువుల సేవింపుడు. ఆవేశపరుల మాయమాటలకు లోంగకుడు. రక్తబలుల నిరాకరించుడు. జీవకోటికి నభయ మొసంగి ధన్యులుగండు.

## భీకరబలులు

మదాసుప్రాంతపు దేవీమందిరములందు అవినీతికరములును, భయంకరములునగు హింసాయుక్త పూజలనుగూర్చి ఇంచుక వివరింతును.

మాడంబాకంలో బలిస్థానమున, మేకయొక్క ప్రాణ మొకేసారి దీయక, పొట్టచీల్చి అందుండు ప్రేవులను బయటికి దీయుదురు.

భాయావరంలో చూడిదగు మేకపొట్టచీల్చి, అందుండు శిశువును దీసి దేవికి నివేదన జేతురు.

తిరుచరాపల్లిలో మేకపిల్ల గుండెను దంతములతో నొక్కి చీల్చుచు రక్తముం బీల్తురు.

వెంగన్నపల్లిలో దేవీమందిరముముంగిట గున్నపోతు కంఠము కత్తితో వేరుపరచి, రక్తము గిన్నెలోనింపి త్రాగుదురు.

మూడుబిట్టినుంగళంలో దున్నలను దేవీమందిర ప్రదేశమున ఒకచో గట్టివైచి, నరుసగా వెన్నోట్, వాద్యాల లయ ప్రకారముం జిదుకం దొగ్గుచు నరికివేతురు.

ముప్పేడులో దున్నలను లోతైనకందకములో దింపి, ప్రాణములు పోవునంతవరకు బల్లెముతో దేహమంతను (చిత్రవధ) పొడుచు చూతురు

అనకాపల్లిలో సూకరములయొక్క నాలుగు కాళ్లం ద్రాళ్ళతో గట్టి నిలువంబెట్టి పదునగు సన్నని బల్లెములతో గుద స్థానమునుండి ముఖస్థానముం జేరుపర్యంతము గుచ్చుదురు.

వృద్ధాచలము నందు దేవీ ఊరేగింపులో పందిపిల్లలను బల్లెములకు గుచ్చి పైకెత్తుకొని తిరుగుదురు.

తిరునెల్వేలి జిల్లాలో నొకగ్రామమున బల్లెములను భూమిపై గుచ్చి, పందిపిల్లల నెత్తుపదేశమునుండి దిగవేతురు.

పూవమ్మాగులో నాలుగుకాళ్ళను బంధించి మేకయొక్క కంఠమును, వక్రమగు ఉలితో కొయ్యపై రంధ్రము బొడుచునటులం జెక్కుచు జంపుదురు.

## విద్వాంసులు, పండితు లిచ్చిన అభిప్రాయములు.

శ్రీ మోహనదాస్ కరమ్‌చంద్ గాంధిజీ:—"ఏకారణము చేతనైనను జంతువులఁ జంపుట నాకమితమైనబాధ కలిగించుచున్నది. మఱియు మత మను మిషచే జంతువులఁజంపుట మిగుల ఘోరమైనది. అట్టి జంతువులఁజంపు దురాచార మనాదిగా హిందువులయందు వాడుకలో నుండుసంగతి నేనెఱుఁగుదును. అట్టి బలి మతవిరోధ మైనదని నాఆత్మ చెప్పుచున్నది. నా పలుకులవలన భారతీయులం దొక్కఁడైనను అట్టి పాపభూయిష్ఠమైన బలినుండి త్రిప్పగలిగిన నేను మిక్కిలిసంతసింతును."

పూజ్యులగు శ్రీ చిదానందజీ బరోడా:— "మాఆశ్రమములో హింసయను శబ్ద ముచ్చరించుటగూడ పాపమని యెంచబడునపుడు పశుబలి విషయమై నేనేమి మాట్లాడగలను?"

శ్రీమజ్జగద్గురు శంకరాచార్యులు, పూజ్య శ్రీ మధుసూదన తీర్థస్వామీజీ—గోవర్ధనపురి:—"దేవి పేర బలినిచ్చుట శాస్త్రవిరుద్ధము. మూఁగపశువులను స్వార్థముకై వధించుట అధర్మము. క్రూరమగు నీచకార్యము."

శ్రీ ద్వారక శారదా పీఠాధీశ్వర జగద్గురు శంకరాచార్య శాంత్యానంద సరస్వతీజీ:—"సమస్త చాతుర్వర్ణ్య ప్రజలకు గురుస్థానమునుండి ఆజ్ఞాపించబడునదేమనగా: సనాతనవైదిక ధర్మమందు అహింస పరమధర్మము. దీనిని పాలించుట మనకుముఖ్య కర్తవ్యము కాబట్టి ఈ అహింసా ధర్మమును మీరందరు హృదయ పూర్వకముగా పాలింతురుగాక."

శ్రీమాన్ మాధవగౌడేశ్వరామ్నాయాను యోగకృతః శ్రీమధుసూదన గోస్వామిజీ:—"అనేక మంది మాంసాహారులు, నిర్దయులు ధర్మశాస్త్రమును నెపమున పశుబలిచేయవచ్చు నని ఉపదేశింతురు. కాని వైదికధర్మగ్రంథములలో ఎక్కడనూ పశుబలిచేయుమని వ్రాయబడ లేదు."

పూజ్యపాద శ్రీమాన్ గోస్వామిజీ, వల్లభాచార్యజీ:—"ఇప్పటిదినములలో దేవీదేవతలపేరిట జరుపబడు జంతుహింస పూర్తిగా తప్పుకార్యము. శ్రీమద్భగవద్గీత మొదలగు గ్రంథములందు అహింసావిషయమగు ప్రమాణములు వేలు దొరుకుచున్నవి."

పూజ్యపాద గోస్వామిజీ శ్రీగోకులనాథజీ:— "ఈకాలములో అధర్మప్రచార మభివృద్ధిగాంచుచుండుటవల్ల, కలియుగ మాయచేత జనులు యథార్థమైన వేదమార్గమునుతప్పి, తమకుం దోచినమార్గమున నడచుచున్నారు. నాలుక రుచి మరగినవారై దేవీదేవతలకొరకని జంతువులం జంపి, తమపొట్టనింపుకొనుచున్నారు. కాని సనాతనమగు వేదమార్గమందు హింసను ధర్మకార్య మని ఒప్పుకొన్నటుల లేదు."

న్యాయమూర్తి శ్రీ యుత గురుదాస్ వంద్యోపాధ్యాయుఁడుగారు:— "దేవీదేవతలకొరకు పశుబలి నివ్వనక్కరలేదని నేను స్వయముగా నాయింటియందు ఈదురాచారముమానితిని."

శ్రీమత్పర మహంసపరి వ్రాజకాచార్యవర్య శ్రీ జగద్గురు శోధనానందస్వామిజీ:—"నాప్రియమైన శిష్యకోటికంత కునుపదేశించుచు నివ్వబడుఆజ్ఞ ఏమన? దేవతలకై చేయఁబడు

పశుబలి ధర్మసమ్మతముగాదు. నిరపరాధులగు ప్రాణులను దేవ దేవీమందిరముల నెదుట వధించినచో దేవతలు ఎన్నడును సంతసింపరు. ఒకప్పుడు దేవి పలికిన పలుకులు గమనించుడు. ఎవరైతే పశువధా రూపమగు బలినిచ్చుట, నాపూజయని ఎంచురో, అట్టిది విధిపూర్వకము గాకపోవుటవలన దుర్గతిని పొందుదురు."

వేదశాస్త్రోపాధ్యాయులగు శ్రీమాన్ శాస్త్రీ శివరామ్ గోరే బొంబాయి:—"హింస లేక పశుబలి వేదాధారముచేగాని నైతికముగాగాని ఉచితమగు కార్యముగాదు. దీనికొరకు కావలసినన్ని ప్రమాణములు నేను చూపగలను."

ఇటులు సర్వవిజ్ఞానసంపన్నులగు పండిత ప్రకాండులు తమ చిరకాలానుభవముచేతను, ఉత్తమగ్రంథావలోకనముచేతను పశుబలిని నిషేధించుచుండ, విద్యాశూన్యులును, అనుభవరహితులునగువా రట్టి కార్యములు శ్రేయోదాయకము లని నమ్ముచు, నాచరించుచుండు టెంతయు ప్రయోజనకారి గాదు. మహనీయుల యాదేశంబు లెట్టివారికైనను సర్వదా మార్గదర్శకములుగా నుండును.

---

# అహింసాపుష్పగుచ్ఛము.

సర్వమాన్యశతకము - పండిత సోమనాథరావుగారు,
సికింద్రాబాదు.

సీ॥ వేర్వేరురుచులచే విందులు గొలిపెడు
పలుతెరంగుల మంచిపండ్లుండ
దలచిన నోరూరు తాలింపులకు జాలు
గణనకు మీరు శాకంబులుండ
దినమొక్క దినుసుగా దనియింపగల మేలు
పలుపాకంబుల పిండివంటలుండ
గరగర గరగిపో వరుగులు వడియాలు
కడు చవిగల యూరగాయలుండ

గీ॥ పాలుపెరుగు సమృద్ధిగా బరగుచుండ
గనికరము మాలి మాంసంబు దినమరగిన
క్రూరమతికేల నీ భక్తి కుదురుటేల
సకలకల్యాణగుణధన్య! సర్వమాన్య! ॥

## జీవకారుణ్యము

విద్యానిధి - కానుపల్లి శివరామదాసుగారు.B. A. (సేలము)

సీ॥ క్రొత్తగావచ్చిన యత్తద్దినమంచు
తిత్తుల సారాయి దెచ్చునొకడు
అందులోనికి నంజుడనుకూలమటంచు
కోడిపెట్టలబట్టి కోయు నొకడు

మాతాతనా డది మర్యాదటంచును
మేకతలలంబట్టి మెక్కు నొకడు
పాతానిగురువుల చేతితీర్థంబాని
ప్రీతి సారాగ్రోలి పేలు నొకడు

గీ॥ వీరలట. అసదాచార ధీయులరట
నీతి కోవిదులట, మహనీయులరట
సూరి జనులార! వినరయ్య! చూడరయ్య!
కటకటా కాలమహిమలఁ గాంచరయ్య! ॥

## "అహింసా పరమో ధర్మః"

(మాకం తిమ్మయ్య శ్రేష్ఠిగారు మద్రాసు)

సీ॥ అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుఁడైన
దేవుఁడే మనతండ్రి దెలియరయ్య
సర్వజీవులు వాని సంతాన మనుమాట
నెమ్మదిలో మీరు నమ్మరయ్య
పరమకారుణ్య సంభరితమానసమున
జీవ జంతువులను బ్రోవరయ్య
ధరణి నహింసయే పరమధర్మంబను
ధర్మవాక్యంబును దలపరయ్య

గీ॥ దేవతావాసమైన యీ దేశమందు
వలదు రాక్షసాచారంబు దెలియరయ్య
పుణ్యధనులార! మీ మనస్స్ఫూర్తిగాగ
మాంసభక్షణ మికనైన మానరయ్య!

సీ॥ శుచియనియందుమా శుక్లశోణితములు
గలసి యసహ్యమౌ పలలకణము
రుచియనియందుమా రోతగల్గించెడు
వెగటుగుణంబుండు తగనికంపు
అగ్గువయందుమా అన్నిశాకంబుల
కన్నను వెలకు హెచ్చైన ముఱికి
గొప్పయటందుమా కుక్కలునక్కలు
బోరువలే దాని సారమెరుగు

గీ॥ నేడుఁజూచితిరో ధర్మమెంతచేదొ
ఏమికరుణవహింపరో ఎఱుగరాదు.
వికటవాదనల్ సేయక విమతులార!
మాంసభక్షణ మికనైన మానరయ్య!

సీ॥ నీటిలో దిరుగుచు నిగనిగలాడెడు
చేపలు మనకేమి చెరుపుఁజేసె?
గడ్డిగాదము దిని బిడ్డలవలెనుండు
పొట్టేళ్ళు నేమి పోరుగలిగె?
గళ్ళలు మ్రింగుచు తెల్లవాగుటదెల్పు
కోళ్ళుమనకెగ్గు గొంతజేసె?
నడవులలో తృణాహారులై తిరుగుచు
కుందేళ్ళుజింకలే కుందుఁదెచ్చె?

గీ॥ నిరపరాధులకంఠముల్ నఱికి వాని
ముఱికిదినుటకంటెను మేలు మరణమైన
కరుణగల్గిన సన్మార్గ చరితులార!
మాంసభక్షణమికనైన మానరయ్య!

సీ॥ అపకారమెంచక యుపకారమే చేయు
దున్నపోతును బట్టి దోషమనక
వేపమండను గట్టి వీధుల ద్రిప్పుచు
నించుక దయలేక యీడ్చి తెచ్చి
గంగమ్మ యెల్లమ్మ గారి నాంచారమ్మ
హాళి హాళీ యంచును బొబ్బలిడుచు
ఆసాది మూకలు నార్భాటములు సేయ
నటికరా యని యొక్కఁ డరచుచుండ
గీ॥ సెలవ సెలవా యనుచు కత్తి చేతబట్టి
యొక్క వేటుకు మెడఁదెగి యుర్విఁబడగ
నరికినైతు రీ ఘోరమెన్నంగ దగమె
జీవబలి మానుడో దయాసింధులార!
"సీ॥ చిన్నపక్షిని గావ చేజేత కోసవేను
చెండియిచ్చిన శిబి చెన్నెరింగి
అడుగిడలేక సుర్రెక్కడు మేకపిల్లను
భుజముపై మోచిన బుద్ధుదలచి
స్వల్పజంతు వటంచు నల్పమూనక యుడు
తన ప్రోచు శ్రీరాము నెనరుఁజూచి
కుక్కనుదివి జేర గొనిపోవ ఘనకీర్తి
బట్టిన ధర్మజు పట్టెరింగి
గీ॥ కరుణగల్గదో! మదికింత వెరపు లేదో!
పిరికిజీవులకంఠముల్ దరుగనేల?
వికటవాదనల్ సేయక వివతులార!
మాంసభక్షణ మికనైన మానరయ్య!"

సీ॥ పూర్వకర్మంబున బుట్టిన వ్యాధుల
నను భవింపక తీర దన్నలార!
ఔషధంబుల వెన్నో యలరుచునుండగ
రక్తపాతమున శాస్త్రమేల!
ముడుపుఁగట్టినపోతు పడకపోయిన నెఱుంక
పాడెగట్టుట మీరు చూడ లేదె!
పోవుమానవుఁడెట్లో పోవుచుండగ వృథా
సాధుజీవులబట్టి చంపనేల!
గీ॥ మూఢనమ్మకములతో మిమ్ము మోసగించి
నరకమునకీడ్చుచుండగ నెఱుగ లేక
పశుహింసలఁ జేయఁగ పాడియగునె
జీవబలిమాను డో దయాసింధులార!

సీ॥ జ్ఞానార్జనమునకేగాదె జీవించుట
జీవించుటకు మంచిగుణముగలుగు
శాకఫలంబులు స్వాద్వన్నములు పిండి
వంటలు, పచ్చళ్ళు వాసికెక్కు
పాలు పెరుగు నెయ్యి బంకరమౌ నర్గ
గడ్డలు మరి కంద గడ్డలుండ
కూరిరపు నెత్తురుకూటిని గోరుట
మానవజాతి కిమ్మహి నిదగునె
గీ॥ కూరగలేకున్నచో మంచి నీరెచాలు
ధర్మమనుస్మృతితోడ నీశ్వరుని నొక్క
నిమిషముండుట పదివేలు విమలులార!
మాంసభక్షణ మక్కటా మానరయ్య!

సీ॥ జీవహింసలఁజేయు చేతులెట్లాడెనో
బుద్ధునిగన్న యీ భూమియందు
రక్తంబుఁద్రావ నాసక్తియెట్లాయెనో
పరమర్షులున్న యీ ధరణియందు
ఘనభూతములగొల్వ మనసెట్లుగల్గెనో
శ్రీరాముఁడున్న యీ సీమయందు
మూఢనమ్మకములు పోవకెట్లుండెనో
బ్రహ్మపదంబిచ్చు భరతభువిని
గీ॥ మ్లేచ్ఛపాషండబుద్ధుల మిళితపరచి
నరకులయు ధర్మమేమందు రరరె! సుంత
భయముగల్గదో యీలాగు పల్కుటకును
జీవబలి మానుఁడో దయాసింధులార! ॥

శ్రీయుత కొత్త వెంకట సుబ్బరాయగుప్తగారు

సీ॥ పందిమాంసము దినవాంఛ గల్గియుమీకు
వచియించు బుడునీకివానిపల్కు
మహిష మాంసముదిన భ్రాంతిగల్గియుమీకు
వచియించు మాదిగవానిపల్కు
గొఱ్ఱెమాంసముఁదినఁ గోరికజనియించి
వచియించు పంబలవానిపల్కు
కుక్కుటపలలంబు కుడువభ్రాంతిని మీకు
వచియించు జావలదాసిపల్కు
గీ॥ లన్నియు నిజములని మీరలాత్మనెంచి
పంట సిరులనుజేర్చెడి పశువులందు
దయనుజూపక యిట్లు నిర్దయ వహించి
బలులొసంగుట తగునే? యో బాబులార!

సీ॥ మహిషంబులనుదెచ్చి బలియొసంగుడునాకు
నను చు పోలేరి మిమ్ము డిగెనయ్య
గొఱ్ఱెపోతులదెచ్చి కోయుడు నాముంద
రనుచు మాంకాళి మిమ్మడిగెనయ్య
కుక్కుటంబుల నిప్డు జక్కాడు డనుచును
మారిదేవత మిమ్ము గోరెనయ్య
సూకలమ్మను నేను సూకరంబుల నీవు
నారగింతునటంచు నడిగెనయ్య

గీ॥ అడిగినేచూడు మీరింత వెఱగులయ్య
పశువులను మేయు దేవత మానవులను
మేయకుండునె? మీరిట్లు బేలలగుచు
బలులొసంగుటతగునె? యోబాబులార!

భూతదయ – ఎ. నారాయణరాజుశర్మగారు. కొడికొండ.

సీ॥ ధనికుల మనువారు దండిగా నున్నారు
పశువుల మొరవినువారు లేరు
భక్తులమనువారు పలువురున్నారలు
పశువుల మొరవినువారు లేరు
వీరులమనువారు వేనవేలున్నారు
పశువుల మొర వినువారు లేరు
గురువులమనువారు కోటులున్నారలు
పశువులమొర వినువారు లేరు

గీ॥ దీన పశువుల మొర వినలేనివారు
ఎన్ని బిరుదుల వారైన నేమి ఫలము?

ఈశ్వరా! నీవె పశుల రక్షింపవలయు
నీవెయందరిమది దయ నింపవలయు ॥

సీ॥ పశులపై మనదయన్ బ్రసరింపజేసిన
విరివిగా వర్షముల్ గురియగలవు.
పశులపై మనదయన్ బ్రసరింపజేసిన
పంటలు దండిగా బండగలవు
పశులపై మనదయన్ బ్రసరింపజేసిన
బాడి సమృద్ధిగా బరగగలదు
పశులపై మనదయన్ బ్రసరింపజేసిన
స్వాయురారోగ్యంబు లబ్బగలవు.

గీ॥ పశులపైనెంత మనదయ పర్వునంత
ఈశ్వరునిదయ మనపయి నెసగగలదు
పశువులనుగావ మనకు శుభంబుగలుగు
మిత్రవరులార! భారతపుత్త్రులార!

సీ॥ అతిఘోర మృగరాజు లందుమా యవిమైన
చేయనికృత్యంబు చేయవెపుడు.
అతిదుష్టభల్లూక మందుమా యదిమైన
చేయనికృత్యంబు చేయదెపుడు
అతిక్రూరవ్యాఘ్రంబు లందుమా యవిమైన
చేయనికృత్యంబు చేయవెపుడు
అతిరోషసర్పంబు లందుమాయవిమైన
చేయనికృత్యంబు జేయవెపుడు

గీ॥ అహహా ఆకారమును జూచినఁ బసులవలెనె
మదికిఁ గన్పట్టు. నిక్కంబు మనుజులైన
జేయరానట్టి కర్మల జేతు రెపుడు
నరయ నరరూపు దాల్చిన పసురులకట!॥

పశుసంరక్షణ నందిరాజు చలపతిరావు గారు. ఏలూరు

సీ॥ కనకాభిషేకంబు గావింపు మనవని
యూరకున్నబ్రిదుకు పూరి మేసి
మెడ మట్టు గొలుసులు పడయ గాగోరవు
విడిచి పెట్టిన భయపడక బ్రిదుకు
కనకపు సౌధముల్ గావింపుమనవని
పల్లె లగూండ్లలో పోయి బ్రిదుకు
నీళ్ళలో తెప్పల నిర్మింపు మనవని
వీటబుచ్చవి యెడ నేటబ్రిదుకు

గీ॥ గహనమున జీవమిచ్చు వృక్షముల పాటి
సాగరంబున బ్రిదికించు సలిలముల్లు
జంతువులబోలిన నేరవిజన్మమేల?
సాధుసంరక్షబూను డో జనములార!

సీ॥ భారతమాతకు పరమతనూజులై
పీనుగులను దిను పీడబుద్ధి
భారతమాతకు పరమసుపుత్రులై
పశుల భక్షించెదు పాడుబుద్ధి

భారతజననికి కూరిమిబిడ్డలై
చెరబెట్టిహింసించు చెడ్డబుద్ధి
భారతమాతకు పౌరుషలినయులై
శిరములుఖండించు క్రూరబుద్ధి

గీ॥ యెట్లుచేకూరెను? వివేక మెటులబోయె?
భరతమాతరో! నీకైన కరుణరాదె?
నీసుతు లక్రూరకర్మల నిలుపవమ్మ
అనుదినము నిన్ను బ్రార్థింతు మధికభక్తి.

## గోపరిపాలనా మాహాత్మ్య దర్శము

సోమరాజు వెంకటసుబ్బరాయకవిగారు, విజయవాడ.

సీ॥ దారిద్ర్యమెడబాపి ధనవంతునిగ జేయు
నయముగా గోరక్షణంబుతోటి
పాపంబులెడబాపి పరమపావనుఁజేయు
నయముగా గోరక్షణంబుతోటి
చింతలబోద్రొట్టి సంతోషయుతు జేయు
నయముగా గోరక్షణంబుతోటి
రోగముల్మాన్పి భోగవంతుని జేయు
నయముగా గోరక్షణంబుతోటి

తే॥ గీ॥ ద్వారకానునపాటి తల్లక్రిందుగ తపంబు
జేసినను యజ్ఞయాగదీక్షా సదోప
వాస జప నిత్య హోమ నిష్ఠా సమాధి
దానహాయమేధముఖరసత్కర్మములకు :

పుష్పాంజలి- వెలగలూడి దానయ్య- తాదరిగాడు

సీ॥ చదలఁ గ్రుమ్మరు పక్షిసంతతి నొప్పికార్ప
సృష్టించితిరిగదా శితశరాళి
వడవులలోఁ దిరుగాడు జంతులఁజంపఁ
గల్పించితిరికదా కడఁగిమాటు
నీటియందలి మత్స్యనికరము వ్యధియింప
గడియించితిరిగదా గాలములను
కలుగులఁజరియించు నెలుక మూకనుగూల్ప
గూరిచితిరిగదా గునపములను

గీ॥ జిగురుగండెలు బోనులు చెడుగు మందు
లురులు నార్జించితిరిగదా తీవ్రముగాను
అకట యీపాడుపొట్టకై యన్నలార!
క్రూరమతి నిట్లు ప్రాణులఁ గూల్పనగునె?

సీ॥ అరయ నీశ్వరదత్తమగు పదార్థమె కాని
కొనరి వేరెద్ది యుమెపవబోవు
సద్భావమున సదా సంచరించుటె కాని
యేమాయమర్మంబు లెరుగబోవు
తమకపాయముగల్గ తప్పించుకొననెంచు
టేకాని ప్రతిసేయనెంచబోవు
కఱవుకాలములోన గతినెంచుటే కాని
కూడఁబెట్టగ దేవులాడబోవు

గీ॥ కటకటా యిట్టిజంతుల కంఠములను
క్రూరముగ గోసి తిందురే కోర్కెమీర

కటికిహృదయాలె? యిసుమంతకరుణ లేదె?
"యాత్మవత్సర్వభూతాని" యనగవినమె?॥

సీ॥ శక్తిపూజలటంచు భక్తి మూలకునెట్టి
పీతిమైబొట్టును బెట్టికొంద్రు
సోమయాజులమంచు పేరు బొంగ ద్రోచి
వేడ్కతో బొట్టును వేసుకొంద్రు
ఔషధంబని బొంకి యజ్ఞయస్యాయువహించి
యింపుతో నుదరంబు నింపికొంద్రు
తండ్రితద్దినమంచు దయవీడి క్రూరులై
తీరుగానాకలి దీర్చుకొంద్రు

గీ॥ పాపమతులార! యిదియెట్టి పాడియయ్య!
పాడుపొట్టకునై యిన్నిపాట్లుదగునె?
తోడరి కృపవీడి సాధుజంతువుల౯జంపి
తినుటకంటెను వేరొండు తినగరాదె?

సీ॥ వేషంబులెన్నియో వేయగానేర్తురు
మానితంబగుకీర్తి బూనరేల?
పలువిధంబుల వ్రతమ్ములు సల్పనేర్తురు
హింసావ్రతముమాట నెంచరేల?
ముల్లునాటినయంత మూల్గుచు నేడ్తురు
జంతుసంతతిగూల్ప జంకరేల?
శ్రీరంగనీతులు చెప్పగా నేర్తురు
మాంసంబుదినుటను మానరేల?

గీ॥ అకట! యిదియెట్టి వర్తనం? బన్నలార!
దయవహించి యహింసావ్రతంబుపూని
మాంసభక్షణమును జేయమానుడయ్య!
చెలగి యెంతయు సుగతి నార్జింపుఁడయ్య ॥

జీవకారుణ్యాచరణ—ఉపదేశకుడు జ్యోతి శ్రీరామలింగస్వామి
అనువాదకుడు-టి. వి. మునుస్వామి (మద్రాసు)

సీ॥ ధరనసంఖ్యామ్మెత్రి ధరకు హెచ్చైనట్టి
మాంసభక్షణమేల మానరాదు?
మాంసభక్షణమును మానని వారంత
మావారుకారని మది తలఁతుము
జీవహింసఘటించి జీవించువారలు
చెందరు మోక్షంబు చేరి నిజము
మాంసభక్షణచేసి మార్జాలశునకముల్
మాత్రమె మేనుల మునికెగలిగె

గీ॥ అశ్వగజపశులేభక్ష్యమూడిబలిసె?
బలము జ్ఞానమువలె నన్న భక్ష్యశాక
కరుణవహియించికంత యుల్ తరుగనీకు
జీవహింసను నికమీద చేయబోకు ॥

సీ॥ అర్థంబువేడెను నర్థులుగలసుగా
కంగంబు వేడెను నర్థిగలఁడె?
తగఁగోరికలనిచ్చు దాన శీలుఁడుగల్గు
దనదేహమీనేర్చు దాతగలఁడె?

యీనేర్చువాడు దన్నిచ్చినరోయుఁగా
చంపెడునట్టి యాచకుఁడుగలఁడె?
చంపియుఁబోవక శల్యంబులన్నియు
నేరిపించుకపోవు వాఁడుగలఁడె?

ఆ॥ వె॥ రమణలోకమెల్ల రక్షించువారికి
హింససేయుబుద్ధి యెట్టుపొడమె?
ఖ్యాతిమైనయట్టి ప్రాణంబుపై దీసి
తమకుఁబోలెనెదిరిఁ దలఁపవలదె?

గోవు— శ్రీ. యస్. ఆర్. రావుగారు

సీ॥ సదయులౌ నరులార! ముదముతో గోమాత
గాంచరే ప్రణతులర్పించువాడ
చండాలసోదరా! చంపకుమా తల్లి
బ్రోవవే నీకెంతో పుణ్యమబ్బు
తురకసోదరులార! దుష్కృత్యములు మాని
రక్షింపరండు గోరాజునింక
దివిజులారా! మీకిదే నమస్కారంబు
యజ్ఞాల కోయకుఁడయ్యదీని

గీ॥ మహిత శోభాయశస్సుల మాన్యులార!
గోపురక్షణశాలలు కొల్లలుగను
స్థాపనమొనర్చి కాపుడీ సౌరభేయి
ఇహాపరంబుల సౌఖ్యంబు లెంతురేని॥

గోరక్షణావశ్యకత:—శ్రీయుత భమిడిపఱ్ఱి రామమూర్తిగారు. కాకినాడ

సీ॥ గోరక్షకులటన్న కొంపకీర్తిపోయి
గోహంతకులనెడు గోడువచ్చె
విమలమౌ పాల్పోయి పరదేశకృత్రిమ
పాలడబ్బాలు సంప్రాప్తమయ్యె
సతత సంపద్విరాజితులను పేర్పోయి
క్షామపీడితులను నామమబ్బె
భూతదయాళురన్ పోడిమితరగి హిం
సకులను దుష్కీర్తి సంతరించె

తే॥ గీ॥ మాన్యులు కృతజ్ఞులను పేరు మాసిపోయి
దనుజులు కృతఘ్నులను పేరు వినగనయ్యె!
భారతీయులకకట గోప్రాణరక్ష
ణం బొనర్పని కతన క్షీణదశవచ్చె! ॥

సీ॥ వట్టిపోయిన గొడ్డ వంకనేనియుజూడ
నొల్లని వారుండకుందురుగాక!
కటికవారలవిచ్చు కత్తులకున్ దమ
గోవులనర్పింప కుంద్రుగాక!
వృద్ధాప్యమొంది యోపికలేకపడియుండు
గోవులనైన సాకుదురుగాక!
మాటాడలేని యమాయక గోవుల
నూరకే బాధింప కుంద్రుగాక!

తే॥ గీ॥ గోపరిభావంబు సెటిగియు, గోవుపూజ
సలుపుచుండి భూతదయయు, గలిగి సుఖము

బడసి, నిత్యకళ్యాణముల్ పచ్చతోర
ణముగ మనెదరుగాక నిత్యము ధరిత్రి॥

గోకావ్యము – శ్రీమాన్ కాండూరి కృష్ణమాచార్యగారు.
గూడూర్.

సీ॥ గోభూములను దున్న గోష్పాదమంతయు
బీడు లేనట్టి యా గోడుకతన
నావులపాలన్ని, వంగళ్లు పాల్సేసి
చిల్ల సొత్తు లాసించుకతన
వృద్ధోక్షములుచాల వివిధవిధంబుల
నూదనాపణముల జొచ్చుకతన
సోమరితనమునం జూచి చూడికయూల
మందలు పాడయినందువలనం

తే॥ గీ॥ బంట లారోగ్యములు తగ్గ బ్రబలె ఋణము
వైద్యశాలలు పాపము వాసికెక్కెం
గానం బ్రత్యక్షలక్ష్మల గాంచినట్లు
గోవులను దేవతలనెప్డు గొలువరయ్య !

పశుసంరక్షణము — శ్రీనందిరాజు చలపతిరావుగారు (ఏలూరు)

మ॥ కరువుంగాలమునాక పత్రిశ్యహా మసంఖ్యాంబూని నీకోసమై
ధరణిన్ సస్యఫలాఢ్య జేయుమ బయోధారల్ బ్రవర్షించిభూ
ధరశృంగంబుల గడ్డిమేసి బరువుల్ పాల్కాలకే మోపి ప్ర
వ్యక్రమాసేవయొనర్చు జంతువులపోకార్చంగ ధర్మంబొకో?

మ॥ పవిత్రోఁజేసి రే నీవుగుండియ? లవహో పాపాత్మ! నీహస్తమం
దు విషంబుంచిరె నీదుమానసము? జంతువ్రాత విద్రోహకం
బవుగాతమ్మని వ్రాసినాడె? విధి యిట్లు శ్రాంతమావృత్తిమా
నవుధర్మంబు దలంపబోవకట! జన్మంబెత్తినా వెందుకో?

మ॥ నరజన్మంబుననుండి యేసుగతి సంపాదింప లేనంటి వా
భరమై, కర్మనిబద్ధమై వికలమై స్వాతంత్ర్యరాహిత్యమై
గురుదుఃఖాంచితమైన జన్మములు నీకున్ మోక్షమిప్పించునా?
తెలివా! గోవును పూజచేసి గనుమర్ధిం ముక్తిప్రాప్త్యాలకే?

ఉ॥ ఒప్పునె సాధుజంతువుల నూరక గొంతులు గోయుచుఁ బ్రేమముం
దప్పుచు నీ తీసుతుల దారుణఖడ్గము వాలు సేయగా
జొప్పడు దే? కృపారహిత! చూడవు ధర్మము నీకనుల్ పాకల్
గప్పెనె? బుద్ధి తప్పెనె? వికారపుకృత్యము మానవకటా!॥

శా॥ నోరా లేదడుగంగ మహీజనులకన్నుల్ బ్రాయుకాపట్యపుం
దీరా నేర్పవు పాదశృంగముల మర్దింపందగన్ దౌష్ట్యపుం
బేరా మెత్తవు సాధుజంతువులు వీపుం దెబ్బలు నేయుంగటా!
వేరా! పెత్తనమా! యిదేమిపరువా! పీవోఘ్నహింసించుటల్॥

మ॥ పరమామ్నాయము చెప్పుబోధలను సంభావించి యోజించుడీ
కరుణాసాగరులార! మొక్కెదను దీక్షంబూనుడీ, జంతుర
క్ష రహింజేసి మహోపకారము ప్రసంగన్ దాల్చి వర్ధిల్లుడీ
హార్దిపద్మాసననీలకంఠులొగి నిత్యంబున్ మిమ్ముఁ బ్రోచుతన్॥

శ్రీ జంగా హనుమయ్యాచౌదరిగారు (అష్టావధాని)

కం॥ మాంసము బలకరమంచున్
మాంసము రుచ్యంబటంచు మరిగెదవే నీ
మాంసము కై పరమాంసము
శంసింతువె? నీవు క్రూర శార్దూలమవే?

జీవకారుణ్యము— శ్రీ. విద్యానిధి కారుపల్లి శివరామదాసు
బి. ఏ. గారు. (సేలం)

కం॥ వ్రతములలోపల నుత్తమ
వ్రతంబహింసావ్రతంబు వాస్తవమిది స
ద్వ్రతులగు మునివర్యులభి
మతము నిరంతరము దీని మరువకు మనసా! ॥

కం॥ కూర్మి "నహింసా పరమో
ధర్మం" బని వేదవాణి దనరం దెలుపు నా
ధర్మమును బాటిఁ జేయుము
నిర్మల గతికదియె బాట నిజముగ మనసా! ॥

కం॥ జంతువులను హింసింపకు
మెంతయు నీచేతగాదు హింసించిన యా
జంతువుల ప్రాణ మొసఁగను
సంతతము నహింస నిష్ఠ సలుపుము మనసా! ॥

కం॥ జీవములో మనవలెనను
భావము జంతువులకెల్ల బాగుగ గల దా
భావము నించుక దలంచి సు
భావముతో నుండు మదియె భాగ్యము మనసా! ॥

కం॥ రక్తాశనముంగోరక
భుక్తికి ధాన్యములఁగొంచు బొందుగ ధర్మా
సక్తిని నుండుమిదియె స
ద్భక్తులు బోధించు దివ్యపాఠము మనసా!॥

కం॥ హింసలను గోరవె నీవిల
నతులితముగ నట్టిహింసల నదియును గోరున్
హితమాచరించుచుండుము
సతతము సంతసముగల్గు సత్యముమనసా!

భూతబలి– మందరపు చిట్టిపాప యాచార్యులుగారు.
కట్టా సూర్య నారాయణాచార్యులుగారు.

శా॥ కట్టా! యేమిది భారతావనికి దుష్కాలంబు చేకూరెనే?
పట్టున్ శాంతదయానుశీలములు లోపంబై విదృంభించె తా
మెట్టీ పాపభవాబ్ధినాటగలమో యంచెంచకే జీవులన్
పొట్టల్ప్రేల్చుచు దేవతాళికిను టే పుణ్యంబొ? యోచింపుడీ!

మ॥ సరిగా జ్ఞప్తికిదెచ్చుకొండు పవిత్రు లే చందానశాసించెనో
పరమాత్ముండు సృజించు జీవతతి నీ ప్రాణాంబుతో తుల్యమా
కరణింగావుమటంచుఁబల్కుటయిటులా కారుణ్యముందప్పియున్
బరిమార్పందలపోయు టెంతటి మహాపాపంబొ యోచింపుడీ!

మ॥ ధరణిన్ శాస్త్రములుం బురాణములు వే దంబుల్ మహా
పాప మే
కరణిం జీవులఁజంపరా దనుచు నిక్కంబైన సూత్రాళిచే,
పరిపూర్ణ స్థితిబోధచేసినను నీ భావంబు దుష్కర్మలం,
గురిగావించుట దేవతాళికిబలు ల్గూర్పంగ ధర్మంబొకో!

చ॥ మనకు శుభంబుగల్గ నయమార్గగతిం జరియించు సాధుజీ
వనులగు కోళ్ళ గొఱ్ఱెలను చహ్వారె! మేకలఁ జంపి వాటిచేఁ
ఘనమని దేవతాళికిటు గాన్కలు బెట్టి మహాపవిత్రపుం
దినమున వేయు జన్మముల దీరని పాపము దెచ్చుకొందురే ?

చ॥ బలు లను పేరజంతువుల బట్టి శిరంబులగొట్టి వాటినిఁ
ఖలమతులౌచు నెల్లు దిన గల్గుచునుండిరొ! రామరామ! మీ
తలపుల జాలిలేనపుడు దైవమటంచును మూఢభక్తితో
గొలచిన రాయి రప్పలెటు గోర్కెలొసంగునొ? యెంచి
చూడుడీ॥

చ॥ ఫలములు లేవె? జంతువుల బట్టివధించినగాని దేవతల్,
తలపులదీర్పరే? భువిని దైవమె ప్రాణులబట్టి మ్రింగిరేఁ
కలియుగమాగ నేర్చునె? యఘంబుదలంచక నీచులెవ్వరో
పలలము మెక్కఁగోరియిటు బన్నినతంత్రముగాదె చూడఁగఁ॥

మ॥ చదువుల్ సంధ్యయు జ్ఞానముం దయయు నిస్సారంబు
గావించియే,
మదిరాసక్తులౌ వారు మార్గచరులై మాంసాశనంబౌని దు
ష్పదముం ద్రొక్కిన నవ్విధానమునకే పాలౌట న్యాయంబె?
నెమ్మది నూహించి యమానుషంబునగు దుర్మార్గంబు
వర్జింపుడీ॥

గోవు — శ్రీ, యస్. ఆర్. రావుగారు. మద్రాసు.

చ॥ బ్రతికిన గోవుచర్మమును బట్టి విదల్పఁగ జేతులెట్లు దు
ర్మతులకు నాడెనో? తెలియ రాదకటా! నిలువెల్ల జీవముం

హాతమొనరించుచుండ పర మాత్మ యెఱుంగును దాని
బాధ. దు
ష్కృతిచరులార! మీహృదయమే విధియున్నదొ? రాయి
యయ్యెనో!

చ॥ పలువురు మూఢచిత్తులు ప్రపంచములోని సజీవకోటి మ
ర్త్యుల యుపయోగమ్ము జగతి నున్నవటంచు తలంత్రు జీవకో
టులు తమలోన తామదిని దోగ్బలతోటయెనుక్ష్యముచు.న
ప్పలుకులు పల్కువారు తమబంధువులందఱి నేలచంపరో? ॥

ఉ॥ దానములన్నిటన్ ప్రథమదానము పుణ్యమటంచు బల్కు గో
దానముకాన గోవులను ధర్మముగా పశురక్షశాలకున్
దానము సంగడయ్య కుటుంబుల పోలికపెంచుకొంను
మానవపుణ్యసంఘములు మంచివి వానిని వృద్ధిజేయుడీ ॥

ఉ॥ అరయము జీవహింస సిక నైననుమానము మోక్షసిద్ధికై
ధరపయి సిద్ధియే పరమ ధర్మమటంచు నెఱుంగుమింక నీ
పురుగును బహ్మమంచు దలపోయుము జీవికిస్వాత్మ యొక్కటే
యెరుగుము ప్రేమతత్వమున కియ్యదియొక్కటె ప్రేమతత్వమా.

గోసంరక్షణ శ్రీ. బుర్రా నాంచారయ్యగారు బి. ఏ. గుంటూరు.

ఉ॥ పుట్టినదాది పాలొసగి ముద్దుగ బెంచిన కన్నతల్లి నిన్
కొట్టివధింతురే! సుతులు కోవిదులట్టిది చూచినవ్వారే?
పెట్టిన పెట్టకున్నను శపి తురె? పుత్రులదల్లిదండ్రులన్
పొట్టలునిండ గోవులను పట్టెడు పాలనొసంగు వానికిన్
గొట్టగజెల్లునే? కడుపు కోతయు బుట్టదె? వానికొట్టగాన్ ॥

గోకావ్యము—శ్రీమాన్ కాండూరి కృష్ణమాచార్యులుగారు.
గూడూరు.

చ॥ విరటుఁడు నందుఁడున్ నృగుఁడు వీరనృపాగ్రణి రామచంద్రుఁడున్
భరతకులీనులెల్లగను భారతవీరులు గోసమూహమే
పరమధనంబు పూజ్యమని పాలనజేసిరి యార్యజాతికిన్
బిరుదము ధేనురక్ష యది వీడిన బీరమె లేదు చూడుడీ॥

గోరక్షణ గ్రంథము శ్రీ మేడూరి వేంకట సుబ్బయ్యగారు.
ఆత్మకూరు. (కర్నూలు)

గీ॥ ఇలను గోరక్షయెప్పుడు వెలయుగాక!
కటికలకు నైనదయ మది గలుగుగాక!
నిరతమెల్లెడ నేలాటి కొరత లేక,
పాడిపంటలు మెండుగ బరగుగాక! ॥

గోమాత—శ్రీమతి చెంగల్వ రుక్మిణమ్మగారు (మద్రాసు)

కం॥ బండలకు రక్త ధారలు
కుండలతో బోసి కారుకూతలతో మా
కండలనుజూపి దయ్యాపు
ముండల పేరటను మ్రింగు మూర్ఖులు మనుజుల్॥

కం॥ రాసులు కూరలు లేవే?
రాసులు పక్వాన్న భక్ష్య
రాసులు లేవే? వాసిగ భుజింప ధాన్యపు
రాసులు మీగడలు వెన్న రాసులు లేవే?॥

శ్రీయుత బ్రహ్మభొట్ల పట్టాభిరామశర్మ గారు:— గుడివాడ.

సీ॥ ఒడలెరుంగక తూలి పుడమిపై పడుచుండు
కట్టుపుట్టము వీడ గానకుండు
ఎపుడు చూచిన కన్ను లెఱ్ఱజేయుచునుండు
కేకలదూకుల గేరుచుండు
కార్కశ్యమున నోట కారుకూతలు గూయు
విచ్చలవిడి సొమ్ము వెచ్చపెట్టు
అధికుండు గనుపడ నావలావల కేగు
దొంగ దండాల్వేట్ల వంగుచుండు

గీ॥ పెద్దపిన్నల వివరముల్ దుద్దుపెట్టు
తప్పు లేకుండనే యాలి దన్నుచుండు
నిద్దురోల్లకమ్మలెల్ల రద్దిజేయు
తప్పత్రాగెడు మానవాధముడు జగతి.

సీ॥ అన్నమో రామచంద్రా! యని దుఃఖించు
నాలుబిడ్డలగోల మూలద్రోసి
కట్టగా గుడ్డయు బొట్టకు దిండియు
పండమంచము నుండ పట్టులేక
కాయకష్టము చేత గడియించు రొక్కంబు
కల్లుదుకాణాల కొల్లపెట్టి
త్రాగుబోతుల గూడి తందానలాడుచు
దారిదోపుడులకు దారసిల్లి

గీ॥ సిగ్గు బిడియంబు భీతిని బుగ్గిచేసి
పెంటలన్ దిర్గుగాడిద వితముగాంచు
కల్లుసారాయి ద్రాగెడు కలుషమతిని
కులబహిష్కృతుం జేయంగ దలపుడయ్య! ॥

శ్రీ దుగ్గిరాలబలరామకృష్ణయ్యగారు
(బుద్ధచరిత్రము) అంగలూరు. (కృష్ణా)

మ॥ పరమాత్ముండగు దేవదేవునకు సర్వప్రాణముల్ తుల్యముల్
కరుణాదృష్టి నిరీక్షణన్ సకలముల్ గాపాడునారెండె సో
దరబుద్ధిన్ విడనాడి కృత్రిమసమర్థత్వాప్తి గర్వించి సో
దరజంతు ప్రతతిన్ భుజించుటదియుక్తా ధర్మంబె మర్త్యాళికిన్ ॥

గీ॥ సకలజీవులు భగవంతునకు సమంబు
దేవదేవుని బూజింప భావమాదు
గాంక్షగలదేని నెంతేని కరుణగలిగి
జీవహింసను వీడుచు భావుకముగ
భూతదయగాంచి వరలరే పురుషులార!



(గ్రంథకర్తగారి ఛాయాచిత్రం 146A

# ఆశీస్సులు

అహింసాప్రచారమునుగూర్చి లోగడ నాకు చేరిన కొందఱి ఆశీస్సుల నిటఁ బేర్కొనుచున్నాడను.

ఆది హిందూసాంఘిక సేవాసమితి అధ్యక్షులగు శ్రీయుత యం. వి. భాగ్యరెడ్డి వర్మగా రిటుల వ్రాసిరి :—

“ ఆర్యోత్తమా? వందనములు. తా మత్యుత్సాహముతో నిచ్చిన యుపన్యాసముల ఫలితము జయప్రదమగుగాక యని యీశ్వరుని ప్రార్థించుచున్నాడను.

హైద్రాబాదు (దక్షిణ) — విధేయుడు,

15—9—1928 — భాగ్యరెడ్డివర్మ.

---

మిత్రమా? మీరు కడు పిన్నవయస్కులయ్యు, అహింసా ప్రచారక పదవి నలంకరించుటయు, తదనుగుణ్యమైన గ్రంథరాజములను రచించుటయు నెంతయు శ్లాఘనీయము.

పెదప్రోలు, — మండవ చలమయ్య,

కృష్ణాజిల్లా. — 26—12—1929.

---

श्री श्री श्यामा प्रकाश ब्रह्मचारी स्वामी जी महाराज के यहाँ से—

परम कल्यांण भाजनेषु-अशेष शुभाशीर्वचन पूर्वक विज्ञापन मेतत् पेनुगंचि प्रोलु में अहिंसा प्रचार कार्य में तुम ने सफलता प्राप्त की। यह जानकर बहुत ही आनंद हुआ। तुम्हारे शक्ति भर कोशिश करते रहो—श्री भगवान के श्री चरणों में फला फल अर्पण करके अपना कर्तव्य पालन करते रहो। श्री परमेश्वर से तुम्हारे कुशल प्रार्थना करता हूँ। मेरा हार्दिक आशीर्वचन ग्रहण करो। इत्यलम्

बनारस – 23-3-1933 — आशीर्वादक – श्री श्यामा प्रकाश ब्रह्मचारी.

146B

आयुर्विज्ञानाचार्य, पं. गया प्रसाद शास्त्री, वैद्य. एस॰ ए. ए. वी, बी. आर. के यहाँ से—

श्रीमान् ! धन्यवाद । आप स्वस्थ, प्रसन्न तथा आपने काम में लगे हुए हैं इस समाचार से प्रसन्नता है । शेष क्षेम । भवदीय

हैद्राबाद (दक्षिण) 24-9-1937 गया प्रसाद शास्त्री. वैद्य.

---

శ్రీయుత విద్వాన్ కావ్యతీర్థ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రిగారు:-

ఆర్యా? మీ ప్రచారమునకు భూతదయాళుండగు పరమేశ్వరుండు సర్వతోముఖముగం దోడ్పడుగాక.

నంద్యాల, కర్నూలుజిల్లా. 1938 శా స్త్రి.

---

अखिल भारतीय कांग्रेस कमेटी के प्रेसिडेंट के यहाँ से

प्रिय महोदय, पं- जवाहर लाल जी को आपके साथ पूर्ण सहानुभूति है और वे आप की सफलता के लिए शुभ कामनाएँ भेजते हैं।

स्वराज भवन, इलाहाबाद, भवदीय, नरेन्द्र शर्मा,
3-3-1938. आनरी मंत्री.

---

అయ్యా? తమ సంఘసేవ, అహింసాప్రచారము, జీవరక్షాప్రచారక సంఘము తరపున తమరొనర్చిన బ్రహ్మాండమగు కృషి నేటికిని మా కండ్ల యెదుట ప్రత్యక్షము. మీ రెక్కడున్నను స్వార్థరహితమగు ప్రజాసేవ జరుగుచునే యుండును. తమకు చిరతరాయురారోగ్యము నొసంగ సర్వమయుండగు భగవంతుని యెల్లప్పుడు ప్రార్థించుచుండగలను.

మధుపల్లె భవదీయ మిత్త్రుండు,
(మధిర తా.) 17-12-1945 వుట్ల వెంకటప్పయ్య.

---

మహాశయా? నోరులేని పశువులయెడ తమకుం గలిగిన యపారకరుణను పరమేశ్వరుండు సదా వృద్ధియగునట్లు యాశీర్వదించుంగాత. తమ సత్సంకల్పములు నిర్విఘ్నముగా వర్ధిల్లుంగాక.

దయానందాశ్రమము వైదిక ధర్మోపదేశకుండు,
కల్లాడి (కోలారి డిస్ట్రిక్టు) ఆర్యనారాయణ రాజశర్మ.
మైసూరు 11—8—1949

---

# ధర్మజ్యోతి

ఉ॥ ప్రాణినను ఆతనుఁ గలదె, మాంసము ప్రాణులమేనగాక
యమ్మేనుల నొంచునప్డు తమమేనులు సోకినమాత్ర, మె
ట్లగుఁ దానితలంపగావలదె తానదిమానినహింసలన్నియుఁ
మానవెయంచు నుత్తముఁడు మాంసముమాను దయార్ద్ర
చిత్తుడై. ॥భార॥

మాంసాహారము:— ఇది భూమిని బొడిచి తెచ్చునది కాదు. కట్టెలలో కొట్టి తెచ్చునది కాదు. చెక్కలలో చెక్కి తెచ్చునది కాదు. రాళ్లతో రువ్వి తెచ్చునది కాదు. ఆకాశమునుండి ఊడిపడునది గాదు. ప్రాణులను చంపినగాని లభ్యముగాదు. చంపుట, యను శబ్దము క్రౌర్యము, భయంకరము, దుఃఖము, నీతిబాహ్యమును స్ఫురించుచున్నది. సచ్ఛాస్త్రములును, మతప్రవక్తలును మాంసభక్షణాభ్యాసమునకు సమ్మతించి యుండలేదు. మాంసము తినదగినదే అయినయెడల జంతుమారణమునకు, నితరాయుధములతో మానవునకు నవసర ముండగూడదు. వండి తినగూడదు. పచ్చిమాంసమునే భుజింపవలెను. మానవుఁడు మృగమువలె మాంసాహార సంపాదన మొనరింపక పోవుటవలనను, దంతరచన మున్నగువానిలో భేద ముండుటవలన మాంసాహారి గాదని విస్పష్టమగుచున్నది. పాశ్చాత్య దేశములలో గూడ శాకాహారప్రచారక సంఘములు స్థాపింపఁబడి, మాంసాహార మనావశ్యకమనియు, నానారోగములకు హేతువనియు ప్రబోధించుచుండడము మిక్కిలి సంతోషము.

మద్యమాంస సేవనము, జారచోరత్వముల వల్లనే దనుజులు, అస్పృశ్యులను పదవులం బొందిరి. దుష్కర్మంబులొనర్చుట వలననే నీచజాతులలోం జేర్పంబడిరి. ఈ దురాచారములు మానుకొనుట వలన లాభమును, శ్రేయోదాయకముం గూడ. ఆర్యమత సిద్ధాంతములు కడుంగడు నౌదార్యముం గలవి. దేవతలు, ఆర్యులు, కర్మవీరులు, నరాధములను నామంబులు వారి వారి కార్యముల వలననే నియమింపం బడెను. ఎవని హృదయమందిరము దయయు, ప్రేమభావము, శౌచమున్నగు సద్గుణముల కాలవాలమై యుండునో, నతండే యార్యుం డనంబరగు.

ఆ॥ పీన్గ నింటనుండ మేము భుజింపము,
యని బల్కుచుంద్రు యవనియందు
కంచము ననుపీను గెంచక భక్షింత్రు
రుచులు యనుచు జెప్ప బ్రోతలేక.

జీవకారుణ్యా ఆచరణ, టి. వి. మునుస్వామి.

మానవుండు మరణించిన, నా యింటివారు శవమును దహనము గావించియో లేక భూస్థాపితముం జేసియో గాని, స్నానం బాచరింపక అన్నముం దినరు. కొలందిరోజు లంటును బాటింతురు. కోడి, మేక మొదలగువాని నింటిముంగిటే జంపి వండికొని తిందురే! ఈ అంటుదోష నివారణ కాలము నెంత వరకుం బాటింప వలయునో! తెలియకున్నది. రజో దర్శనమైన స్త్రీనిం జూచిన అసహ్యించు కొందురు. శుక్ల శోణితములచే బెరిగిన రక్తమాంసము లెటుల మెక్కెదరో! తెలియకున్నది.

మాంస భుక్కుల హృదయములందు దయయు, ప్రేమయు వసింపఁజాలవు. వారి హృదయములు నల్లజాతినిఁ బోలియుండును. సమస్త యజ్ఞంబు లొనర్చినను, తీర్థయాత్ర లెన్నిచేసి సేవించినను భూతదయవలనఁ గలుఁగు ఫలముతో సాటిరావు. జీవకోటి ఎల్లప్పుడు సౌఖ్యమునే గోరును. కాని దుఃఖమును వాంఛింపవు. జీవింపఁ గోరునేగాని మరణమును గోరవు. కనుక ప్రాణిహత్య ఘోరతరం బగుటఁజేసి విసర్జింపవలెను.

పుడమిని దున్నునపుడును, ధాన్యము దంపునపుడును, ఊడ్చునపుడును, నడచునపుడును, ఆహార పానీయములు సేవించునపుడును, సూక్ష్మాతిసూక్ష్మజీవులు నసించుచుండడము అనివార్యము. గాన నిస్వార్థ, నిరహంకార భావముతో జీవింపవలెను.

చంపువాడు చంపబడక తప్పదు. బాధించువాడు బాధింపఁబడక తప్పదు. లోకువైన జంతువులను చంపుకొని తినుచుండినచో నడవి మృగములకు మనకును భేదమేమి! మీ ప్రాణముపై మీకెంత ప్రీతియో వాని కంతియే. ఏప్రాణినైనను చంపుటకు మనకు హక్కులేదు. మనము చంపఁదలచినచో వానిని తిరిగి సృజింపఁగల్గుటకు శక్తి గలవారుగ నుండవలెను. పుట్టించిన వాఁడే గిట్టింప వలయు. మనము లేని యధికార భారమును పైన వేసికొనినచో నధోలోకంబున నణగి పోగలము. సృష్టికర్తకు సమస్త ప్రాణులు బిడ్డల వంటివి. తండ్రికి బిడ్డలపై నెంతప్రేమ యుండునో పరమేశ్వరుఁడును

సమస్త జీవులపైని అట్టిప్రేమయే జూపును. మీరు దుష్టులు గారు, క్రూరులుగారు. ఆలోచన లేక కులాచారమని భ్రమ జెంది పాప భూయిష్టమైన మాంస భక్షణాభ్యాసమును జేయు చున్నారు. గాన తక్షణమే త్యజించి పావనులగుదురు గాక.

| శాకాహారులు (బలముఁగలవారు) | మాంసాహారులు (బలహీనులు) |
|---|---|
| శ్రీరామచంద్రుఁడు | —రావణాసురుఁడు |
| లక్ష్మణమూర్తి | —ఇంద్రజిత్తు |
| ఆంజనేయుఁడు | —అక్షయకుమారుఁడు, అనేక రాక్షసులు |
| శ్రీకృష్ణమూర్తి | —శిశుపాలుఁడు, కంసాసురుఁడు |
| భీముఁడు | —బక, హిడింబ, కిమ్మీర, జరాసంధ, —దుశ్శాసన, కీచక మున్నగు రాక్షసులు |
| కోడిరామమూర్తి | —శాండో |
| (ఇండియా) | (ఇంగ్లాండు) |

మతగ్రంథములు:— కురాన్ షరీఫ్ (మక్కాయాత్ర) రక్తముఁగల మాంసమును, చచ్చినవాని మాంసమును, ఉఱిచేఁ జచ్చినవాని మాంసమును, దేవిపేరఁ జంపఁబడినవాని మాంసమును, శస్త్రముచే ఛేదింపఁబడినవాని మాంసమును, ఎచ్చట నుండినైన క్రిందఁబడి చచ్చినవాని మాంసమును, ఒరులచేఁ జంపఁబడినవాని మాంసమును భక్షింపకుఁడు.

కురాన్ షరీఫ్ కాం 6, సురా 5 వ 3

బైబిలు:— నీవు నిన్నువలె నీపొరుగువానిని ప్రేమింప వలెను.

మార్కు అ 12, వ 31.

మిమ్ము హింసించువానిని దీవించుఁడి. దీవించుఁడిగాని శపింపవద్దు. రోమా అ 12, వ 14.

ఏసు, మహమ్మదు, బుద్ధ, దయానంద, సదానంద, శ్రద్ధానంద, మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ మున్నగు ప్రవక్తలందరు జీవకారుణ్యమునకే ప్రాధాన్య మిచ్చియుండిరి.

గ్రామదేవత :—అంకమ్మ, మారెమ్మ, గంగానమ్మ, ముత్యాలమ్మ మున్నగు దేవతలు వెలసియున్నారు. వాంతులమ్మ, వాపులమ్మ, దగ్గులమ్మ, బొగ్గులమ్మ యనువారు వెలయుచున్నారు. వెలయనున్నారు. వారికి జరిపే పండుగలలో కొందరు కత్తులఁ జేబూని మేక, కోడి మున్నగు మూఁకప్రాణుల కంఠములను బలవంతముగను, ఘోరముగను ఛేదించుచున్నారు. తత్సమయమున వాని విలవిలఁదన్నులాటలు, దిక్కులు పిక్కటిల్లు దీనారవములు, రక్తము వెడలగ్రక్కు మొండెములు, కఠినుని హృదయమునైనను గరగింపక మానవు. దానికిఁదోడు మానాభిమానములు లేని మనుజుల యావేశపూరితము లగు కేకలను, పైత్యోద్రేకముఁ గలిగించు పంబలవాండ్ర వాద్యములను, కొమ్ములవాండ్ర పాటలను వినినంతనే యెవరిహృదయము వికలించకమానదు? ఆ జాతరయందు మానవరూప రాక్షసులు గావించు కొన్ని చేష్టలను గురించి చెప్పఁగడంగెదను. కటికిదుకాణములు, కల్లంగడులు, త్రాగుబోతుల దురాగతములు, దొంగల దోపిడులు, జూదములు, కోడిపందెములు, గారడివిద్యలు, వ్యభిచారము మొదలగు యవినీతికరములగు

కార్యము లెన్నియేని గలవు. అవి కరుణాయత్తచిత్తులకు నరకముగ గన్పట్టును.

తే॥ గీ॥ నోరు లేనట్టి సాధు జంతువుల బట్టి
అమ్మ వారికి బలియీయ నగునుగాని
తన తనయునేని తన్నేని దారనేని
బలిగ నిచ్చిన యప్పుడా బాధ దెలియు ॥

శ్రీ భమిడిమర్రి రామమూర్తి, కాకినాడ.

గ్రామదేవతలకు మూగ జంతువుల బలినిచ్చువారు తాము గాని, తమవారుగాని బలి అగుచో వాటిబాధ తెలియగలరు.

దయామయులారా! ఆశక్తి నిజముగా జగదీశ్వరి యైనచో భక్తిపూర్వకముగా నర్పించు పుష్పఫలాదులఁ గైకొని సంతోషించును. కాదేని యామెను పూజించువాడు దృఢ సంకల్పముతో తనతల నర్పించిన సంతసించునుగాని దుర్బుద్ధితో యనాధ ప్రాణులఁదెచ్చి తనవద్ద హింసించిన దురాత్మకునిఁ జూచి సంతోషించునా? ఇది కేవలము దుష్కృత్యముగదా! ఇంతకంటె పాపము, నీచము మఱి యేమున్నది! తనకోరికఁ దీర్పుఁడని ప్రజలతో విన్నవించునా! కొంపలు దగులబెట్టునా! రోగము లాపాదించునా! ఇంతకంటె మూఢత్వమేమున్నది?

కొయ్యబొమ్మలు ఱాతిబొమ్మలు మున్నగు వానిని దేవతలని నమ్మి వానిపేరిటఁ ప్రాణుల వధించువాఁడు పామరుఁడును, దుష్టుఁడునై యుండును. నిష్ఫలముఁగూడ. ఇతరుల బిడ్డలఁజంపి తమబిడ్డలను రక్షింపనెంచుట న్యాయవిరుద్ధము గదా!

బైబిలు:—ఎడ్లయొక్కయు, మేకలయొక్కయు రక్తము పాపములను తీసివేయుట అసాధ్యము. హెబ్రీయులకు అ 10, వ 4.

ఉపకారమును, ధర్మమును చేయ మరచిపోకుఁడి. అట్టి యాగములు దేవుని కిష్టమైనవి. హెబ్రీయులకు అ 13, వ 16. అయ్యలారా! ఈ మాంస భక్షకులను, ఈ త్రాగుబోతులను, ఈ దుర్మార్గులను, ఈ జ్ఞాన హీనులను చాలామందిని జాతఱలకు రప్పించి వీరందరినిఁ జూచి మీరేల సంతసించుచున్నారు! ఇది కూడదని పనియని మీరు నిరోధింపవలదా? మీరు నిజముగా జ్ఞానసంపన్నులైనచో దాపునున్న జంతు హత్యలను ఆపివేసి మహత్తర పుణ్యంబును సంపాదించుఁడు. మీరు స్వయముగా వధింపకున్నను అందు కామోదించి యూరకుండినచో మీరీ పాపంబున పాలుపంచుకొనక తప్పదు. అహింసాధర్మముఁ బ్రాణి సమూహములకు హితకారిణి. దుఃఖదావానలమును జల్లార్పు మేఘపటలము మీ చిత్తమును ధర్మమునందుఁ జొప్పింపుఁడు. అధర్మమునకు మాత హింసయను రాక్షసి. ధర్మమునకు మాత దయయను మహాదేవి. దయను గలిగి యుండుఁడి. ధర్మ మార్జించుఁడి.

కం॥ గోవే తల్లియు దండ్రియు
గోవే మన తోడునీడ గోవే నిధియా
గోవే యాకలిఁ దీర్చును
గోవే మనపాలి లచ్చి గోవె ధనంబా.

గోసంరక్షణ – బుర్రా నాంచారయ్య బి. ఏ

పశుధనము :— పూర్వకాలమం దార్యులు ధనము లన్నింటిలో పశుధన మెక్కుడుగా ప్రేమించిరి. భగవత్ప్రసాదితమగు పచ్చికను దిని యమృతమువలె నుండు పాలనిచ్చును. ఆహారపానీయము లన్నిట నావుపాలే శ్రేష్ఠమును మధురము నై యుండును. అవిలేనియెడల తల్లులులేని పిల్లల జీవనము దుస్సాధ్య మగును. మనుజుని శరీరదార్ఢ్యమునకును, బుద్ధికుశలతకును, నాయుర్వృద్ధికిని బాలే తోడ్పడుచున్నవి. నెయ్యి పెక్కువిధములగు వంటకములలో వినియోగించెదరు. ఎట్టి తినుబండారమైనను నెయ్యిలేక రుచింపదు. మలమూత్రములవలన సస్యాదులు చక్కగా ఫలించుచున్నవి. సస్యములు ఫలించనియెడల మనము బ్రతుకుటయే కల్లయగును. లేగ లెదిగి కష్టము సహించి మన సేద్యమును కొనసాగించుచున్నవి. బండ్ల ద్వారా ధాన్యపదార్థముల నింటికిఁ జేర్చుచున్నవి. వృద్ధాప్యము సంభవించువరకును మన సేవయే జేయుచున్నవి.

వే॥ నీకు ఫలమిచ్చినన్నాళ్ళు నిలుపుకొంటి
గొడ్డువోయిన నిలువెల్లఁ గొట్టుచుంటి
ఏండ్లుగడచి సంపాదన మెఱుఁగకున్న
నీ జనకు నిట్లు త్యజియింప నేర్తువయ్య ?

'గోవు' - కందుకూరి నరసింహారావు.

కదలమెదలలేని బక్కపశువులను సేద్యగాండ్రు కొందఱు స్వార్థపరులై యే మైదారు రూప్యములకో కటికివారి స్వాధీనముఁ జేయుచున్నారు. అట్లొనర్చుట న్యాయమగుచో మన కుపకరించని వృద్ధులగు తల్లి దండ్రులను మారణ చేయవలదా? ఇది

చన్నుఁగుడిచి రొమ్ము గ్రుద్దినటు లుండును. కటకటా! స్వలాభ మపేక్షించు మానవాధములకంటె పశుజాతియే సర్వోత్తమమని బాహాటముగ జాటవచ్చు. వానిపై గృతజ్ఞత జూపుటకు మారుగా కృతఘ్నత జూపుచున్నారు. నిర్మలమగు క్షీరము నిచ్చు పశుజాతిని సంహరించి విదేశీయ పాల డబ్బీలకై కరంబులఁ జాపుచున్నారు.

తే॥ గోవులకుఁ దృప్తిగా మేతఁ గొఱఁత లేక
గ్రాసవాసాది సౌఖ్యము గలుగఁ జేసి
వానిపాలను గ్రహియించు వారి కెందు
నాయురారోగ్య భాగ్యంబు లమరుచుండు. శ్రీ గవాభ్యుదయము

శతావధాని, శ్రీ మలకపల్లి పెద శేషగిరిరావు, కాకినాడ.

రోగములు, మూఢనమ్మకములు— తమకుగాని, తమ పశువులకుగాని ఏవిధైన రోగములు సంప్రాప్తమైన, యోగ్యులగు వైద్యులద్వారా చికిత్సలఁ గావింపించక, గ్రామదేవతలకు ముడుపులుగట్టి తాము అకాలమృత్యువునకు గుఱి యగుటయే గాక, తోడి పశువులనుగూడ గుఱిజేయుచున్నారు. బ్రతికినచో దేవతా మహిమయనియు, లేనిచో కాలముఁ దీరినదనియు అందురు. అందినజుట్టు, అందనిచో కాళ్ళన్నట్లు. కాలముఁ దీరిపోవువానిని దేవి బ్రతికించదు గాబోలు! వానితోపాటు అనవసరముగా, బలవంతముగా, బుద్ధిపూర్వకముగా మూఁక ప్రాణుల బలి నిచ్చువారు దానవులు గాక, మానవు లెటు లగుదురు!

పాచిన యన్నము, మురికినీరు, కుళ్ళినపండ్లు, పక్వము గాని పదార్థములు సేవించుటవలనను, కొన్ని క్రిములద్వారాను కలరా, మశూచి మున్నగు అంటువ్యాధులు మానవులలోను, మానవేతర ప్రాణులలోను, వ్యాపించుచున్నవి. గనుక, తాము నివసించు గృహములు, పశువుల దొడ్లు, ఆహారపానీయములు పవిత్రముగా నుంచుకొనుట ముఖ్యము.

మద్యపానము:- శుకశ్చైవ పికశ్చైవ హనుమాంశ్చ విభీషణః। కర్ణశ్చ కుంభకర్ణశ్చ ఇత్యేతే పానలక్షణం॥

త్రాగినవాడు మొదట చిలుకవలె పలుకును. పిదప కోకిలవలె పాడును. ఆవెనుక హనుమంతునివలె కుప్పిగంతులు వేయును. విభీషణునివలె నీతులు చెప్పును. తనతోపాటు త్రాగ వచ్చిన వారందరికి లేదనకుండ భోయించి దాతృత్వమునందు కర్ణుని మించును. తరువాత స్మృతిదప్పి బడిపోయి కుంభకర్ణునివలె నిద్రపోవును. ఈచెప్పినవి, త్రాగుబోతులలో శ్రేష్ఠుల లక్షణములు. తుచ్ఛులగు వారిమాట చెప్ప నక్కరయేలేదు. వారికి త్రాగిన వెంటనే కాల్చిన మాంసపు ముక్కలు కావలయును. నోట బూతులే వాడవలయును. చేతితో కిరాత కృత్యములే చేయ వలయును. త్రాగుబోతు మానవ హత్యకైనను వెనుదీయడు. తాను బావిలో బడునదియు నెరుగడు. బట్ట యూడి పోవు నదియు గానడు. వీధులవెంట అశుద్ధ వస్తువులయందు దొర లాడును. త్రాగినవాని నోరు అశుద్ధముకంటె నసహ్యమనిన నిం దతిశయోక్తి లేదు. సభలోనికి వచ్చుటకు అనర్హుడు. వానింజూచిన వారు లోపలనైనం దిట్టక మానరు. త్రాగుబోతు

యింటి వారందరితోను నిష్కారణముగా తగవులాడును. వారిని కొట్టును; భార్యను, తల్లిని బండబూతులు కూయును. వాని కుటుంబ దుస్థితిని వర్ణింప నెవరికిని తరముగాదు. వాని భార్య పుట్టినింటి కేగుటయో, లేక వానిని విడచి వెళ్ళుటయో, మరణించుటయో; సంభవించు చుండును. త్రాగుడువలన మీ శరీరమున గల బలము క్షీణించి ఆయుష్యము తగ్గును. కొంప గుల్లయగును. భార్యమెడలోని పుస్తెను అమ్మవలసి వచ్చును లక్షాధికారి యైనను భిక్షాధికారి యగుట తప్పదు. ఎందరో ధనవంతులు త్రాగి త్రాగి దరిద్రులై, భ్రష్టులై పోవుచుండ, మీరు జూచి యుండలేదా ? కావున మీరు ఆరోగ్యవంతులుగ శ్రీమంతులుగ, గౌరవనీయులుగ నుండగోరిన త్రాగుడు మానుడు. భూతదయా పరాయణులు లీ యమానుష కృత్యము లను నిర్మూలింతురుగాక ! జ్ఞానవంతులీపామండ కులాచారము లను వినాశన మొనర్తురు గాక !

గీ॥ సారాయిదాగుట సభకుయోగ్యముగాదు
కల్లుదాగుట మొదలె కానెకాదు
వీని త్రాగుటకన్న ... త్రాగుటమేలు
నారసింహదాస నారసింహా.

బైబిలు —మద్యముతో మత్తులై యుండకుడి.

ఎఫెసీయులకు అ 5, వ 18.

లోకా స్సమస్తా స్సుఖినోభవంతు

భూతదయను బూనరేమన్నా! ఈ పుడమియందున -
పుణ్యచరితము వేరె లేదన్నా॥
ఖ్యాతిగాంచిన క్రీస్తుబుద్ధుల, భాతిమహమదు, వేమనార్యులు-
నీతిమార్గం బిదియె యనుచు, ప్రీతితో నెల్లెడల జాటిరి॥భూ॥
మూక ప్రాణుల గాంచుమోయన్నా! వేమరక నిత్యము -
మనల కుపకృతి జేయునో యన్నా—
యజ్ఞయాగములందు పూర్వము,అజ్ఞులగు బ్రాహ్మణులు కొందఱు
ప్రజ్ఞ యనుకొని మేకపోతుల, బట్టుకొని వధియించినారట!॥
శ్రాద్ధ దివసములందు గనుమన్నా! మధు మాంస సేవన -
మెన్నొ రీతులజరుగు చుండన్నా—
బ్రతికియున్న మాతపితరుల, అతికియున్న బీదప్రజల - ప్రీతి
తోడుత గావలేకను, మతి విహీనులు మనుచు నుందురు॥
మాఘఫాల్గుణ మాసమోయన్నా! క్షితిమూక ప్రాణి -హాత్య
యే కడు పర్వదిన మన్నా—
దేవి ముంగిట దీనజంతుల, శివమిరగ గత్తి నెత్తియు గ్రొవ్వి
మనమున భీతిలేకను, రివ్వు రివ్వున గత్తిరింతురు॥
మాంసభక్షణ వీడుమోయన్నా! ఇది మనకు నుత్తమ - భోజ
నమ్ముగాదు సుమ్మన్నా॥
మానవాళికి దిండిగాదు, దానవాళికి సమ్మతంబు - కాననం
బుల దిరిగి వారు, లీన్నులై వేటాడు చుందురు॥
శ్రుతి స్మృతులు వచించు బోధలను, పెడచెవిని బెట్టక -ననుక
రించుము నాదరంబునను—
సర్వులకు నాహార నిద్రలు, సర్వులకు భయమైథు నమ్ములు
సర్వులకు సుఖదుఃఖములును, సర్వులకు నివి సరిసమానం॥-

మాండ్ - ఆది (సాయంవరదాదాసు)

ప॥ మాంసభక్షణము మానండీ పర। మాత్మనిమదిలోనమ్మండీ
హింస నెరింగిన యనుభవపరులై ।హింసకు లోబడనేలవినండీ॥
1 జీవులమొఱనాలించండీ యవి । దేవునిబిడ్డలై యనుకొండీ
జీవులపై దయలేని కఠినునకు । జీవబ్రహ్మైక్యము లేదండీ॥
2 తనుకలాడడము చూడండీ మీ।కనులకు గన్పడ దేమండీ
పనవిపనవి చేచేయనియరువగ।పరపరకంఠముగోయుదురండీ॥
3 మీ శరీరములఁగోయండీ లవ । లేశమైన సహియింపండీ
మీ శరీరమున కున్న బాధలే । యాశరీరి కున్నవియనుకొండీ॥
4 కొని తింటున్నామనకండీ యవి । కోయుటకొంటే నేమండీ
తినువారలు లేకుంటే కోయరు । తిన,కన,కోసిన యనుకొన
దోసము॥
5 శుక్లశోణిత మయమండీ యది । చూడ నసహ్యంబగునండీ
శుక్లశోణితము ముట్టరాదుకద । అక్కట నాలుకపై యెటు
లుంతురు!॥
6 కాటిలో వేసేశవమండీ యది । కడుపున వేయగనేలండీ
కాటికి పోవును పీనుగలందురు।కడుపుండగ మఱికాడేలండీ॥
7 జీవుల మీవలె సాకండీ యా । జీవసహాయము పొందండీ
నిద్రలేపుటకు, నీటి శుద్ధికిని।పాలు, పెంట, కంబళ్ల తృప్తిగని॥
8 కాయగూరలే చాలండీ మన। కాయము నిల్పుట కొఱకండీ
కాయగూరలకు ఇంద్రియరహితము । కావున బాధల గన
బోవండీ॥
9 కరుణకు మిక్కిలి లేదండీ యది । పగమపదవికే బాటండీ
కరుణలేని వేదాంతము నోటికి। బరువేదానితో ఫలమేమండీ॥

10 కరుణే దేవుని గుణమండీ యా। కరుణను ముందుగ నేర్వండీ
ధరలో వేమన బుద్ధ మహాత్ములు । పరిపూర్ణంబగు పదవిని
బొందిరి॥

తోహర - నీలం వెంకయ్యదాసు

1 సోదరులారా సుఖము గోరితే కల్లు సార మానండి
పతిత పావనుని మది దలంచితే కల్లు సార మానండి॥
2 ఆరోగ్యంబుగ నుండఁగోరితే కల్లు సార మానండి
యిరుగు పొరుగుతో యిష్టముఁగోరితే కల్లు సారమానండి॥
3 శతవర్షంబులు బ్రతుక గోరితే కల్లు సార మానండి
మతధర్మంబుల మనుప గోరితే కల్లు సార మానండి॥
4 పిల్లల నాలిని పెంచఁ గోరితే కల్లు సార మానండి
యిల్లు వాకిండ్లను నిలుపఁ గోరితే కల్లు సార మానండి॥
5 తుంటరి తనములు దోలియ గోరితే కల్లు సారమానండి
కొంటెవాదములఁ గూల్ప గోరితే కల్లు సార మానండి॥
6 ఐకమత్యముతో నలరఁ గోరితే కల్లు సార మానండి
నీపై కమంతయును నిలుప నెంచితే కల్లు సార మానండి।
7 బలవంతుఁడవై పరఁగ గోరితే కల్లు సార మానండి
పాలు పెరుగు త్రావగ గోరితే కల్లు సార మానండి ॥సో॥

---



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA111B148 |
| పుస్తకం పేరు | దయాదర్శము |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 183 |
| పెద్ద సైజు పేజీలు | |
| ఖాళీ పేజీలు | VI, 58 B, |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Vedavathi |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |